శ్రీః

మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

## రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యాసహితమ్

వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్

పఞ్చమః సర్గః



**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)

లెక్చరర్

4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః

మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

**కుమారసమ్భవమహాకావ్యమ్**

**రామోరావిరచిత మృణాళినీవ్యాఖ్యా సహితమ్**

వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్

పఞ్చమః సర్గః

ప్రథమ ముద్రణ: శ్రీ ఖరనామ సంవత్సరము, దీపావళి **26-10-11**

ప్రతులు : **500**

పేజీలు : **270**

వెల రూ. : **150/-**



Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala-523157

**Residence:**

4-103, I.L.T.D. Colony Extn.,

Kothapet, CHIRALA - 523157

Cell :**94401 15411, 9052256311, 08594 - 234038**

D.T.P.:

**MR LASER PRINTS**

Chirala

Cell: **9849976054**



Printed at :

**KARSHAK ART PRINTERS**

Hyderabad.

# “జగత్కల్యాణదాయకప్రణయకావ్యసౌందర్యము

– ఆచార్య గోగినేని యోగప్రభావతీదేవి

కుమారసంభవమహాకావ్యమంతయు సర్వశక్తిసంపన్నుడగు కుమారజననముపై కావింపబడిన నాందీ ప్రస్తావన. అనంతవిశ్వఫలకముపై చిత్రింపబడిన మహా చిత్రము. ముక్కోటి దేవతాకోటి యుత్కంఠతో నిరీక్షించిన పార్వతీపరమేశ్వరుల దివ్యదాంపత్యమెట్టి త్యాగనిష్ఠాగరిష్ఠతచే, పవిత్రవైవాహికవిధిరూపమును దాల్చెనో యీ కావ్య ముద్బోధించును.

తన త్రిభువనమోహన కరమైన సౌందర్యసంపదతో త్ర్యంబకుని హృదయమును రంజింపలేక వ్రీడావనతవదనయైన పర్వతరాజపుత్రి భౌతికసౌందర్యమే స్త్రీకి సర్వోత్కృష్టము కాదని, నిరర్థకమని గుర్తించి – ‘నినింద రూపం హృదయేన పార్వతీ’ – పతి ప్రశంసలకు పాత్రము కాని తన రూపమును హృదయపూర్వకముగా నిందించుకొన్నది.

‘ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా’ – పతిని మెప్పించని చెలువు నిష్ఫలమని యెంచి, సమాధిస్థితి నంది తీవ్రతపశ్చర్యలచేతనైనను నవంధ్యరూప కావలయునని నిశ్చయించినది. అసిధారా వ్రతమునకు కడంగినది. తదనుకూలముగ నారచీరలు కట్టి, అక్షమాల చేత ధరించినది. ఆశ్రమజీవితము నేర్పఱచుకొని నిష్ఠుర నియమావళి నాచరణమున సుకరము చేసికొన్నది. నైష్ఠికసౌందర్యవిశిష్టతతో ఆశ్రమ తపస్విని యైనది. సత్యశివసుందరమైన ప్రణయదేవతాసాక్షాత్కారమునకు నిరీక్షించుచున్నది.

పర్యాప్తపుష్పస్తబకనమ్రయై, సంచారిణియగు పల్లవలతవోలె, తన్ను సమీపించిన హిమరాజపుత్రికను తిరస్కరించిన త్రిపురాంతకుడే, గౌరీ శిఖరమున ‘అపర్ణ’ యగు నుమాదేవిని, కపటబ్రహ్మచారిరూపమున జేరి నిరీక్షించి యామె కఠినతపః పరిపాలనమునకు పరితోషితాత్ముడై, నిజరూపమున సాక్షాత్కరించి, ‘అద్య ప్రభృత్యవనతాఙ్గి! తవాస్మి దాసః క్రీతస్తపోభిః’ – ఓ యవనతాంగి! నేటినుండి నేను నీ దాసుడను, నీ తపశ్చర్యలచే నమ్ముడువోయితి’ నన్నాడు. నైష్ఠిక సౌందర్యమునకు పరమేశ్వరుడు కూడా తనకు తానై ఆత్మసమర్పణము గావించుకొన్నాడు.

తీవ్రతపశ్చర్యా సంతప్త జనిత నైష్ఠికశక్తి సౌభాగ్యయగు గౌరీదేవికి గాని, ముక్కోటి దేవతలకు తారకాసురబాధావిముక్తిదాయకుడగు కుమారస్వామి జనింపడు.





మనశ్చాంచల్యస్థానమున దృఢసమాధి నిష్ఠకు, భౌతికసౌందర్యవ్యామోహ స్థానమున, కళ్యాణాత్మకమయిన ఆంతరంగికసౌందర్యమును, వసంత విజృంభణాతి శయమయిన పర్వతారణ్యముల స్థానమున నానందోత్సాహ విలసితమయిన త్రిభువనములను జేకూర్చి కాళిదాసు కవిసార్వభౌముడైనాడు.

మారుడు పొదరింటి చాటున పొంచుండి సంయమన వినాశము నాధారముగా కురిపించిన సాయకములు, సత్సంతాన సంప్రాప్తి సాధకములు కావు. కామప్రేరితులయిన దంపతుల కింద్రియసంతృప్తియే పరమలక్ష్యము కాని పుత్రప్రాప్తి కాదు. ఆ కారణముచేతనే కాళిదాస కవీశ్వరుడు కాముని దహింపజేసి, పార్వతిని తీవ్రతపశ్చర్యలకు సంసిద్ధమొనరించెను.

కామోద్రిక్తత పతనకారణమనియు, సంయమనసద్భావము సమగ్ర ఫలదాయకమనియు, నైతికశక్తిసముత్ఫుల్లసౌందర్యము సుస్థిరమైన దనియు, ప్రశాంతసంయమన శుభోదర్కమయిన ప్రేమయే సర్వోత్కృష్టమైనదనియు, సంయమనమునందు సత్యసౌందర్యాకర్షణము కలదనియు, శ్రుతిమించిన స్వేచ్ఛా సౌందర్యము వినాశహేతువనియు, కాళిదాస కవీశ్వరుడే కావ్యమున కాంతా సమ్మితముగా నీతి నుపదేశించుచున్నాడు. నైతికోద్దీప్తిని ప్రసాదించు జగత్కల్యాణ దాయకప్రణయదీప్తిని మనోహరకావ్యరూపమున కాళిదాస కవీంద్రుడు జ్వాజ్వల్యమాన మొనర్చినాడు.

పార్వతి సౌందర్యము ప్రణయమునందు, ప్రణయము పరిణయమందు పరిణయము కుమార ప్రభవమునందు ప్రాభవము నొందెను. శివుని వశీకృతుని గావించుకొనుటతో నామె ప్రేమ తనవి సనలేదు. అతని మెప్పించి శరీరార్ధము నాచికొన్నగాని కృతకృత్యత భావింపలేదు. జగత్పితకు జాయయై జగదుద్ధారకుడగు కుమారస్వామిని ప్రసాదించి జగన్మాతృగౌరవము నందుకొన్నది. సత్సంతానమే ఉత్తమదాంపత్యఫలము, పరమార్థము.

పార్వతి సౌందర్యము లోకాతీతము. దానిని కవి తన యసాధారణశిల్ప సామర్థ్యముతో నుత్తమచిత్రకారునివలె చిత్రించినాడు. తానసాధారణ సౌందర్యవతి నని గిరిరాజసుతకు తెలియును. యౌవనమే యహంకారమునకు కరావలంబన మొసగినది. ఈ స్థితిలో నామె శివుని వశీకృతుని గావించుకొనుటకై శుశ్రూష యొనర్చినది. ఈమెకు మన్మథుడు, మన్మథుడీమెకు, నిరువురకు మాధవుడు

సాయపడి ఓడిపోయిరి. భౌతికసౌందర్యము ఆత్మసౌందర్యము కన్న అధమమని, ఉత్తమప్రయోజనములను సాధింపజాల దనువిషయ మీకావ్యమున కాంతా సమ్మితముగా బోధింపబడెను.

అహంకారము రజోగుణలక్షణము. రజోగుణ మడంగినగాని సత్త్వోద్రేకమున కవకాశము లేదు. సత్త్వోద్రేకమున గాని శివ వశీకరణము సాధ్యము కాదు. మన్మథ నిర్మథనముతో పార్వతి యౌవనాహంకార మంతరించెను. అతనిని సాధించుటకు తన సుందరశరీరసంపద నిరర్థకమనియు సమర్థించుకొన్నది. దుర్లభుడైన శివుని సమాగమమునకు మార్గాంతరము గానక తపోదీక్ష వహించినది. ముందు సర్వసమత్వము నలవఱచుకొన్నది. తరులతాదులందు, కురంగశాబకములందు వాత్సల్యము నెఱపినది. శీతోష్ణాది ద్వంద్వములందు సమభావమును సాధించినది. ఈ విధముగా పార్వతి ప్రకృతితో నభేదము నందినది. ఇక పురుషునితో నొందవలసియున్నది. నిత్యాభియుక్తురాలై యనన్యచిత్తముతో శివుని పర్యు పాసించినది.

మహోన్నతపదవి నాకాంక్షించిన పార్వతి పరమేశ్వరుని అగ్నిపరీక్షలో నెగ్గి ధర్మమార్గము కైవసము గావించుకొన్నది. కడకు శారీరకముగా గూడ నద్వైత సిద్ధినంది లోకారాధ్యయైనది. పార్వతిభక్తికి, ఆత్మార్పణమునకు సంతుష్ట హృదయుడైన పరమేశ్వరుడు, వృషకేతనుడై స్వస్వరూపము నంది, స్మితాననముతో పార్వతి పాణిగ్రహణమును కాంక్షించెను. శైలాధిరాజతనయ సరసాంగయష్టి చలించినది. ఎత్తిన పాదమెత్తినట్లే యుండి యెటు వైపునకు మోపజాలక నిలబడిపోయినది. అచట నిలువజాలక సిగ్గువడినది. ఈ స్థితినంతయు "మార్గాచల వ్యతికరాకులితేవ సింధుః" అని చిత్రించుట కాళిదాసు కవితాశిల్పము ననల్పముగా వ్యక్తము చేయుచున్నది.

భారతీయప్రణయరహస్యగోపనము కుమారసంభవకావ్యమున, అందులోను పంచమసర్గమున భావించుకొలది భావింపజేయును.

నా సోదరుడు శ్రీ రావి మోహనరావుగా రీకుమారసంభవవ్యాఖ్యానకారుడుగా అఖండయశస్సు నార్జించుట అపరిమితానందము నొడగూర్చుచున్నది.

– ఆచార్య గోగినేని యోగప్రభావతీదేవి
తెలుగుశాఖ, ఆచార్య నాగార్జునవిశ్వవిద్యాలయము
20–5–2011





శ్రీః

ఓం కుమార శ్రీగురవే నమః



## మృణాళినీ వ్యాఖ్యానమున

ఉదాహరింపబడిన విషయములకు సంబంధించిన
ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.

❋

ఇట సహకరించిన డా॥ పుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,
డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు, డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు,
మేళ్లచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ ఇప్పగుంట సాయిబాబాగారు,
డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల
శ్రీరామచంద్రుడుగార్లకు మఱియు అడిగిన వెంటనే
'జగత్కల్యాణదాయకప్రణయకావ్యసౌందర్యము' అందించిన
డా॥ గోగినేని యోగప్రభావతీదేవిగారు,
డా॥ కందాళ లక్ష్మీనారాయణగారు, గరిమెళ్ళ సోమయాజులుశర్మగారు,
ప్రియమిత్రులు శ్రీ కె. అరవిందరావు గార్లకు

❋

నా ఆరాధ్యదైవమైన
మహాయోగి శ్రీఅరవిందభగవానుడు,
వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ.....

❋

శ్లో॥ నాహం మనేయ సువేదేతి – నో న వేదేతి వేద చ।
యో నస్ తద్వేద తద్వేద – నో న వేదేతి వేద చ॥

– కేనోపనిషత్ 10

ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః

**- రా మో రా**

శ్రీః

# కుమారసమ్భవమహాకావ్యమ్

## 'తపఃఫలోదయో' నామ పఞ్చమః సర్గః



**అవతారికా** : భగ్నమనోరథయా పార్వత్యా స్వరూపగర్హణమ్ – భగ్నమనోరథ అయిన పార్వతి తన సౌందర్యమును నిందించుకొనుట.

**శ్లో॥ తథా సమక్షం దహతా మనోభవం**
**పినాకినా భగ్నమనోరథా సతీ।**
**నినిన్ద రూపం హృదయేన పార్వతీ**
**ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా॥** **1**

**పదవిభాగము :–** తథా, సమక్షమ్, దహతా, మనోభవమ్, పినాకినా, భగ్నమనోరథా, సతీ, నినిన్ద, రూపమ్, హృదయేన, పార్వతీ, ప్రియేషు, సౌభాగ్యఫలా, హి, చారుతా।

**అన్వయక్రమము :–** పార్వతీ తథా సమక్షం మనోభవం దహతా పినాకినా భగ్నమనోరథా సతీ హృదయేన రూపం నినిన్ద। హి చారుతా ప్రియేషు సౌభాగ్యఫలా (భవతి)।

**ప్రతిపదార్థము :–** పార్వతీ – పార్వతీదేవి, తథా – అవ్విధమున, సమక్షమ్ – తన కన్నుల యెదుటనే, మనోభవమ్ – మన్మథుని, దహతా – దగ్ధము చేసిన, పినాకినా – త్రిణేత్రునిచేత, భగ్నమనోరథా సతీ – చెఱుపబడిన కోర్కెగలదై, హృదయేన – మనస్సుచేత, రూపమ్ – తన చక్కదనమును, నినిన్ద – దూషించుకొనెను, హి – ఏలయన, చారుతా – సౌందర్యము, ప్రియేషు – పతులయెడ, సౌభాగ్యఫలా – ప్రియవాల్లభ్యప్రయోజనముగలది, (భవతి – అగుచున్నది.)

**తాత్పర్యము :–** పార్వతీదేవి అవ్విధమున తన కన్నులయెదుటనే మన్మథుని దగ్ధము చేసిన త్రిణేత్రునిచేత చెఱుపబడిన కోర్కెగలదై, మనస్సులో (తన) చక్కదనమును





దూషించుకొనెను. ఏలయన సౌందర్యము పతులయెడ ప్రియవాల్లభ్య ప్రయోజనము గలది (అగుచున్నది.)

**పాఠాన్తరాలు :–** ప్రియేషు సౌభాగ్య – ప్రియే సుసౌభాగ్య

**విభక్తులు/క్రియలు:–** 1.పార్వతీ – **పార్వతీ**, పార్వత్యౌ, పార్వత్యః; ఈకారాన్త స్త్రీలింగ పార్వతీశబ్దము, ప్ర.ఏ. 2. తథా, హి – అవ్యయాలు 3. సమక్షమ్ – అవ్యయము 4. మనోభవమ్ – **మనోభవమ్**, మనోభవౌ, మనోభవాన్; అకారాన్త పుంలింగ మనోభవశబ్దము. ద్వి.ఏ 5. దహతా – **దహతా**, దహద్భ్యామ్, దహద్భిః, నకారాన్త పుంలింగ శతృన్తో 'దహత్'శబ్దము. తృ.ఏ 6. పినాకినా – **పినాకినా,** పినాకిభ్యామ్, పినాకిభిః; నకారాన్త పుంలింగ పినాకిన్ శబ్దము. తృ.ఏ 7. భగ్నమనోరథా – **భగ్నమనోరథా,** భగ్నమనోరథే, భగ్నమనోరథాః; ఆకారాన్త స్త్రీలింగ భగ్నమనోరథాశబ్దము. ప్ర.ఏ 8. సతీ – సతీ, సత్యౌ, సత్యః; ఈకారాన్త స్త్రీలింగ సతీశబ్దము. ప్ర.ఏ 9. హృదయేన – **హృదయేన,** హృదయాభ్యామ్, హృదయైః; అకారాన్త నపుంసకలింగ హృదయశబ్దము. తృ.ఏ 10. రూపమ్ – **రూపమ్,** రూపే, రూపాణి; అకారాన్త నపుంసకలింగ రూపశబ్దము. ద్వి.ఏ 11. నినిన్ద – క్రియ – లిట్ – ప్ర.ఏ 12. చారుతా – **చారుతా**, చారుతే, చారుతాః; ఆకారాన్త స్త్రీలింగ చారుతాశబ్దము. ప్ర.ఏ 13. ప్రియేషు – ప్రియే, ప్రియయోః, **ప్రియేషు**; అకారాన్త పుంలింగ ప్రియశబ్దము. స.బ 14. సౌభాగ్యఫలా – **సౌభాగ్యఫలా**, సౌభాగ్యఫలే, సౌభాగ్యఫలాః; ఆకారాన్త స్త్రీలింగసౌభాగ్యఫలాశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1. సమక్షమ్ – అక్ష్ణోః సమీపే –అవ్యయీభావసమాసః।
2. మనోభవమ్ – మనసి భవః మనోభవః (స.త) తమ్ ।
3. పినాకినా – పినాకః అస్యాస్తీతి – పినాకీ (తద్ధితాన్తమ్) తేన।
4. భగ్నమనోరథా – భగ్నః మనోరథః యస్యాః (బహుప్రీహి) సా।
5. సౌభాగ్యఫలా – సౌభాగ్యం ఫలం యస్యాః (బహుప్రీహి) సా।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. పార్వతీ –(స్త్రీ.)**

ఎ) పర్వతస్య అపత్యం స్త్రీ। తద్ధితాన్తమ్।
బి) పర్వతో హిమాచలస్తస్య తదధిష్ఠాతృదేవస్యేతి భావః, అపత్యమితి। అణ్+జీప్।
సి) శ్లో॥ 'తిథిభేదే కల్పభేదే పర్వభేదే ప్రభేదతః।
ఖ్యాతౌ తేషు చ విఖ్యాతా **పార్వతీ** తేన కీర్తితా॥'
శ్లో॥ 'మహోత్సవవిశేషశ్చ పరస్వితి ప్రకీర్తితమ్।
తస్యాధిదేవీ యా సా చ **పార్వతీ** పరికీర్తితా॥'

శ్లో॥ 'పర్వతస్య సుతా దేవీ సావిర్భూతా చ పర్వతే।
పర్వతాధిష్ఠాతృదేవీ పార్వతీ తేన కీర్తితా॥'
– ఇతి ప్రకృతిఖణ్డే దుర్గోపాఖ్యానే 54 అధ్యాయః।

డి) శ్లో॥ 'రుద్రాణీ శర్వాణీ కాలీ కాత్యాయనీ భవానీ చ॥
ఆర్యామ్బికా మృడానీ హైమవతీ **పార్వతీ** గౌరీ॥15
శ్లో॥ ఉమా భగవతీ దుర్గా చణ్డీ దాక్షాయణీ శివా।
అపర్ణా స్యాన్మహాదేవీ గిరిజా మేనకాత్మజా॥ 16

అని హలాయుధకోశము 'పార్వతీదేవి'కి 21 నామములను పేర్కొన్నది.

ఇ) శ్లో॥ తాం పార్వతీత్యాభిజనేన నామ్నా బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ।
ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ॥
– కు. సం. 1-26

**అలంకారములు** :– ఇందు 'అర్థాంతరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము** :– 'ఉక్తిరర్థాన్తరన్యాసస్స్యాత్సామాన్యవిశేషయోః' చంద్రాలోకము – 61

సామాన్య విశేషములను చెప్పుట యర్థాన్తరన్యాసాలంకారము. విశేషమును చెప్పి దానిని సమర్థించుటకుగాను సామాన్యమును చెప్పుట, అర్థాన్తరన్యాసమందలి ప్రథమరీతి. సామాన్యమును చెప్పి దానిని సమర్థించుటకుగాను విశేషమును చెప్పుట అర్థాన్తరన్యాసమందలి ద్వితీయరీతి।

ఇట 'స్త్రీల సౌందర్యమునకు భర్తృవాల్లభ్యమే కదా ఫలము' అనెడి సామాన్యముచే సౌందర్యదూషణమనెడి విశేషము సమర్థింపబడినది కావున అర్థాన్తర్న్యాసాలంకారము.

**ఛందస్సు** :– ఈ పఞ్చమసర్గములోని శ్లోకములన్నియు వంశస్థవృత్తమున రచించబడినవి. 'పరమేశ్వరుడు పార్వతీదేవిని **'చేపట్టుట'** అనునది **వంశస్థ** వృత్తముద్వారా సూచించినట్లయినది.

**వృత్తలక్షణము :–** 'వదన్తి వంశస్థవిలం జతౌజరౌ' ।

దీనికి 'వంశస్తనిత' అనియును పేరు.

వంశస్థవృత్తంలో ప్రతిపాదానికి '12' అక్షరాలు ఉంటాయి. నాలుగుపాదాలు సమానంగా ఉంటాయి. ఒక్కొక్క పాదములో నాలుగు గణాలుంటాయి. ఆ గణాలు వరుసగా **జ** గణం, **త** గణం, **జ** గణం, **ర** గణం.





ప్రియేషు సౌభాగ్య ఫలాహి చారుతా

**క్రియాదర్శము :–** 1. నినిన్ద :– 'ణిది – కుత్సాయామ్' (నిందించుట) – సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :–** నినిన్ద – నినిన్దతుః – నినిన్దుః।

---

**శ్లో॥ ఇయేష సా కర్తుమవన్ధ్యరూపతాం**
**సమాధిమాస్థాయ తపోభిరాత్మనః।**
**అవాప్యతే వా కథమన్యథా ద్వయం**
**తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః॥ 2**

**పదవిభాగము :–** ఇయేష, సా, కర్తుమ్, అవన్ధ్యరూపతామ్, సమాధిమ్, ఆస్థాయ, తపోభిః, ఆత్మనః, అవాప్యతే, వా, కథమ్, అన్యథా, ద్వయమ్, తథావిధమ్, ప్రేమ, పతిః, చ, తాదృశః।

**అన్వయక్రమము :–** సా సమాధిమ్ ఆస్థాయ తపోభిః ఆత్మనః అవన్ధ్యరూపతాం కర్తుమ్ ఇయేష। అన్యథా కథం వా తథావిధం ప్రేమ తాదృశః పతిః చ (తద్) ద్వయం కథం వా అవాప్యతే।

**ప్రతిపదార్థము :–** సా – ఆ పార్వతీదేవి, సమాధిమ్ – ఏకాగ్రతను, ఆస్థాయ – అవలంబించి, తపోభిః – తపములచే, ఆత్మనః – తనకు, అవన్ధ్యస్వరూపతామ్ – నిర్దుష్టమగు చక్కదనము కలదగుటను, కర్తుమ్ – సంపాదించుకొనుటకు, ఇయేష – కోరెను, అన్యథా – అట్లు కాదేని, తథావిధమ్ ప్రేమ – అట్టియనురక్తియు, తాదృశః పతిశ్చ – అట్టి భర్తయు, (తద్) ద్వయమ్ – ఆ రెండును, కథమ్ వా – ఎట్లు, అవాప్యతే – పొందబడును?

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవి ఏకాగ్రతను అవలంబించి తపములచేత తనకు నిర్దుష్టమగు చక్కదనముకల దగుటను సంపాదించుకొనుటకు కోరెను. అట్లు కాదేని అట్టి అనురక్తియు, అట్టి భర్తయు (ఆ) రెండును ఎట్లు పొందబడును?

**పాఠాన్తరాలు:–** రూపతామ్ – కామతామ్

**విభక్తులు/క్రియలు :–** 1. సా – సా, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2.

సమాధిమ్ – **సమాధిమ్,** సమాధీ, సమాధీన్; ఇకారాన్త పుంలింగ సమాధిశబ్దము. ద్వి.ఏ 3. ఆస్థాయ – ల్యబన్తావ్యయము 4. తపోభిః – తపసా, తపోభ్యామ్, **తపోభిః,** సాన్తః; నపుంసకలింగ తపశ్శబ్దము. తృ.బ 5. ఆత్మనః – **ఆత్మనః,** ఆత్మనోః, ఆత్మనామ్ నకారాన్త పుంలింగ ఆత్మన్‌శబ్దము. ష.ఏ 6. అవన్ధ్యరూపతామ్ – **అవన్ధ్యరూపతామ్,** అవన్ధ్యరూపతే, అవన్ధ్యరూపతాః; ఆకారాన్త స్త్రీలింగ అవన్ధ్యరూపతాశబ్దము. ద్వి.ఏ 7. కర్తుమ్ – తుమున్ ప్రత్యయాన్తము. అవ్యయము 8. ఇయేష – క్రియ – లిట్ – ప్ర.ఏ 9. అన్యథా – అవ్యయము 10. తథావిధమ్ – తథావిధమ్, తథావిధే, తథావిధాని; అకారాన్త నపుంసకలింగ తథావిధశబ్దము. ప్ర.ఏ 11. ప్రేమ – ప్రేమ, ప్రేమ్ణీ, ప్రేమాణి; నకారాన్త నపుంసకలింగ ప్రేమన్‌శబ్దము. ప్ర.ఏ నామన్‌శబ్దవత్ 12. తాదృశః – **తాదృశః,** తాదృశౌ, తాదృశాః; అకారాన్త పుంలింగ తాదృశశబ్దము. ప్ర.ఏ 13. పతిః – **పతిః,** పతీ, పతయః; ఇకారాన్త పుంలింగ పతిశబ్దము. ప్ర.ఏ 14. ద్వయమ్ – **ద్వయమ్,** ద్వయే, ద్వయాని; అకారాన్త నపుంసకలింగ ద్వయశబ్దము. ద్వి.ఏ 15. చ, వా, కథమ్ – అవ్యయాలు 16. అవాప్యతే – క్రియ – లట్ – ప్ర.ఏ – కర్మణి

**సమాసాలు :–**

1. అవన్ధ్యరూపతామ్ – న వన్ధ్యమ్ (నఞ్ తత్పురుష) అవన్ధ్యమ్। అవన్ధ్యం చ తద్రూపమ్ (కర్మధా.) అవన్ధ్యరూపమ్, తస్య భావః అవన్ధ్యరూపతా, తామ్।
2. తథావిధమ్ – తథా విధా యస్య (బహువ్రీహి) తత్।

**సంధులు :–**

1. తపోభిః + ఆత్మనః – తపోభిరాత్మనః – విసర్గసంధిః (రుత్వమ్)।
2. పతిః + చ – పతిశ్చ – శ్చుత్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సమాధిః** – (పుం.)

ఎ) సమాధీయతేఽస్మిన్ మనో జనైరితి।

బి) సమ్ + ఆ + ధా + 'ఉపసర్గే కిః' ఇతి కి।

సి) శ్లో॥ ప్రణిధానం సమాధానం సమాధిశ్చ సమాస్త్రయః। 128

– అని హలాయుధకోశము.

డి) శ్లో॥ ఇమం గుణసమాహారమనాత్మత్వేన పశ్యతః।
అంతః శీతలతా యస్య సమాధిరితి కథ్యతే॥ – ఇతి యోగవాశిష్ఠే

ఉపశమప్రకరణే – 62 –8 నుండి 12 వఱకు గల శ్లోకాలు సమాధి లక్షణాలను వివరిస్తున్నాయి. చూడగలరు.



1. "ఏకాగ్రమును, నిత్యతృప్తమును, సత్యవస్తువును అవలోకించునదియు అబాధితమగు ఆత్మతత్త్వాన్ని దర్శించే పరాప్రజ్ఞయే **సమాధి.**
2. క్షోభాహంకారరహితమును, ద్వంద్వములందు తగులుకొననదియు, మేరుపర్వతము కంటె స్థిరమైన ఆకృతికలది ఐన స్థితియే **సమాధి.**
3. నిశ్చింతతో కూడినదీ, అభీష్టప్రాప్తినొందినదీ హేయోపాదేయవర్జితమైనదీ పరిపూర్ణమైనదీ అయినట్టి మనోగతియే సమాధి.
4. ఎప్పటినుంచి మనస్సు సదా జ్ఞానయుక్తమై ఉంటుందో అప్పటినుంచే సమాధిసిద్ధి" – యోగవాశిష్ఠము– శ్రీవ్యాసాశ్రమం.

ఇ) శ్లో॥ తస్యైవ కల్పనాహీనం స్వరూపగ్రహణం హి తత్।
మనసా ధ్యాననిష్పాద్యం **సమాధిః** సోఽభిధీయతే॥

– ఇతి విష్ణుపురాణే (6–8–90)

ఎఫ్) శ్లో॥ చరతః కిల దుశ్చరం తప–
స్తృణబిన్దోః పరిశఙ్కితః పురా।
ప్రజిఘాయ **సమాధి**భేదినీం
హరిరస్మై హరిణీం సురాఙ్గనామ్ ॥ ర.వం. 8 –79

"... తపస్సునకు విఘ్నము కలిగింపజాలిన హరిణి అను అప్సరసను ఆ తృణబిందుని వద్దకు వెళ్లుమని ప్రేరేపించెను."

జి) Profound or abstract meditation, concentration of mind or one object, perfect absorption of thought into the one object of meditation in the supreme spirit - the 8th and last stage of Yoga - Apte.

**అలంకారాలు :–** 1. ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. లక్షణము పూర్వము చెప్పబడినది.

'తపస్సుచే సాధింపరానిది లే'దను సామాన్యముచే విశేషము సమర్థింపబడుటచే ఇది అర్థాన్తరన్యాసాలంకారము.

స్త్రీలకు భర్త ప్రేమను చూరగొనుట, దీర్ఘసుమంగళియగుట అనునవి రెండూ తపశ్చర్యచేతనే సిద్ధించునట్టివి.

'తపస్సునకు లొంగనిదేదియును లే'దను దానికి ఈ దిగువనిచ్చిన శ్లోకమును గమనింతురుగాక.

శ్లో॥ యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుష్కరమ్।
తత్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్ ॥
– సూక్తిముక్తావళి నుండి

**క్రియాదర్శము :–**

**1. ఇయేష :–** ఇష (ఇష్) ఇచ్ఛాయామ్ (కోరుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, తుదాది ప్రకరణమ్ (6). లిట్. ప్ర.ఏ

రూపాలు – **ఇయేష** – ఈషతుః – ఈషుః

**2. అవాప్యతే** – 'ఆప్ – వ్యాప్తౌ' లట్ ప్ర.ఏ. అవ – ఉపసర్గ. సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ స్వాదిప్రకరణమ్.(5) భావకర్మార్థక 'ల'కారములు ఆత్మనేపదమునందే ఉండును. రూపాలు – **ఆప్యతే** – ఆప్యేతే – ఆప్యన్తే.

---

**శ్లో॥ నిశమ్య చైనాం తపసే కృతోద్యమాం**
**సుతాం గిరీశప్రతిసక్తమానసామ్।**
**ఉవాచ మేనా పరిరభ్య వక్షసా**
**నివారయన్తీ మహతో మునివ్రతాత్॥ 3**

**పదవిభాగము :–** నిశమ్య, చ, ఏనామ్, తపసే, కృతోద్యమామ్, సుతామ్, గిరీశప్రతిసక్తమానసామ్, ఉవాచ, మేనా, పరిరభ్య, వక్షసా, నివారయన్తీ, మహతః మునివ్రతాత్।

**అన్వయక్రమము :–** మేనా చ గిరీశప్రతిసక్తమానసాం తపసే కృతోద్యమాం సుతాం నిశమ్య ఏనాం వక్షసా పరిరభ్య మహతః మునివ్రతాత్ 'నివారయన్తీ' ఉవాచ।

**ప్రతిపదార్థము :–** మేనా చ – మేనాదేవియు, గిరీశప్రతిసక్తమానసామ్ – శివునియందు లగ్నమైన చిత్తముగల దానినిగాను, తపసే – తపముకొఱకు, కృతోద్యమామ్ – చేయబడిన యత్నముగల దానినిగాను అగు, సుతామ్ – కూతును గూర్చి, నిశమ్య – విని, ఏనామ్ – ఈ పార్వతీదేవిని, వక్షసా – ఎదయందు, పరిరభ్య – ఆలింగన మొనర్చి, మహతః – గొప్పదగు, మునివ్రతాత్ – తపస్సునుండి, నివారయన్తీ – మాన్పించునదై, ఉవాచ – పలికెను.





**తాత్పర్యము :–** మేనాదేవియు శివునియందలి లగ్నమైన చిత్తముగల దానినిగాను, తపము కొఱకు చేయబడిన యత్నముగల దానినిగాను అగు కూతును గూర్చివిని, ఈ పార్వతీదేవిని ఎదయందు ఆలింగనమొనర్చి గొప్పదగు తపస్సునుండి మాన్పించునదై (ఇట్లు) పలికెను.

**పాఠాన్తరాలు :–** 1. గిరిశం ప్రతిసక్త – గిరీశప్రతిసక్త; త్రినేత్రం ప్రతిసక్త

**విభక్తులు/క్రియలు :–** 1. మేనా – **మేనా,** మేనే, మేనాః; ఆకారాన్త స్త్రీలింగమేనాశబ్దము. ప్ర.ఏ 2.చ – అవ్యయము 3.గిరీశప్రతిసక్తమానసామ్ –...**మానసామ్,** ...మానసే,...మానసాః; ఆకారాన్త స్త్రీలింగ ...మానసాశబ్దము. ద్వి.ఏ 4. తపసే – **తపసే,** తపోభ్యామ్, తపోభ్యః; సాన్తనపుంసకలింగ తపశ్శబ్దము. చ.ఏ. 5. కృతోద్యమామ్ – **కృతోద్యమామ్,** కృతోద్యమే, కృతోద్యమాః; ఆకారాన్త స్త్రీలింగకృతోద్యమాశబ్దము. ద్వి.ఏ 6. సుతామ్ – **సుతామ్,** సుతే, సుతాః; ఆకారాన్త స్త్రీలింగసుతాశబ్దము. ద్వి.ఏ 7. నిశమ్య – ల్యబన్తావ్యయము 8. ఏనామ్ – **ఏనామ్,** ఏనే, ఏనాః; దకారాన్త స్త్రీలింగ ఏతచ్ఛబ్దము. ద్వి. 9. వక్షసా – **వక్షసా,** వక్షోభ్యామ్, వక్షోభిః; సాన్తనపుంసకలింగ వక్షశ్శబ్దము. తృ.ఏ 10. పరిరభ్య – ల్యబన్తము – అవ్యయము 11. మహతః – మహతః, మహద్భ్యామ్, మహద్భ్యః; తకారాన్త పుంలింగ మహత్శబ్దము. పం.ఏ 12. మునివ్రతాత్ – **మునివ్రతాత్,** మునివ్రతాభ్యామ్, మునివ్రతేభ్యః; అకారాన్త పుంలింగ మునివ్రతశబ్దము. పం.ఏ 13. నివారయన్తీ – నివారయన్తీ, నివారయన్త్యౌ, నివారయన్త్యః; ఈకారాన్త స్త్రీలింగ నివారయన్తీశబ్దము. ప్ర.ఏ 14. ఉవాచ – క్రియ – లిట్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. గిరీశప్రతిసక్తమానసామ్ – గిరేః ఈశః (ష.త.) గిరీశః, గిరీశే ప్రతిసక్తం మానసం యస్యాః (బహువ్రీహి) సా, తామ్।
2. కృతోద్యమామ్–కృతః ఉద్యమః యయా(బహువ్రీహి) సా కృతోద్యమా, తామ్।
3. ఎ) మునివ్రతాత్ – మునేః వ్రతమ్ (ష.త.) మునివ్రతమ్, తస్మాత్।
   బి) మునివ్రతాత్ – మునేః వ్రతః (ష.త.) మునివ్రతః, తస్మాత్।

**సంధులు :–**

1.చ + ఏనామ్ – చైనామ్ – వృద్ధిసన్ధిః, వృద్ధిరేచి (సూ.6–1–83)।

2. మహతః + మునివ్రతాత్ – మహతో మునివ్రతాత్ – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వ్రతః** :– (నపుంసక) (పుం) ఎ) వ్రియతే ఇతి, వృ వరణే+ బాహులకాద్ అతచ్ స చ కిత్।

బి) వ్రజ్ – ష జస్య తః।

సి) శ్లో॥ పిత్రా విసృష్టాం మదపేక్షయా యః
శ్రియం యువాప్యఙ్కగతామభోక్తా।
ఇయన్తి వర్షాణి తయా సహోగ్ర –
మభ్యస్యతీవ **వ్రత**మాసిధారమ్ । – ర.వం. 13–67

డి) శ్లో॥ ఇత్థం **వ్రతం** ధారయతః ప్రజార్థం
సమం మహిష్యా మహనీయకీర్తేః।
సప్త వ్యతీయుస్త్రిగుణాని తస్య
దినాని దీనోద్ధరణోచితస్య ॥ – ర.వం. 2 –25

"ఈ విధముగా సంతానమును పొందుటకై తన పట్టపురాణితో కలిసి వ్రత నియమములను పాటించుచున్నవాడును..."

**క్రియాదర్శము** :– **ఉవాచ** :– బ్రూఞ్ (బ్రూ) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) ద్వికర్మకమ్, సేట్, వచ్యాదేశే (ఉభయ) అనిట్, పరస్మైపదీ, అదాది ప్రకరణమ్(2). లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

రూపాలు :– **ఉవాచ** – ఊచతుః – ఊచుః – ప్ర.పు
ఉవచిథ – ఊచథుః – ఊచ – మ.పు
**ఉవాచ**/ఉవచ – ఊచివ –ఊచిమ – ఉ.పు

శ్లో॥ **నిశమ్య** దేవానుచరస్య వాచం
మనుష్యదేవః పునర**ప్యువాచ** ।
ధేన్వా తదధ్యాసితకాతరాక్ష్యా
నిరీక్ష్యమాణః సుతరాం దయాళుః ॥ ర.వం 2–52

---

**అవతారికా :–** సామాన్యనిషేధముక్త్వా విశేషనిషేధమాహ। సామాన్యమగు నిషేధ వాక్యమును మున్నుచెప్పి, విశేషనిషేధ వాక్యమును ఇప్పుడు చెప్పుచున్నది.

**శ్లో॥ మనీషితాః సన్తి గృహేషు దేవతా–**
**స్తపః క్వ వత్సే! క్వ చ తావకం వపుః।**
**పదం సహేత భ్రమరస్య పేలవం**
**శిరీషపుష్పం న పునః పతత్రిణః॥ 4**





**పదవిభాగము :–** మనీషితాః, సన్తి, గృహేషు, దేవతాః, తపః, క్వ, వత్సే! క్వ, చ, తావకమ్, వపుః, పదమ్, సహేత, భ్రమరస్య, పేలవమ్, శిరీషపుష్పమ్, న, పునః, పతత్రిణః।

**అన్వయక్రమము :–** హే వత్సే! మనీషితాః దేవతాః గృహేషు సన్తి! తపః క్వ। తావకమ్ వపుః క్వ। పేలవం శిరీషపుష్పం భ్రమరస్య పదం సహేత, పతత్రిణః పునః పదం న సహేత।

**ప్రతిపదార్థము :–** హే వత్సే! – ఓ బిడ్డా!, మనీషితాః – పరిపక్వమనస్కులైన, దేవతాః – (శచీదేవి మున్నగు) దేవతలు, గృహేషు – (మన) యిండ్లయందు, సన్తి – ఉన్నారు, తపః క్వ – తపము ఎక్కడ?, తావకమ్ – నీదగు, వపుః క్వ – శరీరమెక్కడ? పేలవమ్ – మృదువగు, శిరీషపుష్పమ్ – దిరిసెన పువ్వు, భ్రమరస్య – తుమ్మెదయొక్క, పదమ్ – పాదమును, సహేత – ఓర్చును, పతత్రిణః – పక్షియొక్క పునః పదమ్ – పాదమైతే, న సహేత – ఓర్వజాలునా?

**తాత్పర్యము :–** ఓ బిడ్డా! పరిపక్వమనస్కులైన దేవతాస్త్రీలు (మన) యిండ్లయందు ఉన్నారు. తపము ఎక్కడ? నీదగు శరీరమెక్కడ? మృదువగు దిరిసెనపువ్వు తుమ్మెదయొక్క పాదమును ఓర్చును, పక్షియొక్క పాదమైతే ఓర్వజాలునా?

**పాఠాన్తరాలు :–** 1. గృహేషు – గృహేఽపి
2. మనీషితాః సన్తి – మనీషితాయార్చ

**విభక్తులు/క్రియలు:–** 1. వత్సే – **హే వత్సే, హే వత్సే,** హే వత్సాః; ఆకారాన్త స్త్రీలింగవత్సాశబ్దము. సం.ప్ర.ఏ. 2. మనీషితాః – మనీషితా, మనీషితే, **మనీషితాః** ;ఆకారాన్త స్త్రీలింగ మనీషితాశబ్దము. ప్ర.బ. 3. దేవతాః – దేవతా, దేవతే, **దేవతాః;** ఆకారాన్త స్త్రీలింగ దేవతాశబ్దము. ప్ర.బ. 4. గృహేషు – గృహే, గృహయోః, **గృహేషు;** అకారాన్త నపుంసకలింగ గృహశబ్దము. స.బ. 5. సన్తి – క్రియ 6. తపః – **తపః**, తపసీ, తపాంసి; సాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ప్ర.ఏ 7. తావకమ్ – **తావకమ్,** తావకే, తావకాః; అకారాన్త నపుంసకలింగ తావకశబ్దము. ప్ర.ఏ 8. వపుః – **వపుః,** వపుషీ, వపూంషి; సాన్త నపుంసకలింగ వపుశ్శబ్దము. ప్ర.ఏ 9. న, పునః, క్వ – అవ్యయాలు 10. పేలవమ్ – **పేలవమ్**, పేలవే, పేలవాని; అకారాన్త నపుంసకలింగ పేలవశబ్దము. ప్ర.ఏ 11. శిరీషపుష్పమ్ – **శిరీషపుష్పమ్,** శిరీషపుష్పే, శిరీషపుష్పాణి; అకారాన్త నపుంసకలింగ శిరీషపుష్పశబ్దము. ప్ర.ఏ. 12. భ్రమరస్య – **భ్రమరస్య,** భ్రమరయోః, భ్రమరాణామ్; అకారాన్త పుంలింగ భ్రమరశబ్దము. ష.ఏ 13. పదమ్ – పదమ్, పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ద్వి.ఏ 14. సహేత – క్రియ 15. పతత్రిణః – **పతత్రిణః**, పతత్రిణోః, పతత్రిణామ్ ;నకారాన్త పుంలింగ పతత్రిన్‌శబ్దము. ష.ఏ.

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. మనీషితాః - మనసః ఈషితాః (ష.త.) మనీషితాః।
2. తావకమ్ - తవ ఇదం తావకమ్। (తద్ధితవృత్తి)।
3. శిరీషపుష్పమ్ - శిరీషస్య పుష్పమ్ (ష.త.) శిరీషపుష్పమ్।

**సంధులు :-**

1. దేవతాః + తపః - దేవతాస్తపః - విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. భ్రమరః :-** (పుం.) ఎ) భ్రమతి ప్రతి కుసుమమితి। 'అర్తికమీత్యాదినా' అర।

బి) శ్లో॥ మధుకరమధుపమధువ్రతశిలీముఖభ్రమరభృఙ్గపుష్పలిహః।
ఇందిందిరాలిషట్‌చరణచఞ్చరీకాలినో ద్విరేఫాః స్యుః॥

అని హలాయుధకోశము 'భ్రమర'మునకు 13 నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ **భ్రమరైః** కుసుమానుసారిభిః
పరికీర్ణా పరివాదినీ మునేః।
దదృశే పవనావలేపజం
సృజతీ బాష్పమివాఞ్జనావిలమ్॥ - ర.వం. 8 - 35

"పుష్పముల వెంటబడుచున్న తుమ్మెదలచే..."

డి) శ్లో॥ ఆపేదిరేఽమ్బరపథం పరితః పతంగాః
భృంగా రసాలముకుళాని సమాశ్రయన్తి।
సంకోచమంచతి సరస్త్వయి దీనదీనో
మీనో ను హన్త! కతమాం గతిమభ్యుపైతు॥

- భామినీ విలాసః

'ఓ సరోవరమా! ... సారసాదిపక్షులు, తుమ్మెదలు నిన్నాశ్రయించి నీ శోభను ఇనుమడింపజేస్తుంటాయి...'

ఇ) శ్రీమద్భాగవతమున 10-47-12 నుండి 68 వరకు ఉన్న భ్రమరగీతలను అధ్యయనం చేయటంద్వారా ఆ శ్రీకృష్ణ భగవానుని స్మరించుకుంటూ ఇట అనుసంధానము చేసుకుందురుగాక!

**'మధుప!** కితవబంధో' అనే భాగవత శ్లోకం (12) రాధాదేవి పలుకులని సనాతన గోస్వామి ప్రభృతులు అభిప్రాయపడినారు.



**అలంకారాలు :-** ఇట 'విషమాలంకారము, అర్థాన్తరన్యాసము, ఈ రెండింటికి సంసృష్టి మఱియు దృష్టాంతాలంకారము'లున్నవని చెప్పదగును. 'చంద్రాలోకము' నుండి లక్షణములు ఇవ్వబడినవి, అవి 'విషమం వర్ణ్యతే యత్ర ఘటనాననురూపయోః' విషమాలంకార లక్షణమ్। (విషమమ్, వర్ణ్యతే, యత్ర, ఘటనా, అననురూపయోః) అనురూపములు కాని రెండింటికి ఎక్కడ సంబంధము వర్ణింపబడునో అది విషమాలంకారము.

**అన్వయము :-** కఠిన శరీరసాధ్యమగు తపస్సునకును - అతికోమలమగు పార్వతీదేవి శరీరమునకును - అనురూపముకాని వానికి సంబంధము పూర్వార్థమున వర్ణింపబడుటచే విషమాలంకారము.

2. ఉత్తరార్ధమున - అర్థాన్తరన్యాసాలంకారమున్నదని చెప్పదగును. ఇది సాదృశ్యనిమిత్తకము.

3. **'చే ద్బిమ్బప్రతిబిమ్బత్వం దృష్టాన్తస్తదలఙ్కృతిః'।** అని దృష్టాన్తాలఙ్కారలక్షణము. అన్వయము - పార్వతీదేవి దేహము ఉపమేయము, శిరీషపుష్పము ఉపమానము. ఉపమానోపమేయ ధర్మములకు బింబప్రతిబింబభావము చెప్పబడుటచే దృష్టాంతాలంకారము.

**క్రియాదర్శము :-**

**1. సన్తి :-** అస (అస్) భువి (ఉండుట). అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2) లట్, ప్ర.బ.

రూపాలు - అస్తి - స్తః - **సన్తి.**

**2. సహేత** - 'షహ మర్షణే' సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్, విధిలిఙ్. ప్రథమపురుషైకవచనాంతః।

**సహేత** - సహేయాతామ్ - సహేరన్.

---

**శ్లో॥ ఇతి ధ్రువేచ్ఛామనుశాసతీ సుతాం**
**శశాక మేనా న నియన్తుముద్యమాత్।**
**క ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః**
**పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్॥ 5**

**పదవిభాగము :–** ఇతి, ధ్రువేచ్ఛామ్, అనుశాసతీ, సుతామ్, శశాక, మేనా, న, నియన్తుమ్, ఉద్యమాత్, కః, ఈప్సితార్థస్థిరనిశ్చయమ్, మనః, పయశ్చ, నిమ్నాభిముఖమ్, ప్రతీపయేత్।

**అన్వయక్రమము :–** ఇతి అనుశాసతీ మేనా ధ్రువేచ్ఛాం సుతామ్ ఉద్యమాత్ నియన్తుం న శశాక। ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః నిమ్నాభిముఖం పయశ్చ కః ప్రతీపయేత్।

**ప్రతిపదార్థము :–** ఇతి – ఇట్లు, అనుశాసతీ – ఉపదేశించుచున్నదై, మేనా – మేనాదేవి, ధ్రువేచ్ఛామ్ – సడలని పట్టుదలగల, సుతామ్ – కూతును, ఉద్యమాత్ – తపః ప్రయత్నమునుండి, నియన్తుమ్ – నివారించుటకు, న శశాక – శక్తురాలు కాలేదయ్యెను, ఈప్సితార్థస్థిరనిశ్చయమ్ – పొందుటకిష్టమైన సడలని నిశ్చయముగల , మనః – చిత్తమును, నిమ్నాభిముఖమ్ – పల్లమువైపు ప్రసరించు, పయశ్చ – నీటిని, కః – ఎవడు, ప్రతీపయేత్ – వెనుకకు మరల్చగలుగును?

**తాత్పర్యము :–** ఇట్లు ఉపదేశించుచున్నదై మేనాదేవి సడలని పట్టుదలగల కూతును తపఃప్రయత్నమునుండి నివారించుటకు శక్తురాలు కాలేదయ్యెను. పొందుటకు ఇష్టమైన సడలని నిశ్చయముగల చిత్తమును, పల్లమువైపు ప్రసరించు నీటిని, ఎవడు వెనుకకు మరల్చగలుగును?

**పాఠాన్తరాలు :–** 1. ధ్రువే – స్థిరే, వ్రతే, శ్రుతే.

**విభక్తులు/క్రియలు :–** 1. ఇతి, న, చ – అవ్యయాలు 2. అనుశాసతీ – **అనుశాసతీ,** అనుశాసత్యౌ, 10
అనుశాసత్యః; ఈకారాన్త స్త్రీలింగ అనుశాసతీశబ్దము. ప్ర.ఏ 3. మేనా – **మేనా,** మేనే, మేనాః ; ఆకారాన్త స్త్రీలింగ **మేనా**శబ్దము. ప్ర.ఏ 4. ధ్రువేచ్ఛామ్ – **ధ్రువేచ్ఛామ్,** ధ్రువేచ్ఛే, ధ్రువేచ్ఛాః; ఆకారాన్త స్త్రీలింగ ధ్రువేచ్ఛాశబ్దము. ద్వి.ఏ 5. సుతామ్ – **సుతామ్,** సుతే, సుతాః; ఆకారాన్త స్త్రీలింగ సుతాశబ్దము. ద్వి.ఏ 6. ఉద్యమాత్ – **ఉద్యమాత్,** ఉద్యమాభ్యామ్, ఉద్యమేభ్యః; అకారాన్త పుంలింగ ఉద్యమశబ్దము. పం.ఏ 7. నియన్తుమ్ – అవ్యయము 8. శశాక – క్రియ 9. ఈప్సితార్థస్థిరనిశ్చయమ్ – **...నిశ్చయమ్,**...నిశ్చయే,...నిశ్చయాని; అకారాన్త నపుంసకలింగ ...నిశ్చయశబ్దము. ద్వి.ఏ 10. మనః – **మనః,** మనసీ, మనాంసి సాన్త నపుంసకలింగ మనశ్శబ్దము. ద్వి.ఏ 11. నిమ్నాభిముఖమ్ – **నిమ్నాభిముఖమ్,** నిమ్నాభిముఖే, నిమ్నాభిముఖాని; అకారాన్త నపుంసకలింగ నిమ్నాభిముఖశబ్దము. ద్వి.ఏ 12. పయః – **పయః** పయసీ, పయాంసి; సాన్తనపుంసకలింగ పయశ్శబ్దము. ద్వి.ఏ 13. కః – **కః,** కౌ, కే; మకారాన్త పుంలింగ కిమ్‌శబ్దము. ప్ర.ఏ 14. ప్రతీపయేత్ – క్రియ – విధిలిఙ్ – ప్ర.ఏ



**సమాసాలు :–**

1. ధ్రువేచ్ఛామ్ – ధ్రువా ఇచ్ఛా యస్యాః (బహువ్రీహి) సా ధ్రువేచ్ఛా, తామ్।
2. ఈప్సితార్థస్థిరనిశ్చయమ్ – ఈప్సితః చాసౌ అర్థః (కర్మధా.) ఈప్సితార్థః । స్థిరః నిశ్చయః యస్య (బహువ్రీహి) తత్।
3. నిమ్నాభిముఖమ్ – నిమ్నే అభిముఖమ్ (స.త.) తత్।

**సంధులు :–**

1. పయః + చ – పయశ్చ –శ్చుత్వసన్ధిః

**స్తోః శ్చునా శ్చుః** (సూ. 8–4–39) సకార త వర్గములకు శకార చ వర్గములతో కలయిక ఏర్పడినపుడు శకార చ వర్గములు వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. పయః :–**

ఎ) పయ్యతే పీయతే వా। పయ్ గతౌ, పీఙ్ పానే వా + **సర్వధాతుభ్యోఽసున్** ఇత్యసున్ (ఉణాది 4–188)

బి) శ్లో॥ ఆపస్తోయం ఘనరస**పయః** పుష్కరం మేఘపుష్పం
కం పానీయం సలిలముదకం వారి వాః శమ్బరం చ।
అర్ణః పాథః కుశజలవనం క్షీరమమ్భోఽమ్బు నీరం
ప్రోక్తం ప్రాజ్ఞైర్భువనమమృతం జీవనీయం దకం చ॥ 648

అని హలాయుధకోశము 'పయస్' శబ్దమునకు 26 నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ మత్సరం దుర్లభం మత్వా నూనమావర్జితం మయా।
**పయః** పూర్వైః స్వనిశ్వాసైః కవోష్ణముపభుజ్యతే॥ ర.వం. 1 –67

"నా తరువాత, వారికి జలాంజలిని ఇచ్చువారుండరని భావించిన నా పితృదేవతలు ప్రస్తుతము నేనిచ్చిన, నా నిట్టూర్పులతో కొంచెము వెచ్చనైన నీటిని త్రాగుచున్నారు.

డి) శ్లో॥ 'పయసా కమలం కమలేన **పయః** పయసా కమలేన విభాతి సరః'
– శ్రీమద్భాగవతము 8–2–4

**2) 'కః ఈప్సితార్థః'** –

శ్లో॥ జానే తపసో వీర్యం – సా చాలా పరవతీతి మే విదితమ్।
న చ నిమ్నాదివ సలిలమ్ – నివర్తతే మే తతో హృదయమ్॥

'తపస్సుయొక్క బలమునుఎఱుగుదును, ఆచిన్నది పరాధీనురాలని నాకు తెలియును. పల్లమువైపు ప్రవహించు నీటివలె, ఆ కన్యనుండి నా మనస్సు మరలకున్నది.

**అలంకారాలు** :– ఇట **'అర్థాన్తరన్యాసాలంకార'**మున్నదని చెప్పదగును. లక్షణము పూర్వము చెప్పబడినది. సామాన్యముచే విశేషము సమర్థింపబడినది. 'పల్లమువైపు ప్రసరించు నీటిని వెనుకకు మరల్చుట ఎవడు చేయును' అను సామాన్యముచే పార్వతీదేవిని తపఃప్రయత్నమునుండి మరల్చుట ఎవరిచే సాధ్యము కాదను విశేషము ఇట సమర్థింపబడినది. 'ఇట' దీపకాఽ నుప్రాణితాఽ ర్థాన్తరన్యాసాలంకార' మున్నదని – పుంసవనీ వ్యాఖ్య.

**క్రియాదర్శము :– 1. శశాక :–** శక (శక్) శక్తౌ (సమర్థమగుట) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, స్వాదిప్రకరణమ్ (5) లిట్ – ప్రథమపురుషైకవచనమ్. రూపాలు – **శశాక** – శేకతుః – శేకుః

**2. ప్రతీపయేత్ :–**

ఎ) 'ప్రతీప' ఇతి నామధాతోర్ విధిలిఙ్ ప్రథమపురుషైకవచనాంతః।
రూపాలు :– **ప్రతీపయేత్** – ప్రతీపయేతామ్ – ప్రతీపయేయుః

బి) ప్రతీప+ణిజన్తమ్

సి) ప్రతిగతాః ఆపోయత్ర, ప్రతి అప్ అచ్, అప్ ఈప్ చ్.

---

**అవతారికా :–** తపశ్చరణోద్యతాయాః పార్వత్యాః వర్ణనమ్।
తపస్సు చేయ నుద్యమించిన పార్వతీదేవి వర్ణనము.

**శ్లో॥ కదాచిదాసన్నసఖీముఖేన సా**
**మనోరథజ్ఞం పితరం మనస్వినీ।**
**అయాచతారణ్యనివాసమాత్మనః**
**ఫలోదయాన్తాయ తపఃసమాధయే॥ 6**

**పదవిభాగము :–** కదాచిత్, ఆసన్నసఖీముఖేన, సా, మనోరథజ్ఞమ్, పితరమ్, మనస్వినీ, అయాచత, అరణ్యనివాసమ్, ఆత్మనః, ఫలోదయాన్తాయ, తపః సమాధయే।

**అన్వయక్రమము :–** కదాచిత్ మనస్వినీ సా మనోరథజ్ఞం పితరమ్ ఆసన్నసఖీ ముఖేన ఫలోదయాన్తాయ తపఃసమాధయే ఆత్మనః అరణ్యనివాసమ్ అయాచత।

**ప్రతిపదార్థము :–** కదాచిత్ – ఒకానొక సమయమున, మనస్వినీ – చెదరని చిత్తముగల, సా – ఆ పార్వతీదేవి, మనోరథజ్ఞమ్ – కోరికనెఱిగిన, పితరమ్ –





తండ్రియగు హిమవంతునిగూర్చి, ఆసన్నసఖీముఖేన – ఆప్తురాలగు చెలియనెడు నుపాయముచేత, ఫలోదయాన్తాయ – ఫలోత్పత్తియే అవధిగాగల, తపః సమాధయే – తపముయొక్క నియమముకొఱకు, ఆత్మనః – తనకు, అరణ్యనివాసమ్ – అడవివాసమును, అయాచిత – అర్థించెను.

**తాత్పర్యము :–** ఒకానొక సమయమున చెదరని చిత్తముగల ఆ పార్వతీదేవి కోరిక నెఱిగిన తండ్రియగు హిమవంతునిగూర్చి ఆప్తురాలగు చెలియనెడు నుపాయముచేత ఫలోత్పత్తియే అవధిగాగల తపమాచరించుటకొఱకు తనకు అడవివాసమును అర్థించెను.

**విభక్తులు/క్రియలు:–** 1. కదాచిత్ – అవ్యయము, 2. మనస్వినీ – **మనస్వినీ**, మనస్విన్యౌ, మనస్విన్యః ఈకారాన్త స్త్రీలింగ మనస్వినీశబ్దము. ప్ర.ఏ 3. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 4. మనోరథజ్ఞమ్ – **మనోరథజ్ఞమ్,** మనోరథజ్ఞౌ, మనోరథజ్ఞాన్; అకారాన్త పుంలింగ మనోరథజ్ఞశబ్దము. ద్వి.ఏ 5. పితరమ్ – **పితరమ్,** పితరౌ, పితౄన్; ఋకారాన్త పుంలింగ పితృశబ్దము. ద్వి.ఏ 6. ఆసన్నసఖీముఖేన – ఆసన్నసఖీముఖేన, ఆసన్నసఖీముఖాభ్యామ్, ఆసన్నసఖీముఖైః; అకారాన్త నపుంసకలింగ ఆసన్నసఖీముఖశబ్దము. తృ.ఏ 7. తపఃసమాధయే – **తపఃసమాధయే,** తపః సమాధిభ్యామ్, తపఃసమాధిభ్యః; ఇకారాన్త పుంలింగ తపస్సమాధిశబ్దము చ.ఏ 8. ఫలోదయాన్తాయ – **ఫలోదయాన్తాయ,** ఫలోదయాన్తాభ్యామ్, ఫలోదయాన్తేభ్యః అకారాన్త పుంలింగ ఫలోదయాన్తశబ్దము. చ.ఏ 9. ఆత్మనః – **ఆత్మనః**, ఆత్మనోః ఆత్మనామ్; నకారాన్త పుంలింగ ఆత్మన్‌శబ్దము. ష.ఏ 10. అరణ్యనివాసమ్ – **అరణ్యనివాసమ్**, అరణ్యనివాసౌ, అరణ్యనివాసాః; అకారాన్త పుంలింగ అరణ్యనివాస శబ్దము. ద్వి.ఏ 11. అయాచత – లఙ్ – ప్ర.ఏ.

**సమాసాలు :–**

1. మనోరథజ్ఞమ్ – మనోరథం జానాతి (ఉపపదతత్పు.) ఇతి మనోరథజ్ఞః, తమ్।
2. ఆసన్నసఖీముఖేన – ఆసన్నా చాసౌ సఖీ (కర్మధా.) ఆసన్నసఖీ, ఆసన్న సఖ్యాః ముఖమ్ (ష.త.) తేన।
3. ఫలోదయాన్తాయ – ఫలస్య ఉదయః (ష.త.) ఫలోదయః, ఫలోదయస్య అంతః (ష.త.) ఫలోదయాన్తః, తస్మై।
4. తపఃసమాధయే – తపసః సమాధిః (ష.త.) తపఃసమాధిః, తస్మై।
5. అరణ్యనివాసమ్ – అరణ్యస్య నివాసః (ష.త.) అరణ్యనివాసః, తమ్।

**సంధులు :–**

1. కదాచిత్ + ఆసన్న – కదాచిదాసన్న – జశ్త్వమ్

**ఝలాం జశోఽన్తే** (సూ 8 –2–39) అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు (ఝల్లులకు) సవర్ణమైన వర్గతృతీయవర్ణము, జశ్త్వము ఆదేశముగ వచ్చును.

2. అయాచత + అరణ్య... – అయాచతారణ్య... – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1) అరణ్యమ్ :–**

ఎ) అర్యతే మృగైః। ఋ గతౌ, **అర్తేర్నిచ్చేతి** అన్యః। ఉణాది – 3.102।

బి) శ్లో।। **అరణ్య**మటవీ సత్త్రం కాన్తారం కాననం వనమ్।
విపినం గహనం చేతి... – అని హలాయుధకోశము '8' నామములను పేర్కొన్నది.

సి) **'అటవ్యరణ్యం** విపినం **గహనం** కాననం వనమ్' అని అమరము.

డి) "ప్రియానాశో కృత్స్నం కిల జగ**దరణ్యం** హి భవతి'
– ఇతి ఉత్తరరామచరితే 6 –30

ఇ) శ్లో।। మాతా యస్య గృహే నాస్తి భార్యా చాప్రియవాదినీ।
**అరణ్యం** తేన గన్తవ్యం యథారణ్యం తథాగృహమ్।।
– చాణక్యశతకే – 44

**2) మనస్వినీ –**

ఎ) ప్రశస్తం మనః అస్యా అస్తీతి మనస్వినీ **మనః**శబ్దాత్ 'అస్మాయామేధాస్రజో వినిః' ఇతి వినిప్రత్యయః, తదన్తాత్ 'ఋన్నేభ్యో ఙీప్' ఇతి ఙీప్। – పుంసవనీ వ్యాఖ్యనుండి

బి) మనస్వినో లక్షణం యథా –
'శ్లో।। మహాకార్యే కృతోద్యోగో విఘ్నైరాహతమానసః।
ప్రారబ్ధం న త్యజతి యః స **మనస్వీతి** కథ్యతే।।' ఇతి।

**క్రియాదర్శము :– అయాచత :–** టు యాచృ – యాచ్ఞాయామ్ (యాచించుట) భ్వాదిప్రకరణమ్ 1) సకర్మకమ్, సేట్, (ఉభయపదీ) పరస్మైపదీ, లఙ్ మ.బ లోనున్నది.

**ఆత్మనేపదీ** – లఙ్. ప్రథమపురుషైకవచనమును – ఇదే రూపమున ఉన్నదని గమనింతురుగాక.





**రూపాలు :– అయాచత** – అయాచేతామ్ – అయాచన్త.

---

**శ్లో।। అథానురూపాభినివేశతోషిణా**
**కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా।**
**ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా**
**జగామ గౌరీ శిఖరం శిఖణ్డిమత్।। 7**

**పదవిభాగము :–** అథ, అనురూపాభినివేశతోషిణా, కృతాభ్యనుజ్ఞా, గురుణా, గరీయసా, ప్రజాసు, పశ్చాత్, ప్రథితమ్, తదాఖ్యయా, జగామ, గౌరీ, శిఖరమ్, శిఖణ్డిమత్।

**అన్వయక్రమము :–** అథ గౌరీ అనురూపాభినివేశతోషిణా గరీయసా గురుణా కృతాభ్యనుజ్ఞా (సతీ), పశ్చాత్ ప్రజాసు తదాఖ్యయా ప్రథితం శిఖణ్డిమత్ శిఖరం జగామ।

**ప్రతిపదార్థము:–** అథ – అనంతరము, గౌరీ – పార్వతీదేవి, అనురూపాభినివేశతోషిణా – తగిన పట్టుదలచేత సంతోషించినట్టియు, గరీయసా – మిక్కిలి పూజ్యుడగు, గురుణా – తండ్రిచేత, కృతాభ్యనుజ్ఞా – చేయబడిన అంగీకారము గలదియునై, పశ్చాత్ – తపస్సిద్ధికి పిమ్మట, ప్రజాసు – జనులయందు, తదాఖ్యయా – ఆ పార్వతీదేవిపేరుతో, ప్రథితమ్ – ప్రసిద్ధియైన, శిఖణ్డిమత్ – నెమళ్లుగల, శిఖరమ్ – శిఖరమునుగూర్చి, జగామ – వెళ్లెను.

**తాత్పర్యము :–** అనంతరము, పార్వతీదేవి తగిన పట్టుదల చేత సంతోషించినట్టియు మిక్కిలి పూజ్యులగు తండ్రిచేత చేయబడిన అంగీకారముగలదియునై, తపస్సిద్ధికి పిమ్మట జనులయందు ఆ పార్వతీదేవిపేరుతో ప్రసిద్ధమైన నెమళ్లుగల శిఖరమును గూర్చి వెళ్లెను.

**విభక్తులు/క్రియలు :–** 1. అథ, పశ్చాత్ – అవ్యయాలు, 2. గౌరీ – **గౌరీ**, గౌర్యౌ, గౌర్యః; ఈకారాన్త స్త్రీలింగ గౌరీశబ్దము. ప్ర.ఏ. 3. అనురూపాభినివేశతోషిణా – **...తోషిణా**, ...తోషిభ్యామ్, ...తోషిభిః; నకారాన్త పుంలింగ...తోషిన్‌శబ్దము. తృ.ఏ. 4. గరీయసా – **గరీయసా**, గరీయద్భ్యామ్, గరీయద్భిః; సాన్తః పుంలింగ గరీయస్‌శబ్దము. తృ.ఏ 'విద్వస్' శబ్దవత్. 5. గురుణా – **గురుణా**, గురుభ్యామ్, గురుభిః; ఉకారాన్త పుంలింగ గురుశబ్దము. తృ.ఏ 6. కృతాభ్యనుజ్ఞా – **కృతాభ్యనుజ్ఞా,**

కృతానుభ్యనుజ్ఞే, కృతాభ్యనుజ్ఞాః; ఆకారాన్త స్త్రీలింగ కృతాభ్యనుజ్ఞానుశబ్దము. ప్ర.ఏ 7. ప్రజాసు – ప్రజాయామ్, ప్రజయోః ప్రజాసు; ఆకారాన్త స్త్రీలింగ ప్రజాశబ్దము. స.బ 8. తదాఖ్యయా – **తదాఖ్యయా,** తదాఖ్యాభ్యామ్, తదాఖ్యాభిః; ఆకారాన్త స్త్రీలింగ తదాఖ్యాశబ్దము. తృ.ఏ 9. ప్రథితమ్ – **ప్రథితమ్,** ప్రథితే, ప్రథితాని అకారాన్త నపుంసకలింగ ప్రథితశబ్దము. ద్వి.ఏ. 10. శిఖండిమత్ – శిఖణ్డిమత్, శిఖణ్డిమతీ/మన్తీ, శిఖణ్డిమన్తి; తకారాన్త నపుంసకలింగ శిఖండిమత్‌శబ్దము. ద్వి.ఏ 11. శిఖరమ్ – **శిఖరమ్,** శిఖరే, శిఖరాణి; అకారాన్త నపుంసకలింగ శిఖరశబ్దము. ద్వి.ఏ 12. జగామ – క్రియ – లిట్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. అనురూపాభినివేశతోషిణా – అనురూపః చాసౌ అభినివేశః (కర్మధా.) అనురూపాభినివేశః, అనురూపాభినివేశేన తుష్యతి (ఉపపదతత్పు)ఇతి తేన।
2. కృతాభ్యనుజ్ఞా – కృతా అభ్యనుజ్ఞా యస్యాః (బహువ్రీహి) సా।
3. తదాఖ్యయా – తస్యా ఆఖ్యా (ష.త.) తదాఖ్యా, తయా।

**సంధులు :–**

1. అథ + అనురూపా... – అథానురూపా...– సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. పశ్చాత్ – అవ్యయకోషః (515)**

ఏ) ప్రతీచీచరమయోరర్థయోరయం వర్తతే।

1. ప్రతీచ్యామ్ – పశ్చాదస్త్రాద్రిః।
2. చరమే – పశ్చాద్ యాతి।
3. 'పశ్చాత్' – (5–3–32) ఇత్యనేన అపరశబ్దస్య ప్రథమాపంచమీసప్తమీషు వర్తమానస్య పశ్చభావః, ఆతిప్రత్యయశ్చ నిపాత్యతే।

అసర్వవిభక్తితద్ధితాన్తత్వేన అవ్యయమ్। పశ్చాద్రమణీయమ్, పశ్చాదాగతః।

**అలంకారాలు :–** ఇందు 'భావికాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము :–** 'భావికం భూతభావ్యర్థసాక్షాత్కారస్య వర్ణనమ్' – అని చంద్రాలోకము. జరిగిపోయిన కార్యముయొక్క, జరుగనున్న కార్యముయొక్క సాక్షాత్కార వర్ణనము భావికాలంకారము.

పార్వతీదేవి – తండ్రి అనుమతిని పొందియుండుట జరిగిపోయిన కార్యము. పార్వతీదేవి – తపస్సునకుపక్రమించుటకు వెళ్లుట. జరగనున్న కార్యము. రెండింటి వర్ణనమున్నది కావున భావికాలంకారము.





**క్రియాదర్శము :– జగామ**

ఏ) గమ (గమ్), గతౌ (వెళ్లుట) – సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**ఇషు గమి యమాం ఛః** సూ(7–3–77) అను సూత్రముచే 'మ'కారమునకు 'ఛ'కారాదేశము. గమ్+అ+తి – గఛ్ + అ + తి – తుగామము, శ్చుత్వములచే 'గచ్ఛతి' అనురూపము.

లిట్ ప్రథమపురుషరూపాలు :– **జగామ** – జగ్మతుః – జగ్ముః

---

**శ్లో॥ విముచ్య సా హారమహార్యనిశ్చయా**
**విలోలయష్టిప్రవిలుప్తచన్దనమ్।**
**బబన్ధ బాలారుణబభ్రు వల్కలం**
**పయోధరోత్సేధవిశీర్ణసంహతి। 8**

**పదవిభాగము :–** విముచ్య, సా, హారమ్, అహార్యనిశ్చయా, విలోల...చన్దనమ్, బబన్ధ, బాలారుణబభ్రు, వల్కలమ్, పయోధరోత్సేధవిశీర్ణసంహతి।

**అన్వయక్రమము :–** అహార్యనిశ్చయా సా విలోల... చన్దనం హారం విముచ్య బాలారుణబభ్రు పయోధరోత్సేధవిశీర్ణసంహతి వల్కలం బబన్ధ।

**ప్రతిపదార్థము :–** అహార్యనిశ్చయా – వారింపశక్యముగాని నిర్ణయముకలదైన, సా – ఆ పార్వతీదేవి, విలోల – యష్టి – ప్రవిలుప్త – చన్దనమ్ – చలించుచున్న పేటలచే పోగొట్టబడిన గంధముగల, హారమ్ – ముత్యాలహారమును, విముచ్య – తీసివైచి, బాలారుణబభ్రు – బాలసూర్యునివలె కావిరంగు గలదియు, పయోధరోత్సేధ – విశీర్ణసంహతి – స్తనౌన్నత్యముచే పలుచబడిన చిక్కదనము గలదియు అగు, వల్కలమ్ – నారచీరను, బబన్ధ – కట్టుకొనెను.

**తాత్పర్యము :–** వారింపశక్యముగాని నిర్ణయముకలదైన ఆ పార్వతీదేవి, చలించుచున్న పేటలచే పోగొట్టబడిన గంధము గలదైన ముత్యాలహారమును తీసివైచి, బాలసూర్యునివలె కావిరంగు గలదియు, స్తనౌన్నత్యముచే పలుచబడిన చిక్కదనముగల నారచీరను కట్టుకొనెను.

**పాఠాన్తరాలు :–** యష్టిప్రవిలుప్తచన్దనమ్ – దృష్టిః పరిలుప్తచన్దనా

**విభక్తులు / క్రియలు :–** 1. **అహార్యనిశ్చయా – అహార్యనిశ్చయా,** అహార్యనిశ్చయే, అహార్య నిశ్చయాః; ఆకారాన్త స్త్రీలింగ అహార్యనిశ్చయాశబ్దము. ప్ర.ఏ 2. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము. ప్ర.ఏ 3. విలోల...చన్దనమ్– **...చన్దనమ్,** చన్దనౌ, చన్దనాః; అకారాన్త పుంలింగ ...చన్దనశబ్దము. ద్వి.ఏ 4. హారమ్ – **హారమ్,** హారౌ, హారాన్; అకారాన్త పుంలింగ హారశబ్దము. ద్వి.ఏ 5. విముచ్య – అవ్యయము 6. బాలారుణబభ్రు –**...బభ్రు,** ...బభ్రుణీ, ...బభ్రూణి; ఉకారాన్త నపుంసకలింగ...బభ్రుశబ్దము. ద్వి.ఏ 7. పయోధర ...సంహతి – ...సంహతి, ...సంహతినీ, ...సంహతీని; ఇకారాన్త నపుంసకలింగ ...సంహతిశబ్దము. ద్వి.ఏ 8. వల్కలమ్ – **వల్కలమ్,** వల్కలే, వల్కలాని: అకారాన్త నపుంసకలింగ వల్కలశబ్దము. ద్వి.ఏ 9. బబన్ధ – క్రియ – లిట్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. అహార్యనిశ్చయా – న హార్యః (నఞ్‌తత్పు.) అహార్యః, అహార్యః నిశ్చయో యస్యాః (బహువ్రీహి) సా।
2. బాలారుణబభ్రు – బాలః చాసౌ అరుణః (కర్మధా.) బాలారుణః, బాలారుణ ఏవ బభ్రు (కర్మధా.), తత్।
3. విలోలయష్టిప్రవిలుప్తచన్దనమ్ – విశేషేణ లోలాః (ప్రాదితత్పు.) విలోలాః విలోలాశ్చ తాః యష్టయశ్చ – విలోలయష్టయః (వి.పూ.కర్మధా.) విలోలయష్టిభిః ప్రవిలుప్తం చందనం యేన (బహువ్రీహి) సః విలోలయష్టి ప్రవిలుప్తచన్దనః విలోలయష్టిభిః ప్రవిలుప్తచందనః (తృ.త.) తమ్।
4. పయోధరోత్సేధవిశీర్ణసంహతి – పయసాం ధరౌ పయోధరౌ (ష.త.) పయోధరయోః ఉత్సేధః (ష.త.) పయోధరోత్సేధః, పయోధరోత్సేధేన విశీర్ణా సంహతిః (తృ.త.) యస్య (బహువ్రీహి) తత్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వల్కలః (పుం.) – (నపుం.)**

ఎ) వలతే సంవృణోతీతి। వల్ బాహులకాత్ కలన్।

బి) "శ్లో॥ త్వగ్వల్కం వల్కలం ప్రోక్తం..." అని హలాయుధకోశము.

సి) శ్లో॥ తౌ తు పూర్వేణ కాలేన తపోయుక్తౌ బభూవతుః।
క్షుత్పిపాసాపరిశ్రాన్తౌ జటావల్కలధారిణౌ॥
– ఇతి మహాభారతే – 1–156–2

డి) శ్లో॥ దధతో మఙ్గలక్షౌమే వసానస్య చ వల్కలే।
దదృశుర్విస్మితాస్తస్య ముఖరాగం సమం జనాః॥ ర.వం. 12–8

'పట్టాభిషేకముకొఱకు పట్టు పుట్టములు కట్టుకొనుచున్నప్పుడును "అరణ్యమునకు





వెళ్లుటకొఱకు నారచీరలను ధరించుచున్నప్పుడును, శ్రీరాముని ముఖవర్ణము ఒకేవిధముగా ఉండుటను చూచి జనులు ఆశ్చర్యపడిరి.'

**అలంకారములు:–** ఇందు 'పరివృత్త్యలంకార'మున్నదని చెప్పదగును.
**'పరివృత్తిర్వినిమయో న్యూనాభ్యధికయో ర్మిథః'** అని పరివృత్త్యలంకారలక్షణము
– చంద్రాలోకము – 109

అల్పమునకును అధికమునకును పరస్పరము మార్పిడి వర్ణించినయెడల అది 'పరివృత్త్యలంకార'మగును. పరివృత్తియనగా 'పరివర్తన'మని యర్థము.
'పర్వతరాజ పుత్రియగు ఆ పార్వతీదేవి నారచీరను కట్టుకొనెను' అని వర్ణింపబడుటచే పరివృత్త్యలంకారము.

**క్రియాదర్శము :–**

**1. బబన్ధ :–** బన్ధ (బన్ధ్) బన్ధనే (బంధించుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, క్ర్యాదిప్రకరణమ్ (9) భూతే – లిట్ – ప్రథమపురుషైకవచనాంతః

**రూపాలు :– బబన్ధ** – బబన్ధతుః – బబన్ధుః – ప్రథమపురుష
బబన్ధిథ – బబన్ధథుః – **బబన్ధ** – మధ్యమపురుష
**బబన్ధ** – బబన్ధివ – బబన్ధిమ – ఉత్తమపురుష

శ్లో॥ తస్మిన్నభిద్యోతితబన్ధుపద్మే
ప్రతాపసంశోషితశత్రుపఙ్కే।
**బబన్ధ** సా నోత్తమసౌకుమార్యా
కుముద్వతీ భానుమతీవ భావమ్। – ర.వం. 6–36

---

**శ్లో॥ యథా ప్రసిద్ధైర్మధురం శిరోరుహై–**
**ర్జటాభిరప్యేవమభూత్తదాననమ్।**
**న షట్పదశ్రేణిభిరేవ పఙ్కజం**
**సశైవలాసఙ్గమపి ప్రకాశతే॥ 9**

**పదవిభాగము:–** యథా, ప్రసిద్ధైః, మధురమ్, శిరోరుహైః, జటాభిః, అపి, ఏవమ్, అభూత్, తదాననమ్, న, షట్పదశ్రేణిభిః, ఏవ, పఙ్కజమ్, సశైవలాసఙ్గమ్, అపి, ప్రకాశతే।

**అన్వయక్రమము :–** తదాననం ప్రసిద్ధైః శిరోరుహైః యథా మధురమ్ అభూత్। జటాభిః అపి ఏవం మధురమ్ అభూత్। పఙ్కజం షట్పదశ్రేణిభిః ఏవ న, (కిన్తు) సశైవలాసఙ్గమ్ అపి ప్రకాశతే।

**ప్రతిపదార్థము :–** తదాననమ్ – ఆ పార్వతీదేవి మోము, ప్రసిద్ధైః – అలంకృతమైన, శిరోరుహైః – తలవెంట్రుకలచేత, యథా – ఎట్లు, మధురమ్ – మనోహరమైనది, అభూత్ – ఆయెనో, జటాభిః+ అపి – జడలచే గూడ, ఏవమ్ మధురమ్ అభూత్ – ఇట్లే మనోహరమైనది ఆయెను, పఙ్కజమ్ – కమలము, షట్పదశ్రేణిభిః + ఏవ – తుమ్మెదలపంక్తిచేతనే, న – కాదు, సశైవలాసఙ్గమ్ + అపి – నాచు సంపర్కము కలిగియున్నను, ప్రకాశతే – ప్రకాశించును.

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవి మోము అలంకృతమైన తలవెంట్రుకలచేత ఎట్లు మనోహరమైన దాయెనో జడలచేగూడ ఇట్లే మనోహరమైనదాయెను. కమలము తుమ్మెదలపంక్తిచేతనే కాదు నాచు సంపర్కము కలిగియున్నను ప్రకాశించును.

**విభక్తులు/క్రియలు:–** 1. ఏవమ్, యథా, ఏవ – అవ్యయాలు 2. తదాననమ్ – **తదాననమ్**, తదాననే, తదాననాని; అకారాన్త నపుంసకలింగ తదాననశబ్దము. ప్ర.ఏ 3 ప్రసిద్ధైః – ప్రసిద్ధేన, ప్రసిద్ధాభ్యామ్, **ప్రసిద్ధైః;** అకారాన్త పుంలింగ ప్రసిద్ధశబ్దము. తృ.బ. 4. శిరోరుహైః – శిరోరుహేణ, శిరోరుహాభ్యామ్, **శిరోరుహైః** అకారాన్త పుంలింగ శిరోరుహశబ్దము. తృ.బ 5. మధురమ్ – **మధురమ్,** మధురే, మధురాణి; ఆకారాన్త నపుంసకలింగ మధురశబ్దము. ప్ర.ఏ 6. అభూత్ – క్రియ 7. జటాభిః – జటయా, జటాభ్యామ్, జటాభిః; ఆకారాన్తస్త్రీలింగ జటాశబ్దము. తృ.బ 8. పఙ్కజమ్ – **పఙ్కజమ్,** పఙ్కజే, పఙ్కజాని; అకారాన్త నపుంసకలింగ పఙ్కజశబ్దము. ప్ర.ఏ 9. షట్పదశ్రేణిభిః – షట్పదశ్రేణ్యా, షట్పదశ్రేణిభ్యామ్, **షట్పదశ్రేణిభిః;** ఇకారాన్త స్త్రీలింగ షట్పదశ్రేణిశబ్దము. తృ.బ 10. సశైవలాసఙ్గమ్ – **సశైవలాసఙ్గమ్,** ...సఙ్గే, ...సఙ్గాని; అకారాన్త నపుంసకలింగ...సఙ్గశబ్దము. ద్వి.ఏ. 11. ప్రకాశతే – క్రియ.

**సమాసాలు :–**

1. తదాననమ్ – తస్యాః ఆననమ్ (ష.త.)।
2. పఙ్కజమ్ – పఙ్కే జాయతే (స.త.) ఇతి తత్।
3. షట్పదశ్రేణిభిః – షట్ పదాని యేషాం (బహువ్రీహి) తే షట్పదాః షట్పదానాం శ్రేణయః (ష.త.) షట్పదశ్రేణయః తాభిః।
4. సశైవలాసఙ్కమ్ – శైవలానామ్ ఆసఙ్గః (ష.త.) శైవలాసఙ్గః, శైవలాసఙ్గేన సహవర్తతే (బహువ్రీహి) ఇతి తత్।



**సంధులు :–**

1. ప్రసిద్ధైః + మధురమ్ – ప్రసిద్ధైర్మధురమ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. శిరోరుహైః + జటాభిః – శిరోరుహైర్జటాభిః – విసర్గసన్ధిః।
3. జటాభిః + అపి – జటాభిరపి – విసర్గసన్ధిః।
4. అపి + ఏవమ్ – అప్యేవమ్ – యణాదేశసంధిః।

**ఇకోయణచి** (సూ 6-1-74) ఇ, ఉ, ఋ,ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగా నున్నప్పుడు క్రమముగ య్,వ్,ర్,ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

5. శ్రేణిభిః + ఏవ – శ్రేణిభిరేవ – విసర్గసన్ధిః (రుత్వమ్)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **పంకజమ్** – (నపుం.) –

ఎ) పఙ్కే పఙ్కాద్ వా జాతమ్ ఇతి। పఙ్క + జన్ + కర్తరి డః।

బి) శ్లో॥ సహస్రపత్త్రం శతపత్త్రమమ్బుజం
కుశేశయం తామరసం సరోరుహమ్।
విసప్రసూనం కమలం మహోత్పలం
సరోజమబ్జం నలినం చ పుష్కరమ్॥ 689

శ్లో॥ రాజీవమరవిన్దం చ పద్మం **పఙ్కజ**మిష్యతే।

అని హలాయుధకోశము 'పంకజము'నకు 17నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ దినేషు గచ్ఛత్సు నితాన్తపీవరం
తదీయమానీలముఖం స్తనద్వయమ్।
తిరశ్చకార భ్రమరాభిలీనయోః
సుజాతయోః **పఙ్కజ**కోశయోశ్శ్రియమ్॥ – ర.వం 3-8

"... ఆమె యొక్క స్తనద్వయము తుమ్మదలచే కప్పబడిన అందమైన తామరమొగ్గల శోభను తిరస్కరించెను."

**క్రియాదర్శము :– 1. అభూత్** – భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్, భూతే లుఙ్, ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :– అభూత్** – అభూతామ్ – అభూవన్.

శ్లో॥ ఆస్వాదవద్భిః కబలైస్తృణానాం
కణ్డూయనైర్దంశనివారణైశ్చ।

అవ్యాహతైః స్వైరగతైశ్చ తస్యా-
స్సమ్రాట్సమారాధనతత్పరో**ఽభూత్**॥ - ర.వం. 2-5

**2. ప్రకాశతే :-** ప్ర -ఉపసర్గ, కాశృ - దీప్తౌ, అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్, లట్ ప్రథమపురుషైకవచనాంతః.

**రూపాలు :- ప్రకాశతే** - ప్రకాశేతే - ప్రకాశన్తే

'కాశృ - దీప్తౌ' - అనునది దివాదిప్రకరణము(4)లోను కనబడుతుంది.

శ్లో॥ చకాస్తి భాసతే భాతి ద్యోతతే రోచతేఽసతి।
రాజతి త్వేషతి ఘృణోత్యాత్మనేఽపి చతుష్టయమ్॥ 13

శ్లో॥ భ్రాజతే శుమ్భతి శుభత్యేజతే శోభతీతి చ ।
**ప్రకాశతే** భ్రాశతే చ భ్లాశతే శ్యన్యపి ద్వయమ్॥

శ్లో॥ భ్రేజతే దీవ్యతి హటత్యమీ జ్వలతి జోతతే
వర్చతే దీప్యతే దీప్తౌ కనత్యుల్లసతీతి చ । 15

శ్లో॥ కేచిజ్జిఘర్తి దీధీతే బభస్తి ఛాన్దసాన్విదుః।
కఞ్చతే యేతతే మన్దతేఽమీ ద్వాత్రింశదీరితాః ॥ 16

-ఇతి ఆఖ్యాతచంద్రికాయామ్ - ద్వితీయకాణ్డే.

**అలంకారాలు :-** ఎ) ఇట 'ప్రతివస్తూపమాలంకార'మున్నదని చెప్పదగును.

**'వాక్యయోరేకసామాన్యే ప్రతివస్తూపమా మతా'** - చంద్రాలోకలక్షణము - 46

రెండు వాక్యముల కొకసామాన్యధర్మముతో నన్వయమున్నయెడల ప్రతి వస్తూపమాలంకారమగును.

1) పార్వతీదేవిమోము అలంకృతమైన తలవెంట్రుకలచేత ఎట్లు మనోహరమైనదో అట్లే

2) పార్వతీదేవిమోము జడలచే కూడా మనోహరమైనది - అను రెండు వాక్యములకు 'మనోహరమైన' అను ఒక సామాన్యధర్మముతో అన్వయము. అట్లే

1) కమలము తుమ్మెదల పంక్తిచేత ప్రకాశించును. అట్లే

2) కమలము నాచు సంపర్కము కలిగియున్నను ప్రకాశించును.

పై రెండు వాక్యములకు ప్రకాశించును' అను ఒక సామాన్యధర్మముతో అన్వయము. కావున ప్రతివస్తూపమాలంకారము.

16



బి) ఉత్తరార్ధముచే పూర్వార్ధము సమర్థింపబడుటచే నిట 'అర్థాన్తరన్యాసాలంకార' మున్నదని చెప్పదగును.

---

**అవతారికా :-** పార్వతీతపోవర్ణనమ్ - పార్వతీదేవి చేసిన తపోవర్ణనము

**శ్లో॥ ప్రతిక్షణం సా కృతరోమవిక్రియాం
వ్రతాయ మౌఞ్జీం త్రిగుణాం బభార యామ్।
అకారి తత్పూర్వనిబద్ధయా తయా
సరాగమస్యా రశనాగుణాస్పదమ్॥ 10**

**పదవిభాగము :-** ప్రతిక్షణమ్, సా, కృతరోమవిక్రియామ్, వ్రతాయ, మౌఞ్జీమ్, త్రిగుణామ్, బభార, యామ్, అకారి, తత్పూర్వనిబద్ధయా, తయా, సరాగమ్, అస్యాః, రశనాగుణాస్పదమ్॥

**అన్వయక్రమము :-** సా ప్రతిక్షణం కృతరోమవిక్రియాం త్రిగుణాం యాం మౌఞ్జీం వ్రతాయ బభార, తత్పూర్వనిబద్ధయా తయా అస్యాః రశనాగుణాస్పదం సరాగమ్ అకారి।

**ప్రతిపదార్థము :-** సా - ఆ పార్వతీదేవి, ప్రతిక్షణమ్ - ప్రతినిముషమును, కృతరోమవిక్రియామ్ - చేయబడిన గగుర్పాటుగల, త్రిగుణామ్ - మూడుపేటలుగల, యామ్ - ఏ, మౌఞ్జీమ్ - ముంజత్రాడును, వ్రతాయ - తపస్సుకొఱకు, బభార - కట్టుకొనెనో, తత్పూర్వనిబద్ధయా - మొట్టమొదటిసారిగ కట్టుకోబడిన, తయా - ఆ ముంజత్రాడుచేత, అస్యాః - ఈ పార్వతీదేవియొక్క, రశనాగుణాస్పదమ్ - మొలత్రాడు కట్టుకొను ప్రదేశము, సరాగమ్ - ఎఱుపు రంగుతో కూడినదిగా, అకారి - చేయబడెను.

**తాత్పర్యము :-** ఆ పార్వతీదేవి ప్రతినిమిషమును చేయబడిన గగుర్పాటుగల మూడుపేటలు గల ఏ ముంజత్రాడును తపస్సుకొఱకు కట్టుకొనెనో, మొట్టమొదట సారిగా కట్టుకోబడిన ఆ ముంజత్రాటిచేత ఆ పార్వతీదేవియొక్క మొలత్రాడు కట్టుకొను ప్రదేశము ఎఱుపురంగుతో గూడినదిగా చేయబడెను.

**పాఠాన్తరాలు :-** 1. రోమ - రూప 2. త్రిగుణామ్ - ద్విగుణామ్

**విభక్తులు/క్రియలు :–** 1. సా – సా, తే, తాః; దకారాన్తస్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. ప్రతిక్షణమ్ – అవ్యయము 3. కృతరోమవిక్రియామ్ –…**విక్రియామ్,** …విక్రియే, … విక్రియాః; ఆకారాన్త స్త్రీలింగ …విక్రియాశబ్దము. ద్వి.ఏ. 4. త్రిగుణామ్ – **త్రిగుణామ్,** త్రిగుణే, త్రిగుణాః; ఆకారాన్త స్త్రీలింగ త్రిగుణాశబ్దము. ద్వి.ఏ 5. యామ్ – **యామ్,** యే, యాః; దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము. ద్వి.ఏ 6. మౌఞ్జీమ్, – **మౌఞ్జీమ్,** మౌఞ్జ్యౌ, మౌఞ్జీః; ఈకారాన్త స్త్రీలింగ మౌఞ్జీశబ్దము. ద్వి.ఏ 7. వ్రతాయ – **వ్రతాయ,** వ్రతాభ్యామ్, వ్రతేభ్యః; అకారాన్త పుంలింగ వ్రతశబ్దము. చ.ఏ 8. బభార – క్రియ 9. తత్పూర్వనిబద్ధయా – …**నిబద్ధయా,** …నిబద్ధాభ్యామ్, …నిబద్ధాభిః; ఆకారాన్త స్త్రీలింగ… నిబద్ధాశబ్దము. తృ.ఏ 10. తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 11. అస్యాః – **అస్యాః,** ఆభ్యామ్, ఆభ్యః; మకారాన్త స్త్రీలింగ 'ఇదమ్' శబ్దము. ష.ఏ 12. రశనాగుణాస్పదమ్ – …**ఆస్పదమ్,** …ఆస్పదే, …ఆస్పదాని; అకారాన్త నపుంసకలింగ…ఆస్పదశబ్దము. ప్ర.ఏ 13. సరాగమ్ – సరాగమ్, సరాగే, సరాగాణి; అకారాన్త నపుంసకలింగ సరాగశబ్దము. ప్ర.ఏ 14. అకారి – క్రియ – కర్మణి –లుఙ్.

**సమాసాలు :–**

1. ప్రతిక్షణమ్ – క్షణే క్షణే – అవ్యయీభావసమాసః।
2. కృతరోమవిక్రియామ్ – రోమ్ణాం విక్రియా (ష.త.) రోమవిక్రియా కృతా రోమవిక్రియా యయా (బహువ్రీహి) సా, తామ్।
3. త్రిగుణామ్ – త్రయో గుణాః యస్యాః (బహువ్రీహి) సా త్రిగుణా, తామ్ ।
4. తత్పూర్వనిబద్ధయా – తదేవ పూర్వం యస్య (బహువ్రీహి) తత్ తత్పూర్వమ్, తత్పూర్వం నిబద్ధా, తత్పూర్వనిబద్ధా, తయా।
5. రసనాగుణాస్పదమ్ – రసనాయాః గుణః (ష.త.) రసనాగుణః, రసనాగుణస్య ఆస్పదమ్ (ష.త) రసనాగుణాస్పదమ్।
6. సరాగమ్ – రాగేణ సహితమ్ (బహువ్రీహి) ।సరాగమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మౌఞ్జీ :–** ఎ) ముఞ్జ్ + అణ్ + ఙీప్

బి) ముఞ్జస్య వికారః మౌఞ్జీ, తాం మౌఞ్జీమ్, 'తస్య వికారః' ఇత్యణ్ । 'టి డ్ఢా…' ఇత్యాదినా ఙీప్।

సి) మౌఞ్జీ త్రివృత్సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా।
క్షత్రియస్య మౌర్వీ జ్యా వైశ్యస్య శణతాంతవీ। మనుస్మృతి – 2 –42

'బ్రాహ్మణుడైన బ్రహ్మచారి ముంజతో పేనినదై నునుపై సమానమైన మూడుపేటలుగల మొలత్రాడు గట్టవలయును…"





డి) శ్లో॥ పిశంగమౌఞ్జీయుజమర్జునచ్ఛవిం వసానమేణాజినమఞ్జనద్యుతి।
సువర్ణసూత్రాకలితాధరామ్బరాం విడమ్బయన్తం శితివాససస్తనుమ్॥
– మాఘకావ్యమ్ 1–6

"పచ్చని ముంజత్రాటితోడ కూడినవాడును, తెల్లని మేనిరంగుగల వాడును, కాటుకయొక్క కాంతివంటి కాంతిగల జింకచర్మమును కప్పుకొన్నవాడును…"

ఇ) శ్లో॥ మాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌఞ్జీబన్ధనే।
తృతీయం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్॥
– మనుస్మృతి–2–169

"ద్విజునకు తల్లిగర్భమునుండి మొదటి జననము, ఉపనయనమున రెండవ జననము, యజ్ఞమువలన తృతీయ జన్మము."

**అలంకారములు :–** ఇందు 'పరివృత్త్యలంకార'మున్నదని చెప్పదగును.
అత్ర రశనాగుణాస్పదశబ్దేన రశనాం పరిత్యజ్య తత్స్థానే మౌఞ్జీబన్ధనం ద్యోత్యత ఇతి పరివృత్తిరలంకారో ధ్వన్యతే।

**క్రియాదర్శనము :– 1. అకారి :–** 'డు కృ ఞ్ – కర్మణే' కర్మణి లుఙ్. ప్ర.ఏ. అకారి/అకారిష్ట – అకారిషాతామ్ – అకారిషత

---

**శ్లో॥ విసృష్టరాగాదధరాన్నివర్తితః**
**స్తనాఙ్గరాగారుణితాచ్చ కన్దుకాత్।**
**కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః**
**కృతోఽక్షసూత్రప్రణయీ తయా కరః॥ 11**

**పదవిభాగము :–** విసృష్టరాగాత్, అధరాత్, నివర్తితః, స్తనాఙ్గరాగారుణితాత్, చ, కన్దుకాత్, కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః, కృతః, అక్షసూత్రప్రణయీ, తయా, కరః।

**అన్వయక్రమము :–** తయా విసృష్టరాగాత్ అధరాత్ నివర్తితః, స్తనాఙ్గరాగారుణితాత్ కన్దుకాత్ చ నివర్తితః కరః కుశా.. అఙ్గులిః అక్షసూత్రప్రణయీ కృతః।

**ప్రతిపదార్థము :–** తయా – ఆ పార్వతీదేవిచేత, విసృష్టరాగాత్ – విడువబడిన లాక్షారసముగల, అధరాత్ – అధరోష్ఠమునుండి, నివర్తితః – తొలగింపబడినదియు,

స్తన – అఙ్గ – రాగ – అరుణితాత్ – స్తనములయందలి మైపూతచేత ఎఱ్ఱగా చేయబడిన, కన్దుకాత్ చ – బంతినుండి, నివర్తితః – తొలగింపబడినదియు అగు, కరః – చేయి, కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః – దర్భాంకురములను తెచ్చుటచేత గాయమైన వ్రేళ్ళుకలదిగాను, అక్షసూత్రప్రణయీ – అక్షమాల త్రిప్పుటయందు మక్కువకలదిగాను, కృతః – చేయబడెను.

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవిచేత విడువబడిన లాక్షారసముగల అధరోష్ఠమునుండి తొలగింపబడినదియు, స్తనములయందలి మైపూతచేత ఎఱ్ఱగా చేయబడిన బంతినుండి తొలగింపబడినదియు అగు 'చేయి' దర్భాంకురములను తెచ్చుటచేత గాయమైన వ్రేళ్లుకలదిగాను, అక్షమాల త్రిప్పుటయందు మక్కువకలదిగాను చేయబడెను.

**పాఠాన్తరాలు :–** 1. కన్దుకాత్ – కఞ్చుకాత్ 2. విసృష్ట – నిసృష్ట

**విభక్తులు/క్రియలు:–**1.తయా – **తయా**, తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ. 2. విసృష్టరాగాత్ – **విసృష్టరాగాత్,** విసృష్టరాగాభ్యామ్, విసృష్టరాగేభ్యః; అకారాన్త పుంలింగ విసృష్టరాగ శబ్దము. పం.ఏ 3. అధరాత్ – **అధరాత్**, అధరాభ్యామ్, అధరేభ్యః; అకారాన్త పుంలింగ అధరశబ్దము. పం.ఏ 4. నివర్తితః – **నివర్తితః,** నివర్తితౌ, నివర్తితాః; అకారాన్త పుంలింగ నివర్తితశబ్దము. ప్ర.ఏ 5. స్తనాఙ్గరాగారుణితాత్ – ...**అరుణితాత్,** ...అరుణితాభ్యామ్, ...అరుణితేభ్యః అకారాన్త పుంలింగ... అరుణితశబ్దము. పం.ఏ 6. కన్దుకాత్ – **కన్దుకాత్**, కన్దుకాభ్యామ్, కన్దుకేభ్యః; అకారాన్త పుంలింగ కన్దుకశబ్దము, పం.ఏ 7. కరః – **కరః**, కరౌ, కరాః; అకారాన్త పుంలింగ కరశబ్దము. ప్ర.ఏ 8. కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః – ...**అఙ్గులిః**, ...అఙ్గులీ, ...అఙ్గులయః; ఇకారాన్త పుంలింగ ...అంగులి శబ్దము.ప్ర.ఏ 9. అక్షసూత్రప్రణయీ – ...**ప్రణయీ,** ...ప్రణయినౌ, ...ప్రణయినః; నకారాన్త పుంలింగ 'ప్రణయిన్' శబ్దము.ప్ర.ఏ 10. కృతః– **కృతః,** కృతౌ, కృతాః; అకారాన్త పుంలింగ కృతశబ్దము. ప్ర.ఏ

**సమాసాలు :–**

1. విసృష్టరాగాత్ – విసృష్టః రాగః యస్మాత్ (బహువ్రీహి) సః, తస్మాత్।
2. స్తనాఙ్గరాగారుణితాత్ – స్తనయోః అఙ్గరాగః (ష.త.) స్తనాఙ్గరాగః, స్తనాఙ్గరాగేణ అరుణితః (తృ.త) స్తనాఙ్గరాగారుణితః, తస్మాత్।
3. కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః – కుశానామ్ అంకురాః (ష.త.) కుశాఙ్కురాః కుశాఙ్కురాణామ్ ఆదానమ్ (ష.త.) కుశాఙ్కురాదానమ్ కుశాఙ్కురాదానేన పరిక్షతాః అఙ్గులయః యస్య (బహువ్రీహి) సః।
4. అక్షసూత్రప్రణయీ – అక్షాణాం సూత్రమ్ (ష.త.) అక్షసూత్రమ్, అక్షసూత్రే ప్రణయీ (స.త.) అక్షసూత్రప్రణయీ।



**సంధులు :–**

1. అధరాత్ + నివర్తితః – అధరాన్నివర్తితః – అనునాసికసన్ధిః।

**యరోఽ నునాసికే అనునాసికో వా** (సూ 8–4–44) రహలు తప్ప తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్రులకు) అనునాసిక వర్ణము పరముగా నున్నచో ఆయా వర్గలకు సంబంధించిన అనునాసిక (ఙ మ ఞ ణ న) వర్ణమాదేశముగ వికల్పముగ వచ్చును.

2. అరుణితాత్ + చ – అరుణాతాచ్చ – చర్త్వమ్।
3. కృతః + అక్షసూత్ర... – కృతోక్షఽ సూత్ర... – ఉత్వాదేశః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. స్తనః :–** (పుం.) –

ఎ) స్తన్యతే శబ్ద్యతే కాముకైః, స్తనయతి కథయతి వక్షః శోభామితి వా । స్తన్ శబ్దే + ఘఞ్

బి) శ్లో॥ ఉరసిజకుచవక్షోరుహపయోధరాః **స్తన** సమాననామాని।
ఉక్తాః...అని హలాయుధకోశము 'స్తనము'నకు 5 నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ అరోమశౌ **స్తనౌ** పీనౌ ఘనావవిషమౌ శుభౌ।
కఠినావరోమమురో మృదుగ్రీవా చ కమ్బుభా ॥
– ఇతి గారుడే 56–95

డి) "దేవాసురాత్మస్వర్గగిరిసముద్రనఖకేశదన్త **'స్తన'** భుజ కణ్ఠఖడ్గ శరపఙ్కాభిధానాని"। – అని లింగానుశాసనప్రకరణము.

ఏతాని పుంసి స్యుః। దేవాః సురాః।...।స్తనః కుచః।... పఙ్కః కర్దమ ఇత్యాది।

ఇ) "**స్తనౌ** మాంసగ్రన్థీ కనకకలశావిత్యుపమితౌ.." –భర్తృహరిశతకే – 3.20

**అలంకారాలు :–** అత్రైకస్యైవ కరస్యాధరాదౌ దర్భాంకురాదౌ చ క్రమేణ వర్తనాత్ పర్యాయాలంకారః। తల్లక్షణం యథా –
"ఏకమనేకస్మిన్ననేకమేకస్మిన్వా క్రమేణ పర్యాయః" –
– శ్రీరాజానకరుయ్యకుని అలంకార సర్వస్వము.

పార్వతీదేవి **చేయి** అధరాదులనుండి దర్భాంకురాదుల వైపు క్రమముగా పరివర్తన చెందినట్లు వర్ణింపబడుటచే 'పర్యాయాలంకారము' అని చెప్పదగును.

**శ్లో॥ మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః**
**స్వకేశపుష్పైరపి యా స్మ దూయతే।**
**అశేత సా బాహులతోపధాయినీ**
**నిషేదుషీ స్థణ్డిల ఏవ కేవలే॥ 12**

**పదవిభాగము :–** మహార్హశయ్యా…చ్యుతైః, స్వకేశపుష్పైః, అపి, యా, స్మ, దూయతే, అశేత, సా, బాహులతోపధాయినీ, నిషేదుషీ, స్థణ్డిలేః, ఏవ, కేవలే।

అన్వయక్రమము – మహా…చ్యుతైః స్వకేశపుష్పైః అపి యా దూయతే స్మ సా బాహు…ధాయినీ (సతీ) కేవలే స్థణ్డిలే ఏవ నిషేదుషీ (సతీ) అశేత।

**ప్రతిపదార్థము :–** మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః – అమూల్యమగు పాన్పుపైదొర్లుట చేత జారినట్టి, స్వకేశపుష్పైః అపి – తన తలకట్టునందలి పూవులచేత కూడ, యా – ఏ దేవి, దూయతే స్మ – క్లేశమునొందునో, సా – ఆ పార్వతీదేవి, బాహులతోపధాయినీ(సతీ) – తీగవంటి బాహువును దిండుగా చేసికొనుచున్నదియై, కేవలే – బొత్తిగా, స్థణ్డిలే ఏవ – నేలమీదనే, నిషేదుషీ – కూర్చున్నది, అశేత – పరున్నది.

**తాత్పర్యము :–** అమూల్యమగు పాన్పుపై దొర్లుటచేత జారినట్టి తన తలకట్టునందలి పూవులచేతకూడ ఏ దేవి క్లేశము నొందునో ఆ పార్వతీదేవి తీగవంటి బాహువును దిండుగా చేసికొనుచున్నదియై బొత్తిగా నేలమీదనే కూర్చున్నది, పరున్నది.

**విభక్తులు/క్రియలు :–** 1. మహా…చ్యుతైః – …చ్యుతేన, …చ్యుతాభ్యామ్, …**చ్యుతైః** అకారాన్త నపుంసకలింగ…చ్యుతశబ్దము. తృ.బ 2. స్వకేశపుష్పైః – …పుష్పేణ, …పుష్పాభ్యామ్, …**పుష్పైః;** అకారాన్త నపుంసకలింగ…పుష్పశబ్దము. తృ.బ 3. అపి, ఏవ – అవ్యయాలు 4. యా – **యా,** యే, యాః; దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ. 5. దూయతే స్మ – క్రియ 6. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 7. బాహులతోపధాయినీ –…ధాయినీ, …ధాయిన్యౌ, …ధాయిన్యః ఈకారాన్త స్త్రీలింగ …ధాయినీశబ్దము. ప్ర.ఏ 8. కేవలే – **కేవలే,** కేవలయోః, కేవలేషు; అకారాన్త నపుంసకలింగ కేవలశబ్దము. స.ఏ 9. స్థణ్డిలే – **స్థణ్డిలే,** స్థణ్డిలయోః, స్థణ్డిలేషు; అకారాన్త నపుంసక స్థణ్డిలశబ్దము. స.ఏ 10. నిషేదుషీ – **నిషేదుషీ,** నిషేదుష్యౌ, నిషేదుష్యః; ఈకారాన్త స్త్రీలింగ నిషేదుషీశబ్దము. ప్ర.ఏ 11. అశేత – క్రియ – లఙ్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః – మహాన్ అర్హః యస్యాః (బహువ్రీహి) సా మహార్హా, మహార్హా చాసౌ శయ్యా (కర్మధా.) మహార్హశయ్యా,



మహార్హశయ్యాయాం పరివర్తనమ్ (స.త.) మహార్హశయ్యాపరివర్తనమ్, మహార్హశయ్యాపరివర్తనేన చ్యుతాని (తృ.త.) తైః।

2. స్వకేశపుష్పైః స్వే చ తే కేశాః (కర్మధా.) స్వకేశాః, స్వకేశేషు పుష్పాణి (ష.త.) స్వకేశపుష్పాణి, తైః।
3. బాహులతోపధాయినీ – బాహురేవ లతా (కర్మధా.) బాహులతా, బాహులతామ్ ఉపధత్తే (ఉపపదతత్పు.) ఇతి సా।

**సంధులు :–**

1. స్వకేశపుష్పైః + అపి – స్వకేశపుష్పైరపి – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. స్థణ్డిలే + ఏవ –స్థణ్డిల ఏవ – యవలోపః
 స్థణ్డిలే + ఏవ – అయాదేశము
 స్థణ్డిలయ్ + ఏవ – య లోపము
 స్థణ్డిల+ ఏవ – లోపమురాని పక్షమున స్థణ్డిలయేవ

**లోపఃశాకల్యస్య** (సూ 8–3–19) అకారము పూర్వమందుగల పదాంతమందున్న యకారవకారములకు అచ్చులుకాని మృదుహల్లులు కాని పరముగానున్నప్పుడు లోపము వికల్పముగ వచ్చును.

**ఏచోఽయవాయావః** (సూ 6–1–78) ఏఓఐఔలకు అచ్చుపరముగా నున్నపుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి ఆదేశముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. స్థణ్డిలమ్ :–** (నపుం.)

ఎ) తిష్ఠత్యస్మిన్నితి। స్థా + 'మిథిలాదయశ్చేతి' నిపాతనాద్ ఇలచ్। (ఉణాది 1–57) స్థల్ ఇల్ నుక్ లస్య డః।

బి) A piece of ground purified by sacrifice.

సి) "స్థణ్డిలం సంస్కృతా భూమిరయనం స్థానముచ్యతే।" 762
 అని హలాయుధకోశము 2 నామములను పేర్కొన్నది.

డి) 'యజ్ఞే పరిష్కృతస్థానే స్యాతాం **స్థణ్డిల**చత్వరే' – ఇతి శబ్దరత్నావళీ

ఇ) శ్లో॥ తస్మాత్ సమ్యక్ పరీక్ష్యైవం కర్తవ్యం శుభవేదికమ్।
 హస్తామాత్రం **స్థణ్డిలం** వా సంక్షిప్తే హోమకర్మణి॥
 – ఇతి వశిష్ఠసంహితాయామ్

ఎఫ్) శ్లో॥ **స్థణ్డిలే** మన్త్రహృదయైర్భోగైరాత్మానమాత్మని।
క్షేత్రజ్ఞం సర్వభూతేషు సమత్వేన యజేత మామ్॥
శ్రీమద్భాగవతము -11-11-45

జి) శ్లో॥ స్వప్యాద్ భూమౌ శుచీ రాత్రౌ దివసం నియమైర్నయేత్।
స్థానాసనవిహారైర్వా యోగాభ్యాసేన వా తథా।
- అని యాజ్ఞవల్క్యస్మృతి.

**క్రియాదర్శము :-**

**1. అశేత :-** శీఙ్ (శీ) స్వప్నే (నిద్రించుట) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, అదాదిప్రకరణమ్ (2), లఙ్ ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :- అశేత,** అశేయాతామ్ - అశేరత.

**2. దూయతే** - దూఙ్ (దూ) పరితాపే (బాధపడుట) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, దివాదిప్రకరణమ్(4), లట్ ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :- దూయతే** - దూయేతే - దూయన్తే

3. దూయతే + స్మ - భూతకాలమును సూచించును.

---

**శ్లో॥ పునర్గ్రహీతుం నియమస్థయా తయా**
**ద్వయేఽపి నిక్షేప ఇవార్పితం ద్వయమ్।**
**లతాసు తన్వీషు విలాసచేష్టితం**
**విలోలదృష్టం హరిణాఙ్గనాసు చ ॥ 13**

**పదవిభాగము :-** పునః, గ్రహీతుమ్, నియమస్థయా, తయా, ద్వయే, అపి, నిక్షేపః ఇవ, అర్పితమ్, ద్వయమ్, లతాసు, తన్వీషు, విలాసచేష్టితమ్, విలోలదృష్టమ్, హరిణాఙ్గనాసు, చ।

**అన్వయక్రమము :-** నియమస్థయా తయా తన్వీషు లతాసు విలాసచేష్టితం, హరిణాఙ్గనాసు విలోలదృష్టం చ, ద్వయే అపి ద్వయం పునః గ్రహీతుం నిక్షేపః అర్పితమ్ ఇవ।

**ప్రతిపదార్థము :-** నియమస్థయా - వ్రతముననున్న, తయా - ఆ పార్వతీదేవిచేత, తన్వీషు లతాసు - లేదీగలయందు, విలాసచేష్టితమ్ - ఒయ్యారమనెడి చేష్టయు,





హరిణాఙ్గనాసు - ఆడులేళ్లయందు, విలోలదృష్టమ్ చ - చంచలమగు చూపును, ద్వయే + అపి - రెంటియందును, ద్వయమ్ - రెండును, పునః - తిరిగి, గ్రహీతుమ్ - పొందుటకు, నిక్షేపః - నిక్షేపరూపముగ, అర్పితమ్ ఇవ - ఉంచబడినదివలె (ఉండెను)

**తాత్పర్యము :-** వ్రతముననున్న ఆ పార్వతీదేవిచేత, లేదీగలయందు ఒయ్యారమనెడి చేష్టయు, ఆడులేళ్లయందు చంచలమగు చూపును, రెంటియందును రెండు తిరిగి పొందుటకు నిక్షేపరూపముగ ఉంచబడినదివలె ఉండెను.

**పాఠాన్తరాలు:-**

1. ద్వయేఽపి - ద్వయీషు 2. నిక్షేపః - నిక్షేపమ్, 3. దృష్టమ్ - దృష్టిః

**విభక్తులు/క్రియలు:-** 1. నియమస్థయా - **నియమస్థయా,** నియమస్థాభ్యామ్, నియమస్థాభిః; ఆకారాన్త స్త్రీలింగ నియమస్థాశబ్దము. తృ.ఏ. 2. తయా - **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ. 3. తన్వీషు - తన్వ్యామ్, తన్వ్యోః, **తన్వీషు;** ఈకారాన్త స్త్రీలింగ తన్వీశబ్దము. స.బ.4. లతాసు - లతాయామ్, లతయోః, **లతాసు;** ఆకారాన్త స్త్రీలింగ లతాశబ్దము. స.బ 5. విలాసచేష్టితమ్ - **...చేష్టితమ్,** ...చేష్టితే, ...చేష్టితాని; అకారాన్త నపుంసకలింగ చేష్టితశబ్దము. ద్వి.ఏ 6. హరిణాఙ్గనాసు - హరిణాఙ్గనాయామ్, హరిణాఙ్గనయోః, **హరిణాఙ్గనాసు;** ఆకారాన్త స్త్రీలింగ హరిణాఙ్గనాశబ్దము. స.బ. 7. విలోలదృష్టమ్ -**...దృష్టమ్,** ...దృష్టే, ...దృష్టాని; అకారాన్త నపుంసకలింగ దృష్టశబ్దము. ద్వి.ఏ. 8. చ, అపి, పునః, ఇవ - అవ్యయాలు 9. ద్వయే - ద్వయే, ద్వయయోః, ద్వయేషు; అకారాన్త నపుంసకలింగ ద్వయశబ్దము. స.ఏ. 10. ద్వయమ్ - **ద్వయమ్**, ద్వయే, ద్వయాని; అకారాన్త నపుంసకలింగ ద్వయశబ్దము. ద్వి.ఏ 11. గ్రహీతుమ్ - అవ్యయము 12. నిక్షేపః - **నిక్షేపః**, నిక్షేపౌ, నిక్షేపాః; అకారాన్త పుంలింగ నిక్షేపశబ్దము. ప్ర.ఏ 13. అర్పితమ్ - **అర్పితమ్**, అర్పితే, అర్పితాని; అకారాన్త నపుంసకలింగ అర్పితశబ్దము. ప్ర.ఏ

**సమాసాలు :-**

1. నియమస్థయా - నియమే తిష్ఠతీతి (ఉపపదతత్పు.) నియమస్థా, తయా।
2. విలాసచేష్టితమ్ - విలాసః ఏవ చేష్టితమ్ (మయూరవ్యంసకాది తత్పురుష)
3. హరిణాఙ్గనాసు - హరిణానామ్ అఙ్గనాః (ష.త.) హరిణాఙ్గనాః, తాసు।
4. విలోలదృష్టమ్ - విలోలం చ తద్ దృష్టమ్ (కర్మధా.) విలోలదృష్టమ్।

**సంధులు :-**

1. పునః + గ్రహీతుమ్ - విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. ద్వయే + అపి - ద్వయేఽపి - పూర్వరూపసన్ధిః।

**ఏఙః పదాన్తాదతి** (సూ. 6-1-105) పదాంతమందున్న ఏ,ఓ లకు హ్రస్వ

అకారము పరముగానున్నపుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపము ఏకాదేశమగును.

3. నిక్షేపః + ఇవ – నిక్షేప ఇవ – విసర్గలోపసన్ధిః।

4. ఇవ + అర్పితమ్ – ఇవార్పితమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. హరిణః –** (పుం.)

ఎ) హరతి మనః, హ్రియతే గీతాదినా వా।
హృ 'శాస్త్యా హృ ఞ్ విభ్య ఇనచ్' ఇతి ఇనచ్।

బి) శ్లో॥ ఏణః కురఙ్గో **హరిణో** మృగః స్యాత్
సారంగ ఋష్యః పృషతో రురుశ్చ।
న్యఙ్కుస్తథా రఙ్కురితి ప్రసిద్ధా
వాతప్రమీశమ్బరకృష్ణసారాః ॥ 230

అని హలాయుధకోశము '13' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ **హరిణ**శ్చాపి విజ్ఞేయః పఞ్చభేదోఽత్ర భైరవ।
ఋష్యః ఖడ్గో రురుశ్చైవ పృషతశ్చ మృగస్తథా॥ – ఇతి కాళికాపురాణే

డి) శ్లో॥ అపి ప్రసన్నం **హరిణేషు** తే మనః
కరస్థదర్భప్రణయాపహారిషు।
య ఉత్పలాక్షి ప్రచలైర్విలోచనై–
స్తవాక్షిసాదృశ్యమివ ప్రయుంజతే॥ – కు.సం. 5–35

ఇ) శ్లో॥ ధనుర్భృతోఽప్యస్య దయార్ద్రభావ–
మాఖ్యాతమన్తఃకరణైర్విశఙ్కైః।
విలోకయన్త్యో వపురాపురక్ష్ణాం
ప్రకామవిస్తారఫలం **హరిణ్యః**॥ – ర.వం. 2–11

హరిణ్యః – ఈకారాన్తః స్త్రీలింగః ప్రథమాబహువచనాంతః।

**అలంకారాలు :–** ఇందు 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.
'తపఃసమయే నిశ్చలశరీరాయాం నాసాగ్రదత్తలోచనాయాం చ పార్వత్యాం విలాసవిలోలవిలోచనయోరదర్శనం లతాసు మృగీషు చ తద్దర్శనం చాత్రోత్ప్రేక్షాహేతుః।' అని పుంసవనీ వ్యాఖ్య





లేడీగలు విలాసముగ కదులుటయు, ఆడులేళ్లు బెదురుచూపులు కలిగియుండుటయు ప్రసిద్ధము. ఆ రెండింటిని పార్వతీదేవియే వాటియందు నిక్షేపణ గావించినట్లు కవి కల్పించుటచే నిట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

---

**శ్లో॥ అతన్ద్రితా సా స్వయమేవ వృక్షకాన్
ఘటస్తనప్రస్రవణైర్వ్యవర్ధయత్।
గుహోఽపి యేషాం ప్రథమాప్తజన్మనాం
న పుత్రవాత్సల్యమపాకరిష్యతి॥ 14**

**పదవిభాగము :–** అతన్ద్రితా, సా, స్వయమ్, ఏవ, వృక్షకాన్, ఘటస్తనప్రస్రవణైః, వ్యవర్ధయత్, గుహః, అపి, యేషామ్, ప్రథమాప్తజన్మనామ్, న, పుత్రవాత్సల్యమ్, అపాకరిష్యతి।

**అన్వయక్రమము :–** సా, స్వయమ్ ఏవ అతన్ద్రితా (సతీ) వృక్షకాన్ ఘటస్తనప్రస్రవణైః వ్యవర్ధయత్। గుహః అపి ప్రథమాప్తజన్మనాం యేషాం పుత్రవాత్సల్యం న అపాకరిష్యతి।

**ప్రతిపదార్థము :–** సా – ఆ పార్వతీదేవి, స్వయమ్ ఏవ – తనంత తానే, అతన్ద్రితా (సతీ) – ఏమరుపాటులేనిదై, వృక్షకాన్ –చిన్నమొక్కలను, ఘటస్తనప్రస్రవణైః – కడవలనెడి కుచములయొక్క స్రావములచే, వ్యవర్ధయత్ – అభివృద్ధిపఱచెను. గుహః + అపి – కుమారస్వామియు, ప్రథమాప్తజన్మనామ్ – మొదట పొందబడిన పుట్టువుకల, యేషామ్ – ఏ వృక్ష సంబంధమగు వానియొక్క, పుత్రవాత్సల్యమ్ – పుత్రప్రేమను, న అపాకరిష్యతి – పోగొట్టజాలడో?

**తాత్పర్యము :–** ఆ పార్వతీదేవి తనంతతానే ఏమరుపాటులేనిదై చిన్ని చిన్న మొక్కలను కడవలనెడి కుచములయొక్క స్రావములచే అభివృద్ధిపఱచెను. కుమారస్వామియు మొదట పొందబడిన పుట్టువుకల ఏ వృక్షసంబంధమగు వానియొక్క పుత్రప్రేమను పోగొట్టజాలడో?

**పాఠాన్తరాలు :–** 1. ప్రస్రవణైః – ప్రసవణైః, ప్రస్నవినా

**విభక్తులు/క్రియలు :–** 1. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము. ప్ర.ఏ. 2. ఏవ, అపి, న, స్వయమ్ – అవ్యయాలు 3. అతన్ద్రితా – **అతన్ద్రితా,** అతన్ద్రితే, అతన్ద్రితాః; ఆకారాన్త

స్త్రీలింగ అతన్ద్రితాశబ్దము. ప్ర.ఏ 4. వృక్షకాన్ – వృక్షకమ్, వృక్షకౌ, **వృక్షకాన్;** అకారాన్త పుంలింగ వృక్షకశబ్దము. ద్వి.ఏ. 5. ఘటస్తనప్రస్రవణైః **–...ప్రస్రవణేన,** ...ప్రస్రవణాభ్యామ్, ...ప్రస్రవణైః; అకారాన్త పుంలింగ...ప్రస్రవణశబ్దము. తృ.బ 7. వ్యవర్ధయత్ – క్రియ 8. గుహః – గుహః, గుహౌ, గుహాః; అకారాన్త పుంలింగ గుహశబ్దము. ప్ర.ఏ. 9. ప్రథమాప్తజన్మనామ్ –...జన్మనః, ...జన్మనోః , ...**జన్మనామ్**; నకారాన్త పుంలింగ...జన్మన్‌శబ్దము. ష.బ. 10. యేషామ్ – యస్య, యయోః, **యేషామ్;** దకారాన్తః పుంలింగః సర్వనామ 'యద్' శబ్దః ష.బహువచనాంతః। 11. పుత్రవాత్సల్యమ్ **– పుత్రవాత్సల్యమ్,** పుత్రవాత్సల్యే, పుత్రవాత్సల్యాని, పుత్రవాత్సల్యశబ్దము. ద్వి.ఏ 12. అపాకరిష్యతి – క్రియ.

**సమాసాలు :–**

1. అతన్ద్రితా – న తన్ద్రితా (నఞ్‌తత్పు.)।
2. ఘటస్తనప్రస్రవణైః – ఘటౌ ఏవ స్తనౌ (కర్మధా.) ఘటస్తనౌ, ఘటస్తనయోః ప్రస్రవణాః (ష.త.), ఘటస్తనప్రస్రవణః తైః।
3. ప్రథమాప్తజన్మనామ్ – ప్రథమమ్ ఆప్తం (సుప్సుపా) ప్రథమాప్తం జన్మ యేషామ్ (బహువ్రీహి) తే ప్రథమాప్తజన్మానః, తేషామ్।
4. పుత్రవాత్సల్యమ్ – పుత్రే వాత్సల్యమ్ (స.త), తత్।

**సంధులు :–**

1. ప్రస్రవణైః + వ్యవర్ధయత్ – ప్రస్రవణై ర్వ్యవర్ధయత్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. గుహః + అపి – గుహోఽపి – ఉత్వాదేశః। పూర్వరూపసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. గుహః–**ఎ) గూహతి రక్షతి దేవసేనామ్। 'గుహూ – సంవరణే'। గుహ్ 'ఇగుపధాజ్ఞాప్రీకిరః కః' ఇతి క। (3-1-135) నామనిరుక్తౌ గుహా ఆవాసత్వేనాస్యస్యేతి అచ్।

బి) శ్లో॥ గౌరీపుత్రః షణ్ముఖః శక్తిపాణిః
క్రౌఞ్చారాతిః కార్తికేయో విశాఖః।
స్కన్దః స్వామీ తారకారిః కుమారః
సేనానీః స్యాదగ్నిభూర్బాహులేయః॥ 19

శ్లో॥ గాఙ్గేయో బ్రహ్మచారీ చ **గుహో** బర్హివాహనః।
మహాసేనో మహాతేజాః శరజన్మా చ కథ్యతే॥ 20
అని హలాయుధకోశము '20' నామములను పేర్కొన్నది.





సి) 1. 'రుద్రసూనుం తతః ప్రాహుర్గుహం గుణవతాం వరమ్'
– ఇతి మహాభారతే -3-228

2. దివ్యం శరవణం ప్రాప్య వవృధేఽద్భుతదర్శనః।
దదృశుః కృత్తికాస్తన్తు బాలార్కసదృశద్యుతిమ్।
స్కన్నత్వాత్ స్కన్దతాఞ్చాపి గుహావాసాద్ **గుహో**ఽభవత్।
– ఇతి మహాభారతే -13/83

డి)'గుహ ఇవాప్రతిహతశక్తిః' – అని కాదంబరి

ఇ) 'గుహః షాణ్మాతురే గుహా। సింహపుచ్ఛ్యాం చ గర్తే చ
పర్వతాదేశ్చ కందరే।' అని అమరకోశసుధావ్యాఖ్య

ఎఫ్) శ్లో॥ పరార్ధ్యవర్ణాస్తరణోపపన్నమ్
ఆసేదివాన్రత్నవదాసనం సః।
భూయిష్ఠమాసీదుపమేయకాన్తిః
మయూరపృష్ఠాశ్రయిణా **గుహేన** ॥ – ర.వం. 6-4

"...అజమహారాజు విచిత్రములైన రంగులుకల నెమలిపై నుండెడి **కుమారస్వామితో** సరిపోలియుండెను.

**అలంకారాలు :–** ఇందు 'విరోధాలంకార'మున్నదని చెప్పదగును.
'అత్ర వాత్సల్యాపాకరణాభావో గుహం ప్రతి విరుద్ధ ఇతి విరోధాలంకారః'
– అని వివరణమ్ వ్యాఖ్య.

**క్రియాదర్శము :– 1. వ్యవర్ధయత్ :–** వి – ఉపసర్గ, 'వృధు – వృద్ధౌ' ణిజన్తాత్. అకర్మకమ్, సేట్, భ్వాదిప్రకరణమ్(1), ఆత్మనేపదీ, లఙ్ ప్ర.ఏ.
**రూపాలు :– అవర్ధయత్** – అవర్ధయతామ్ – అవర్ధయన్
2. అపాకరిష్యతి – అప – ఉపసర్గ, ఆఙ్ – ఉపసర్గ 'డుకృఞ్ – కరణే' లృట్ ప్ర.ఏ. సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ తనాదిప్రకరణమ్(8)
**రూపాలు :– అపాకరిష్యతి** – అపాకరిష్యతః – అపాకరిష్యన్తి

---

**శ్లో॥ అరణ్యబీజాఞ్జలిదానలాలితా–**
**స్తథా చ తస్యాం హరిణా విశశ్వసుః**

**యథా తదీయైర్నయనైః కుతూహలాత్**
**పురస్సఖీనామమిమీత లోచనే॥ 15**

**పదవిభాగము :–** అరణ్య...లాలితాః, తథా, చ, తస్యామ్, హరిణాః, విశశ్వసుః, యథా తదీయైః, నయనైః, కుతూహలాత్, పురః, సఖీనామ్, అమిమీత, లోచనే॥

**అన్వయక్రమము :–** అరణ్య...లాలితాః హరిణాః చ తస్యాం తథా విశశ్వసుః, యథా కుతూహలాత్ తదీయైః నయనైః లోచనే సఖీనాం పురః అమిమీత॥

**ప్రతిపదార్థము :–** అరణ్యబీజ అఞ్జలిదానలాలితాః – నీవారాదులయొక్క దోసిళ్లను ఇచ్చుటచేత లాలింపబడిన, హరిణాః చ – లేళ్లును, తస్యామ్ – ఆ పార్వతీదేవి యందు, తథా – అవ్విధముగ, విశశ్వసుః – విశ్వాసముంచినవి। యథా – ఎట్లనగా, కుతూహలాత్ – వేడుకవలన, తదీయైః – ఆ లేడుల, నయనైః – కండ్లతో, లోచనే – తన కన్నులను, సఖీనామ్ – చెలులయొక్క, పురః – ఎదుట, అమిమీత – కొలచెను.

**తాత్పర్యము :–** నీవారాదులయొక్క దోసిళ్ళను ఇచ్చుటచేత లాలింపబడిన లేళ్లును ఆ పార్వతీదేవియందు అవ్విధముగ విశ్వాసముంచినవి. ఎట్లనగా – వేడుకవలన ఆ లేడులకండ్లతో తన కన్నులను చెలులయొక్క ఎదుట కొలచెను.

**విభక్తులు/క్రియలు :–** 1. అరణ్యబీజాఞ్జలిదానలాలితాః – ...లాలితః, ...లాలితౌ, **...లాలితాః** అకారాన్త పుంలింగ ...లాలితశబ్దము. ప్ర.బ 2. హరిణాః – హరిణః, హరిణౌ, హరిణాః; అకారాన్త పుంలింగ హరిణశబ్దము. ప్ర.బ 3. చ, తథా, యథా, పురః – అవ్యయాలు 4. తస్యామ్ – **తస్యామ్,** తయోః, తాసు దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము. స.ఏ. 5. విశశ్వసుః – క్రియ – లిట్ – ప్ర.బ. 6. కుతూహలాత్ – **కుతూహలాత్,** కుతూహలాభ్యామ్ , కుతూహలేభ్యః; అకారాన్త నపుంసకలింగ కుతూహలశబ్దము. పం.ఏ 7. తదీయైః – తదీయేన, తదీయాభ్యామ్, **తదీయైః;** అకారాన్త నపుంసకలింగ తదీయశబ్దము. తృ.బ. 8. నయనైః – నయనేన, నయనాభ్యామ్, నయనైః; అకారాన్త నపుంసకలింగ నయనశబ్దము. తృ.బ 9. లోచనే – లోచనమ్, **లోచనే**, లోచనాని; అకారాన్త నపుంసకలింగ లోచనశబ్దము. ద్వి.ద్వి. 10. సఖీనామ్ – సఖ్యాః, సఖ్యోః, **సఖీనామ్;** ఈకారాన్త స్త్రీలింగసఖీశబ్దము. ష.బ 11. అమిమీత – క్రియ– లఙ్ – ప్ర.ఏ.

**సమాసాలు :–**

1. అరణ్యబీజాఞ్జలిదానలాలితాః – అరణ్యస్య బీజాని (ష.త.) అరణ్యబీజాని అరణ్యబీజానామ్ అఞ్జలయః (ష.త.) అరణ్యబీజాఞ్జలయః అరణ్య బీజాఞ్జలీనాం దానమ్ (ష.త.) అరణ్యబీజాఞ్జలీదానమ్, అరణ్య బీజాఞ్జలి దానేన లాలితాః (తృ.త.) అరణ్యబీజాఞ్జలిదానలాలితాః।





**సంధులు :–**

1. లాలితాః + తథా – లాలితాస్తథా – విసర్గసన్ధిః (సకారాదేశః)।
2. తదీయైః + నయనైః – తదీయైర్నయనైః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. పురః + సఖీనామ్ – పురస్సఖీనామ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)।
4. హరిణాః + విశశ్వసుః – హరిణా విశశ్వసుః – విసర్గసన్ధిః (విసర్గలోపము)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కుతూహలమ్ :–** (నపుం.)

ఎ) కుతూం చర్మమయతైలాదిపాత్రం హలతి విలిఖతి తద్వద్ అన్తఃకరణమ్ ఉత్కణ్ఠాపూర్ణం కరోతి ఇతి।
కుతూ + హల్ + మూలవిభుజాదిత్వాత్ క।

బి) "కౌతూహలం వినోదః స్యాత్కౌతుకం చ **కుతూహలమ్**'॥ 720
–అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ మహీ మహేన్ద్రస్తమవేక్ష్య స క్షణం
శకున్తమేకాన్తమనోవినోదినమ్।
ప్రియావియోగాద్విధురోఽపి నిర్భరం
**కుతూహలా**క్రాన్తమనామనాగభూత్॥
– ఇతి నైషధమహాకావ్యే 1–119

డి) శ్లో॥ దిలీపసూనోః స బృహద్భుజాన్తరం
ప్రవిశ్య భీమాసురశోణితోచితః।
పపా వనాస్వాదితపూర్వమాశుగః
**కుతూహలే**నేవ మనుష్యశోణితమ్॥ – ర.వం. 3–54

"...ఇంతకు పూర్వము రుచి చూడనట్టి మనుష్య రక్తమును కుతూహలముచేతవలె పానము చేసెను..."

ఇ) ఈ కుమారసంభవ శ్లోకభావమునకు సామ్యమున్న రఘువంశమునందలి (5–7) ఈ శ్లోకమును చూడండి.

శ్లో॥ క్రియానిమిత్తేష్వపి **వత్సలత్వా–**
దభగ్నకామా మునిభిః కుశేషు।
తదఙ్కశయ్యాచ్యుతనాభినాలా
కచ్చిన్మృగీణామనఘా ప్రసూతిః?॥

"యజ్ఞయాగాది సాధనములైన దర్భలను స్వేచ్ఛగా తినవలెనను కోర్కె కలవియును, వానిపైగల వాత్సల్యభావముగల ఆ మునుల ఒడులనే ప్రక్కగా చేసికొని పరుండి అచటనే బొడ్డులనాళములు జారిపడుచున్నవియు అగు లేడిపిల్లలు ప్రమాదరహితముగ నున్నవా?"

**క్రియాదర్శము :-**

**1. విశశ్వసుః :-** వి – ఉపసర్గ, 'శ్వస – ప్రాణనే' అదాదిప్రకరణమ్(2) వి – అను ఉపసర్గతోకూడిన శ్వసధాతువునకు 'విశ్వాసముంచుట' అని అర్థము. అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లిట్ – ప్రథమపురుషబహువచనాంతః.

**రూపాలు :-** శశ్వాస – శశ్వసతుః – **శశ్వసుః**

**2. అమీమిత :-** 'మాఙ్ – మానే శబ్దే చ' సకర్మకాకర్మకౌ, జుహోత్యాది ప్రకరణమ్ (3), అనిట్, ఆత్మనేపదీ, లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః

**రూపాలు :- అమిమీత** – అమీమాతామ్ – అమిమత

---

**శ్లో॥ కృతాభిషేకాం హుతజాతవేదసం**
**త్వగుత్తరాసఙ్గవతీమధీతినీమ్।**
**దిదృక్షవస్తామృషయోఽభ్యుపాగమ-**
**న్న ధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే॥ 16**

**పదవిభాగము :-** కృతాభిషేకామ్, హుతజాతవేదసమ్, త్వగుత్తరాసఙ్గవతీమ్, అధీతినీమ్, దిదృక్షవః, తామ్, ఋషయః, అభ్యుపాగమన్, న, ధర్మవృద్ధేషు, వయః, సమీక్ష్యతే।

**అన్వయక్రమము:-** కృతభిషేకాం హుతజాతవేదసం త్వగుత్తరాసఙ్గవతీమ్ అధీతినీం తాం దిదృక్షవః ఋషయః అభ్యుపాగమన్। ధర్మవృద్ధేషు వయః న సమీక్ష్యతే।

**ప్రతిపదార్థము :-** కృతాభిషేకామ్ – త్రిషవణస్నానము గలదియు, హుతజాతవేదసమ్ – అగ్నికార్యమును అనుష్ఠించినదియు, త్వగుత్తరాసఙ్గవతీమ్ – వల్కలముచే నుత్తరీయము గలదియు, అధీతినీమ్ – స్తుతిపఠనాదులు కావించునదియు అగు , తామ్ – ఆ పార్వతీదేవిని, దిదృక్షవః – చూడగోరినవారై, ఋషయః – మునులు,





అభ్యుపాగమన్ – వచ్చిరి, ధర్మవృద్ధేషు – ధర్మముచేత పెద్దలైన వారియెడ, వయః – వయస్సు, న సమీక్ష్యతే – చూడబడదు.

**తాత్పర్యము :-** త్రిషవణ స్నానముగలదియు, అగ్నికార్యమును అనుష్ఠించినదియు వల్కలముచే నుత్తరీయముగలదియు, స్తుతిపఠనాదులు కావించునదియు అగు ఆ పార్వతీదేవిని చూడగోరినవారై మునులు వచ్చిరి. ధర్మముచేత పెద్దలైన వారియెడ వయస్సు చూడబడదు.

**పాఠాన్తరాలు:** – సజ్గవతీమధీతినీమ్ – సజ్గవతీనివీతినీమ్.

**విభక్తులు/క్రియలు :-** 1. కృతాభిషేకామ్ – ...అభిషేకామ్, ...అభిషేకే, ... అభిషేకాః; ఆకారాన్త స్త్రీలింగ ...అభిషేకాశబ్దము. ద్వి.ఏ 2. హుతజాతవేదసమ్ –...వేదసమ్, ...వేదసౌ, ...వేదసః; సకారాన్త స్త్రీలింగ...వేదస్‌శబ్దము. ద్వి.ఏ 3. త్వగుత్తరాసజ్గవతీమ్ –... వతీమ్, ...వత్యౌ, ...వతీః; ఈకారాన్త స్త్రీలింగ...వతీశబ్దము. ద్వి.ఏ 4. అధీతినీమ్ – అధీతినీమ్, అధీతిన్యౌ, అధీతినీః ఈకారాన్త స్త్రీలింగ అధీతినీశబ్దము. ద్వి.ఏ 5. తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 6. దిదృక్షవః – దిదృక్షుః, దిదృక్షూ, దిదృక్షవః ఉకారాన్త పుంలింగ దిదృక్షుశబ్దము. ప్ర.బ 7. ఋషయః – ఋషిః, ఋషీ, ఋషయః; ఇకారాన్త పుంలింగ ఋషిశబ్దము. ప్ర.బ. 8. అభ్యుపాగమన్ – క్రియ – లుఙ్ – ప్ర.బ 9. ధర్మవృద్ధేషు – ధర్మవృద్ధే, ధర్మవృద్ధయోః, ధర్మవృద్ధేషు; అకారాన్త పుంలింగ ధర్మవృద్ధశబ్దము. స.బ 10. వయః – వయః, వయసీ, వయాంసి; సకారాన్త నపుంసకలింగ వయస్‌శబ్దము. ప్ర.ఏ 11. న– అవ్యయము 12. సమీక్ష్యతే – క్రియ – కర్మణి – లట్.

**సమాసాలు :-**

1. కృతాభిషేకామ్ – కృతః అభిషేకః యయా( బహుప్రీహి) సా, కృతాభిషేకా, తామ్।
2. హుతజాతవేదసమ్ – హుతః జాతవేదాః యయా (బహుప్రీహి) సా, హుతజాతవేదాః, తామ్।
3. త్వగుత్తరాసజ్గవతీమ్ – ఉత్తరే ఆసజ్యతే (ఉపపదతత్పు.) ఇతి ఉత్తరాసఙ్గః , సోఽస్యా అస్తీతి సా, త్వచా ఉత్తరాసజ్గవతీ (తృ.త.) త్వగుత్తరాసజ్గవతీ, తామ్।
4. ధర్మవృద్ధేషు – ధర్మేణ వృద్ధాః (తృ.త.) ధర్మవృద్ధాః తేషు।

**సంధులు :-**

1. దిదృక్షవః + తామ్ – దిదృక్షవస్తామ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)।
2. ఋషయః + అభ్యుపాగమన్ – ఋషయోఽభ్యుపాగమన్ – ఉత్వాదేశమ్।
3. వయః + సమీక్ష్యతే – వయస్సమీక్ష్యతే – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. జాతవేదాః :-**(పుం) (సాన్తః) - ఎ) విద్యతే లభ్యతే ఇతి। విద్ లాభే + అసున్। జాతం వేదో ధనం యస్మాత్।

బి) శ్లో॥ సప్తార్చిర్బహులః శిఖీ హుతవహో వైశ్వనరోఽగ్నిర్వసు-
రృష్నిర్వాయుసఖః సితేతరగతిః స్వాహాప్రియః పావకః।
అర్చిష్మాన్ జ్వలనః కృశానురనలో ధూమధ్వజో హవ్యవాట్
బర్హిర్జ్యోతిరుషర్బుధశ్చ దహనః స్యాచ్చిత్రభానుః శుచిః ॥ 62

శ్లో॥ కృపీటయోనిర్దమునాః కృష్ణవర్త్మాశుశుక్షణిః।
విభావసురపాంపిత్తం **జాతవేదా** స్తనూనపాత్॥ 63

శ్లో॥ వీతహోత్రో బృహద్భానురాశ్రయాశో ధనఞ్జయః।
హిరణ్యరేతాస్తమోఘ్నో రోహితాశ్వో హుతాశనః॥ 64

అని హలాయుధకోశము '39' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ పావనాత్ పావకశ్చాసి వహనాద్ధవ్యవాహనః।
వేదస్త్వదర్థం జాతా వై **జాతవేదా** స్తతోహ్యసి॥

-ఇతి మహాభారతే - 2-31-41

డి) "జాతవేదాః కస్మాత్ జాతాని వేద, జాతాని వై న విదుః,
జాతే జాతే విద్యతే ఇతి వా, జాతవిత్తో వా జాతధనో,
జాతవిద్యో వా జాతప్రజ్ఞానో యత్తజ్జాతః పశూనవిన్దతేతి
తజ్జాతవేదసో జాతవేదస్త్వమితి బ్రాహ్మణమ్"। - ఇతి నిరుక్తమ్

ఇ) తేజస్విమధ్యే తేజస్వీ దవీయానపి గణ్యతే।
పఞ్చమః పఞ్చతపసస్తపనో జాతవేదసామ్॥

- ఇతి మాఘమహాకావ్యే 2-51

"...సూర్యుడు మిగుల దూరమున నున్నవాడయినను పంచాగ్ని మధ్యమున తపస్సు చేయువాని చుట్టునుండవలయు**నగ్నులలో** ఐదవవాడుగా (భావింపబడుచున్నాడు)

ఎఫ్) శ్లో॥ రఘుపతిరపి జాతవేదోవిశుద్ధాం ప్రగృహ్య ప్రియాం
........................ప్రతస్థే పురీమ్॥ ర.వం. 12-104

'అగ్ని ప్రవేశము చేయుటచేత పరిశుద్ధురాలైన ప్రియురాలగు సీతాదేవిని స్వీకరించి...శ్రీరాముడు అయోధ్యానగరమునకు బయలుదేరెను.





**2. వృద్ధత్వమ్ :-** ఎ) చతుర్విధం హి వృద్ధత్వమ్ - వైరాగ్యవృద్ధత్వం, జ్ఞానవృద్ధత్వం ధర్మవృద్ధత్వం, వయోవృద్ధత్వం చేతి యేషు త్రివిధం వృద్ధత్వమ్ ఏకైకం వా, తేషు వయోవృద్ధత్వం న ప్రయోజకమ్। తస్యాఽప్రాధాన్యాదిత్యర్థః। తథా చాహ మనుః -

శ్లో॥ న తేన వృద్ధో భవతి, యేనాస్య ఫలితం శిరః।
యో వై యువాఽప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః ॥ఇతి॥

బి) "వైరాగ్యేణాపి వృద్ధస్తే సూనుః పర్వతకన్యకే!" - ఇతి స్కాన్దపురాణే.

సి) "జ్ఞానవృద్ధైర్వయోవృద్ధైః శీలవృద్ధైశ్చ సజ్జనైః, కథయన్నాస్త వై నిత్యమ్"

- ఇతి రామాయణే

3) శ్రుతిస్మృత్యుక్తసకలకర్మలు స్నానపూర్వకములు

శ్లో॥ అస్నాత్వా నాచరేత్కర్మ జపహోమాది కిఞ్చన।
స్నానమూలాః క్రియాస్సర్వాః శ్రుతిస్మృత్యుదితా నృణామ్॥ ఇతి స్మృతేః

కృతః అభిషేకః త్రిషవణస్నానం యయా, సా, కృతాభిషేకా, తామ్ - కృతాభిషేకామ్ అనేన శరీరశుద్ధిరుక్తా। సర్వవైదికకర్మణాం స్నానమూలత్వాత్ స్నానస్య ప్రథమముపాదానమ్।

**అలంకారములు :-** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. 'సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాసః'।

**అన్వయము :-** పార్వతీదేవి వయసుచే చిన్నదైనను, తపముచే మిన్నయగుటచే చిన్నదగు పార్వతీదేవి కడకు పెద్దలగు ఋషులు పోవుటను సమర్థించుటచే అర్థాన్తరన్యాసాలంకారము.

**క్రియాదర్శము :- 1) సమీక్ష్యతే :-** సమ్ - ఉపసర్గ, 'ఈక్ష - దర్శనే' కర్మణి, లట్ ప్రథమపురుషైకవచనాంతః, సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్(1)

**రూపాలు :- ఈక్ష్యతే** - ఈక్ష్యేతే - ఈక్ష్యన్తే

---

**శ్లో॥ విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరం**
**ద్రుమైరభీష్టప్రసవార్చితాతిథి।**
**నవోటజాభ్యన్తరసమ్భృతానలం**
**తపోవనం తచ్చ బభూవ పావనమ్॥ 17**

**పదవిభాగము :–** విరోధి...మత్సరమ్, ద్రుమైః, అభీష్టప్రసవార్చితాతిథి, నవోట...సమ్భృతానలమ్, తపోవనమ్, తత్, చ, బభూవ, పావనమ్॥

**అన్వయక్రమము :–** విరోధి...మత్సరం ద్రుమైః అభీష్ట .. తాతిథి నవో...నలం తత్ చ తపోవనం పావనం బభూవ।

**ప్రతిపదార్థము :–** విరోధి – సత్త్వ – ఉజ్ఝిత – పూర్వ – మత్సరమ్ = పరస్పరజాతివైరముకల జంతువులచేత విడువబడిన వెనుకటి వైరముకలదియు, ద్రుమైః – చెట్లచే, అభీష్టప్రసవ – అర్చితాతిథి = కోరిన పండ్లచేత పూజింపబడిన అతిథులు గలదియు, నవ – ఉటజ – అభ్యన్తర – సమ్భృత – అనలమ్ = నూతనమైన పర్ణశాలలయొక్క లోపలి ప్రదేశములయందు ప్రజ్వలింపచేయబడిన అగ్నులుకలదియు అగు, తత్ – ఆ, తపోవనమ్ – తపోవనము, పావనమ్ – పవిత్రీకరించునది, బభూవ – అయ్యెను.

**తాత్పర్యము :–** ఎ) పరస్పజాతివైరముకల జంతువులచేత విడువబడిన వెనకటి వైరముకలదియు బి) చెట్లచే కోరినపండ్లచేత పూజించబడిన అతిథులుగలదియు సి) నూతనమైన పర్ణశాలలయొక్కలోపలి ప్రదేశములయందు ప్రజ్వలింపచేయబడిన అగ్నులు కలదియునగు ఆ తపోవనము పవిత్రీకరించునది అయ్యెను.

**పాఠాన్తరాలు :–** 1. సంభృతా – సంస్కృతా 2. తచ్చ – తత్ర

**విభక్తులు/క్రియలు :–** 1. విరోధి...మత్సరమ్ – **...మత్సరమ్,** ...మత్సరే, ...మత్సరాణి; అకారాన్త నపుంసకలింగ ...మత్సరశబ్దము. ప్ర.ఏ 2. అభీష్టప్రసవార్చితాతిథి – **...అతిథి**, ...అతిథినీ, ...అతిథీని; ఇకారాన్త నపుంసకలింగ ...అతిథిశబ్దము. ప్ర.ఏ 3. నవ...అనలమ్... **అనలమ్**,...అనలే, అనలాని; అకారాన్త నపుంసకలింగ...అనలశబ్దము. ప్ర.ఏ 4. తత్ – **తత్,** తే, తాని; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 5. ద్రుమైః – ద్రుమేణ, ద్రుమాభ్యామ్, ద్రుమైః; అకారాన్త పుంలింగ ద్రుమశబ్దము. తృ.బ 6. తపోవనమ్– **తపోవనమ్,** తపోవనే, తపోవనాని; అకారాన్త నపుంసకలింగ తపోవనశబ్దము. ప్ర.ఏ 7. పావనమ్ – **పావనమ్**, పావనే, పావనాని; అకారాన్త నపుంసకలింగ పావనశబ్దము. ప్ర.ఏ 8. బభూవ – క్రియ– లిట్, ప్ర.ఏ

**సమసాలు :–**

1. విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరమ్ – విరోధినశ్చ తే సత్త్వాః (కర్మధా.) విరోధిసత్త్వాః, ఉజ్ఝితః పూర్వః మత్సరః యస్మిన్ (బహువ్రీహి) తత్। ఉజ్ఝితపూర్వమత్సరమ్ విరోధిసత్త్వైః ఉజ్ఝితపూర్వమత్సరం (తృ.త.) విరోధి...మత్సరమ్।





2. అభీష్ట ప్రసవార్చితాతిథి – అభీష్టశ్చ అసౌ ప్రసవః (కర్మధా.) అభీష్ట ప్రసవః, అర్చితాతిథి – అర్చితాః అతిథయః యస్మిన్ (బహువ్రీహి) తత్, అభీష్టప్రసవేన అర్చితాతిథి (తృ.త.)।
3. నవోటజాభ్యన్తరసమ్భృతానలమ్ – నవాశ్చ తే ఉటజాః (కర్మధా.) నవోటజాః, నవోటజానామ్ అభ్యన్తరాణి (ష.త.) నవోటజాభ్యన్తరాణి, తేషు సంభృతః అనలో యస్మిన్ (బహువ్రీహి) తత్।
4. తపోవనమ్ – తపసః వనమ్ (ష.త.)

**సంధులు :–**

1. ద్రుమైః + అభీష్ట ...– ద్రుమైరభీష్ట... విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. తత్ + చ – తచ్చ – శ్చుత్వసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. పావనమ్:–** (నపుం.)

ఎ) పావయత్యనేనేతి, పూ + ణిచ్ + ల్యుట్।

బి) శ్లో॥ శుచిర్మేధ్యం పవిత్రం చ పుణ్యం **పావన**ముచ్యతే।
విమలం విశదం వీధ్రముజ్జ్వలం స్యాదనావిలమ్॥ 132
అని హలాయుధకోశము దశనామములను పేర్కొన్నది.

సి) సా చేత్పునః ప్రదుష్యేత్తు సదృశేనోపయంత్రితా।
కృచ్ఛ్రం చాంద్రాయణం చైవ తదస్యాః **పావనం** స్మృతమ్॥ మనుస్మృతి 11–177

డి) 'పదనఖనీరజనితజన**పావన!**
కేశవ! ధృతవామనరూప। జయ జగదీశ! హరే!

ఇ) శ్లో॥ మన్యే భగవతః సాక్షాత్ పార్షదాన్ వో మధుద్విషః।
విష్ణోర్భూతాని లోకానాం పావనాయ చరన్తి హి ॥
– ఇతి శ్రీమద్భాగవతే –11–2–28

ఎఫ్) 'గావో విప్రాస్తథాగ్నిశ్చ యస్మిన్ దేశే ప్రతిష్ఠితాః, తం దేశం **పావనం** విద్యాద్' ఇతి వచనాత్। – 'వివరణమ్' వ్యాఖ్యనుండి

**క్రియాదర్శము :–**

**1. బభూవ :–** భూ – సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1) భూతానద్యతనపరోక్షే లిట్, ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు – బభూవ** – బభూవతుః – బభూవుః
బభూవిథ – బభూవథుః – **బభూవ**
**బభూవ** – బభూవివ – బభూవిమ.

---

**అవతారికా :–** పార్వతీదుశ్చరతపోవర్ణనమ్ – పార్వతీదేవియొక్క దుశ్చర తపోవర్ణనము

**శ్లో॥ యదా ఫలం పూర్వతపస్సమాధినా**
**న తావతా లభ్యమమంస్త కాంక్షితమ్।**
**తదానపేక్ష్య స్వశరీరమార్దవం**
**తపో మహత్ సా చరితుం ప్రచక్రమే ॥ 18**

**పదవిభాగము :–** యదా, ఫలమ్, పూర్వతపఃసమాధినా, న, తావతా, లభ్యమ్, అమంస్త, కాంక్షితమ్, తదా, అనపేక్ష్య, స్వశరీరమార్దవమ్, తపః, మహత్, సా, చరితుమ్, ప్రచక్రమే।

**అన్వయక్రమము :–** సా యదా తావతా పూర్వతపఃసమాధినా కాంక్షితం ఫలం లభ్యం న అమంస్త తదా స్వశరీరమార్దవమ్ అనపేక్ష్య మహత్ తపః చరితుం ప్రచక్రమే।

**ప్రతిపదార్థము :–** సా – ఆ పార్వతీదేవి, యదా – ఎప్పుడు, తావతా – అంతటి, పూర్వతపఃసమాధినా – అప్పటివఱకు ఆచరించిన తపోనియమముచేత, కాంక్షితమ్ – కోరబడిన, ఫలమ్ – ఫలము, న + లభ్యమ్ – పొందరానిదని, అమంస్త – తలంచెనో, తదా – అప్పుడు, స్వశరీరమార్దవమ్ – తన శరీరముయొక్క కోమలత్వమును, అనపేక్ష్య – లెక్కింపక, మహత్ – గొప్పదగు, తపః – తపమును, చరితుమ్ – ఆచరించుటకు, ప్రచక్రమే –ఉపక్రమించెను.

**తాత్పర్యము:–** ఆ పార్వతీదేవి ఎప్పుడు అంతటి, అప్పటివఱకు ఆచరించిన తపోనియయముచేత కోరబడిన ఫలము పొందరానిదని తలంచెనో అపుడు తన శరీరముయొక్క కోమలత్వమును లెక్కింపక గొప్పదగు తపమును ఆచరించుటకు ఉపక్రమించెను.





**పాఠాన్తరాలు :–** 1. పూర్వతపఃసమాధినా – పూర్వసర్వసమాధినా,
2. కాంక్షితమ్ – వాఞ్ఛితమ్

**విభక్తులు/క్రియలు :–** 1.సా – **సా**, తే, తాః దకారాన్తస్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. యదా, తదా, న – అవ్యయాలు 3. తావతా – **తావతా,** తావద్భ్యామ్, తావద్భిః; తకారాన్త పుంలింగ తావత్‌శబ్దము. తృ.ఏ 4. పూర్వతపఃసమాధినా – **...సమాధినా,** ...సమాధిభ్యామ్, ...సమాధిభిః; ఇకారాన్త పుంలింగ ...సమాధిశబ్దము. తృ.ఏ 5. కాంక్షితమ్ – **కాంక్షితమ్**, కాంక్షితే, కాంక్షితాని; అకారాన్త నపుంసకలింగ కాంక్షితశబ్దము. ద్వి.ఏ 6. ఫలమ్ – **ఫలమ్**, ఫలే, ఫలాని; అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. ద్వి.ఏ 7. లభ్యాని – **లభ్యమ్**, లభ్యే, లభ్యాని; అకారాన్త నపుంసకలింగ లభ్యశబ్దము. ద్వి.ఏ 8. అమంస్త – క్రియ – లుఙ్ – ప్ర.ఏ. 9. అనపేక్ష్య – అవ్యయము –ల్యబన్తము 10. మహత్ – **మహత్**, మహతీ, మహన్తి; తకారాన్త నపుంసకలింగ మహత్‌శబ్దము. ద్వి.ఏ 11. తపః – తపః, తపసీ, తపాంసి; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ద్వి.ఏ 12. చరితుమ్ – అవ్యయము 13. ప్రచక్రమే – క్రియ –లిట్ – ప్ర.ఏ. కర్మణి 14. స్వశరీరమార్దవమ్ – ...మార్దవమ్, ...మార్దవే, ...మార్దవాని అకారాన్త నపుంసకలింగ...మార్దవశబ్దము. ద్వి.ఏ

**సమాసాలు:–**

1. పూర్వతపఃసమాధినా – తపసః సమాధిః (ష.త.) తపస్సమాధిః, పూర్వశ్చ అసౌ తపస్సమాధిః (కర్మధా.) పూర్వతపస్సమాధిః, తేన।
2. స్వశరీరమార్దవమ్ – స్వస్య శరీరమ్ (ష.త.) స్వశరీరమ్, స్వశరీరస్య మార్దవమ్ (ష.త.) స్వశరీరమార్దవమ్।
3. అనపేక్ష్య – న అపేక్ష్య (నఞ్‌తత్పు.)

**సంధులు :–**

1. తదా + అనపేక్ష్య – తదానపేక్ష్య – సవర్ణదీర్ఘసన్ధిః।
2. తపః + మహత్ – తపో మహత్ – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. మార్దవమ్** :– ఎ) మృదోర్భావః అణ్।
బి) శ్లో॥ అహింసా సత్యమక్రోధః త్యాగః శాన్తిరపైశునమ్।
దయా భూతేష్వలోలుప్త్వం **మార్దవం** హ్రీరచాపలమ్ ॥ 16–2

శ్రీకృష్ణభగవానుడు – భగవద్గీత – 16వ అధ్యాయమున దైవీ సంపదగల వాని లక్షణములను మొదటి నాలుగుశ్లోకములలో చెప్పినాడు. అందు 'మార్దవమ్' అనగా ఇతరులయెడ సున్నితముగా ప్రవర్తించుట. Becomes soft.

సి) శ్లో॥ విలలాప స బాష్పగద్గదం
సహజామప్యపహాయ ధీరతామ్
అభితప్తమయోఽపి **మార్దవం**
భజతే కైవ కథా శరీరిషు॥ ర.వం. 8-43

"బాగుగా అగ్నియందు కాల్చబడిన ఇనుము, అచేతనపదార్థమైనను, మృదుత్వమును పొందును అన్నచో..." (అజవిలాపము)

**క్రియాదర్శము :- 1. అమంస్త** – మను– జ్ఞానే (తెలియుట), సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, దివాదిప్రకరణమ్(4) లుఙ్, ప్రథమపురుషైకవచనాంతః॥

**రూపాలు :- అమంస్త** – అమంసాతామ్ – అమంసత.

శ్లో॥ తయా స్రజా మంగళపుష్పమయ్యా
విశాలవక్షఃస్థలలంబయా సః।
**అమంస్త** కణ్ఠార్పితబాహుపాశాం
విదర్భరాజావరజాం వరేణ్యః॥

– ర.వం. 6-84

**2. ప్రచక్రమే** – ప్ర –ఉపసర్గ, క్రము (క్రమ్) పాదవిక్షేపే, (నడుచుట) సకర్మకమ్ సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1)లిట్, ప్రథమపురుషైకవచనాంతః। **కర్మణి।**

**రూపాలు :- ప్రచక్రమే** – ప్రచక్రమాతే – ప్రచక్రమిరే.

వా భ్రాశభ్లాశ – (సూ. 3-1-70) అను సూత్రముచే 'శ్యన్' చెప్పబడినది. క్రమ్+య (శ్యన్)+ తి। క్రమః పరస్మైపదేషు (సూ. 7-3-76) అను సూత్రముచే 'క్రమ్'లోని అకారమునకు దీర్ఘము. క్రామ్ + య + తి – క్రామ్యతి। లట్ – ప్రథమపురుషైకవచనాంతః॥

శ్లో॥ సఞ్చారపూతాని దిగన్తరాణి
కృత్వా దినాన్తే నిలయాయ గన్తుమ్।
**ప్రచక్రమే** పల్లవరాగతామ్రా
ప్రభా పతఙ్గస్య మునేశ్చ ధేనుః॥

– ర.వం. 2-15

---



**శ్లో॥ క్లమం యయౌ కన్దుకలీలయాపి యా**
**తయా మునీనాం చరితం వ్యగాహ్యత।**
**ధ్రువం వపుః కాఞ్చనపద్మనిర్మితం**
**మృదు ప్రకృత్యా చ ససారమేవ చ॥ 19**

**పదవిభాగము :-** క్లమమ్, యయౌ, కన్దుకలీలయా, అపి, యా, తయా, మునీనామ్, చరితమ్, వ్యగాహ్యత, ధ్రువమ్, వపుః, కాఞ్చనపద్మనిర్మితమ్, మృదు, ప్రకృత్యా, చ, ససారమ్, ఏవ, చ।

**అన్వయక్రమము :-** యా కన్దుకలీలయా అపి క్లమం యయౌ తయా మునీనాం చరితం వ్యగాహ్యత। ధ్రువమ్ (అస్యాః) వపుః కాఞ్చనపద్మనిర్మితమ్, ప్రకృత్యా మృదు చ ససారమ్ ఏవ చ।

**ప్రతిపదార్థము :-** యా – ఏ పార్వతీదేవి, కన్దుకలీలయా + అపి – బంతియాట చేతనూ, క్లమమ్ యయౌ –అలసినదాయెనో, తయా – ఆమెచేత, మునీనామ్ – మునులయొక్క, చరితమ్ – ఆచరణము(తీవ్రతపము), వ్యగాహ్యత – ప్రవేశింపబడెను, ధ్రువమ్ – నిశ్చయము, (అస్యాః = ఈమెయొక్క) వపుః – శరీరము, కాఞ్చనపద్మనిర్మితమ్ – బంగారు కమలముచే చేయబడినది, ప్రకృత్యా – స్వభావముచే, మృదు చ – సుకుమారమైనది అయ్యును, ససారమ్ ఏవ చ – కఠినమైనదే.



**తాత్పర్యము :-** ఏ పార్వతీదేవి బంతియాటచేతను అలసినదాయెనో, ఆమెచేత మునులయొక్క ఆచరణము ప్రవేశింపబడెను. నిశ్చయము. ఈమెయొక్క శరీరము బంగారు కమలముచే చేయబడినది. స్వభావముచే సుకుమారమైనది అయ్యును కఠినమైనదే.

**పాఠాన్తరాలు :-** 1. పద్మనిర్మితమ్ – పద్మధర్మి యత్ 2. చ – హి 3. లీలయా – సేవయా 4. నిర్మితమ్ – సంనిభమ్

**విభక్తులు/క్రియలు :-** 1. యా – **యా**, యే, యాః దకారాన్త స్త్రీలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ 2. కన్దుకలీలయా – **కన్దుకలీలయా,** కన్దుకలీలాభ్యామ్, కన్దుకలీలాభిః; ఆకారాన్త స్త్రీలింగ కన్దుకలీలాశబ్దము. తృ.ఏ. 3. అపి, చ, ఏవ – అవ్యయాలు 4. క్లమమ్ – **క్లమమ్,** క్లమౌ, క్లమాన్; అకారాన్త పుంలింగ క్లమశబ్దము. ద్వి.ఏ 5. తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 6. మునీనామ్ – మునేః, మున్యోః, **మునీనామ్;** ఇకారాన్త పుంలింగ మునిశబ్దము. ష.ఏ 7. చరితమ్ – **చరితమ్,** చరితే, చరితాని; అకారాన్త నపుంసకలింగ చరితశబ్దము. ప్ర.ఏ 8. వ్యగాహ్యత – క్రియ

9. ధ్రువమ్ – **ధ్రువమ్**, ధ్రువే, ధ్రువాణి; అకారాన్త నపుంసకలింగ ధ్రువశబ్దము. ప్ర.ఏ 10. వపుః – **వపుః,** వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుశ్శబ్దము. ప్ర.ఏ 11. కాఞ్చనపద్మనిర్మితమ్ – **...నిర్మితమ్,** ...నిర్మితే, ...నిర్మితాని; అకారాన్త నపుంసకలింగ...నిర్మితశబ్దము. ప్ర.ఏ 12. యయౌ – క్రియ – లిట్ – ప్ర.ఏ 13. ప్రకృత్యా – **ప్రకృత్యా,** ప్రకృతిభ్యామ్, ప్రకృతిభిః; ;ఇకారాన్త స్త్రీలింగ ప్రకృతిశబ్దము. తృ.ఏ 14. మృదు – మృదు, మృదునీ, మృదూని; ఉకారాన్త నపుంసకలింగ 'మృదు'శబ్దము. ప్ర.ఏ 15. ససారమ్ – ససారమ్, ససారే, ససారాణి; అకారాన్త నపుంసకలింగ ససారశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు :–**

1. కన్దుకలీలయా – కన్దుకస్య లీలా (ష.త.) కన్దుకలీలా, తయా।
2. కాంచనపద్మనిర్మితమ్ – కాంచనం చ తత్పద్మం (కర్మధా.) కాంచనపద్మమ్, కాంచనపద్మేన నిర్మితమ్ (తృ.త.) కాంచనపద్మనిర్మితమ్।
3. ససారమ్ – సారేణ సహ వర్తతే ఇతి (బహువ్రీహి) తత్।

**సంధులు :–**

1. కన్దుకలీలయా + అపి – కన్దుకలీలయాపి – సవర్ణదీర్ఘసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. క్లమః :–** క్లమథః – క్లమథుః (పుం.) – ఆయాసః

ఎ) క్లమ్+ 'శమాదిభ్యోఽథచ్' ఇతి అథచ్

బి) 'బాహులకాదథుచ్ అట్విత్త్వాత్' ఇతి అథుచ్

సి) '...గ్లానిశ్చ క్లమథుః స్మృతః' ॥ 601 అని హలాయుధకోశము

డి) శ్లో॥ దదద్భిరభితస్తటౌ వికచవారిజామ్బు నదై–
ర్వినోదితదిన**క్లమాః** కృతరుచశ్చ జామ్బూనదైః।
నిషేవ్య మధుమాధవాః సరసమత్ర కాదమ్బరం
హరన్తి రతయే రహః ప్రియతమాఙ్కకాదమ్బరమ్॥

– ఇతి మాఘమహాకావ్యే 4–66

ఇ) శ్లో॥ మధ్యందినేఽర్ధరాత్రే వా విశ్రాన్తో **విగతక్లమః।**
చిన్తయేత్ ధర్మకామార్థాన్ సార్ధం తైరేక ఏవ వా॥

– మనుస్మృతి 7–15

మిట్టమధ్యాహ్నమునగాని, అర్ధరాత్రిగాని, మనోవిచారములేక **యలసట** దీర్చికొని మంత్రులతో గాని యొంటరియైగాని ధర్మార్థకామములను గూర్చి యాలోచింప వలయును.



ఎఫ్) శ్లో॥ కిం శీతలైః **క్లమ** వినోదిభిరార్ద్రవాతాన్
సంచాలయామి నలినీదళతాలవృన్తైః।
అంకే నిధాయ కరభోరు! యథాసుఖం తే
సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ॥

– అభిజ్ఞానశాకున్తలే 3–71

"ఓ కాంతామణీ! నీ శ్రమ శాంతించునటుల పద్మదళతాళవృంతములతో చల్లని వాయువులు సోకునటుల, మెల్లమెల్లగా వీతునా?..."

**అలంకారము :–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

''సువర్ణోత్పాదకత్వాత్పార్వత్యాః శరీరస్య సుకుమారస్యాపి తీవ్రతపః సమర్థత్వమస్తీత్యుత్ప్రేక్షార్థః''

పార్వతీదేవిశరీరము బంగారుపద్మములతో నిర్మించబడినట్లు వర్ణింపబడుట సహజసుకుమారమయ్యును తీవ్రతపమాచరించుటకు ధృఢమయ్యెనని చెప్పబడుటచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారమున్నదని చెప్పదగును.

**క్రియాదర్శము :–**

**1. వ్యగాహ్యత** – వి – ఉపసర్గ, 'గాహూ – విలోడనే' కర్మణి లఙ్. ప్రథమపురుషైకవచనాంతః, భ్వాదిప్రకరణమ్(1) ఆత్మనేపదీ, సకర్మకమ్, వేట్.

**రూపాలు :–** వ్యగాహ్యత – వ్యగాహ్యేతామ్ – వ్యగాహ్యన్త

---

**అవతారికా :–** గ్రీష్మే తపశ్చర్యా। గ్రీష్మఋతువున చేసిన తపస్సు.

**శ్లో॥ శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా।
విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా–
మనన్యదృష్టిస్సవితారమైక్షత॥ 20**

**పదవిభాగము :–** శుచౌ, చతుర్ణామ్, జ్వలతామ్, హవిర్భుజామ్, శుచిస్మితా, మధ్యగతా, సుమధ్యమా, విజిత్య, నేత్రప్రతిఘాతినీమ్, ప్రభామ్, అనన్యదృష్టిః, సవితారమ్, ఐక్షత।

**అన్వయక్రమము :–** శుచౌ శుచిస్మితా సుమధ్యమా జ్వలతాం చతుర్ణాం హవిర్భుజాం మధ్యగతా నేత్రప్రతిఘాతినీం ప్రభాం విజిత్య అనన్యదృష్టిః సవితారమ్ ఐక్షత।

**ప్రతిపదార్థము :–** శుచౌ – వేసవియందు, శుచిస్మితా – విశదమైన మందహాసము గలదియు, సుమధ్యమా – చక్కని నడుముగలదియు నైన యా పార్వతీదేవి, జ్వలతామ్ – ప్రజ్వలించుచున్న, చతుర్ణామ్ – నాలుగు అగు, హవిర్భుజామ్ – అగ్నులకు, మధ్యగతా – నడుమనున్నదై, నేత్రప్రతిఘాతినీమ్ – కన్నులు మిరుమిట్లు గొలుపు, ప్రభామ్ – సూర్యతేజస్సును, విజిత్య – ఓర్చి, అనన్యదృష్టిః – తదేక దృష్టికలదై, సవితారమ్ – సూర్యుని, ఐక్షత – చూచెను.

**తాత్పర్యము :–** వేసవియందు విశదమైన మందహాసముగలదియు, చక్కని నడుముగలదియునగు ఆ పార్వతీదేవి ప్రజ్వలించుచున్న నాలుగు అగ్నులకు నడుమనున్నదై కన్నులు మిరుమిట్లు గొలుపు సూర్యతేజస్సును ఓర్చి తదేకదృష్టి కలదై సూర్యుని చూచెను.

**విభక్తులు/క్రియలు :–** 1. శుచౌ – శుచ్యోః, శుచిషు; ఇకారాన్త పుంలింగ శుచిశబ్దము. స.ఏ 2. శుచిస్మితా – **శుచిస్మితా**, శుచిస్మితే, శుచిస్మితాః; ఆకారాన్త స్త్రీలింగ శుచిస్మితాశబ్దము. ప్ర.ఏ 3. సుమధ్యమా – **సుమధ్యమా,** సుమధ్యమే, సుమధ్యమాః; ఆకారాన్త స్త్రీలింగ సుమధ్యమాశబ్దము. ప్ర.ఏ 4. మధ్యగతా– మధ్యగతా, మధ్యగతే, మధ్యగతాః ;ఆకారాన్త స్త్రీలింగ మధ్యగతాశబ్దము. ప్ర.ఏ 5. జ్వలతామ్ –జ్వలతః, జ్వలతోః **జ్వలతామ్;** తకారాన్త పుంలింగ జ్వలత్‌శబ్దము. ష.బ 6. చతుర్ణామ్ – రేఫాన్తః పుంలింగో నిత్యం బహువచనాంతః 'చతుర్'శబ్దః. ష.బ 7. హవిర్భుజామ్ – హవిర్భుజః హవిర్భుజోః, హవిర్భుజామ్; జకారాన్త పుంలింగ హవిర్భుక్ఛబ్దము. ష.బ 8. నేత్రప్రతిఘాతినీమ్ – ...ఘాతినీమ్, ...ఘాతిన్యౌ, ...ఘాతినీః; ఈకారాన్త స్త్రీలింగ...ఘాతినీశబ్దము. ద్వి.ఏ. 9. ప్రభామ్ – ప్రభామ్, ప్రభే, ప్రభాః; ఆకారాన్త స్త్రీలింగ ప్రభాశబ్దము. ద్వి.ఏ 10. విజిత్య – అవ్యయము – ల్యబన్తము 11. అనన్యదృష్టిః – అనన్యదృష్టిః, అనన్యదృష్టీ, అనన్యదృష్టయః; ఇకారాన్త స్త్రీలింగ అనన్యదృష్టిశబ్దము. ప్ర.ఏ 12. సవితారమ్ – **సవితారమ్,** సవితారౌ, సవితౄన్ ; ఋకారాన్త పుంలింగ సవితృశబ్దము. ద్వి.ఏ 13. ఐక్షత – క్రియ

**సమాసాలు :–**

1. శుచిస్మితా – శుచి స్మితం యస్యాః (బహువ్రీహి) సా।
2. సుమధ్యమా – శోభనం మధ్యమం యస్యాః (బహువ్రీహి) సా।
3. మధ్యగతా – మధ్యం గతా (ద్వి.త) మధ్యగతా।
4. నేత్రప్రతిఘాతినీమ్ – నేత్రే ప్రతిహన్తి (ఉపపదతత్పు.) ఇతి తచ్ఛీలా, తామ్।
5. అనన్యదృష్టిః – అవిద్యమానా అన్యత్ర దృష్టిః యస్యాః (బహువ్రీహి) సా।



**సంధులు :–**

1. అనన్యదృష్టిః + సవితారమ్ – అనన్యదృష్టిస్సవితారమ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సవితా**(ఋ) (పుం.) :– ఏ) సూతే లోకాదీనితి । సూ + తృచ్।

బి) శ్లో॥ ఆదిత్యః సవితా సహస్రకిరణః ప్రద్యోతనో భాస్కరః
తిగ్మాంశుస్తరణిస్తథా దినమణిర్భాస్వాన్వివస్వాన్హరిః।
మార్తణ్డస్తపనో వికర్తన ఇనః పూషా పతఙ్గో భగః
సూర్యో గోపతిరర్యమా దినకరః సూరోఽంశుమాలీ రవిః ॥35

శ్లో॥ మిహిరో విరోచనోఽర్కస్తిమిరరిపుర్ద్యుమణిరంశుమానంశుః।
హరిదశ్వః సప్తాశ్వః ప్రభాకరో భానుమాన్భానుః ॥36

శ్లో॥ బ్రధ్నో హంసః ఖగో మిత్రశ్చిత్రభానురహర్పతిః।
కర్మసాక్షీ జగచ్చక్షుర్ద్వాదశాత్మా త్రయీతనుః ॥ 37

–అని హలాయుధకోశము '47' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ధీశబ్దవాచ్యం బ్రహ్మాణం ప్రచోదయితి సర్వదా।
సృష్ట్యర్థం భగవాన్ విష్ణుః **సవితా** స తు కీర్తితః॥

శ్లో॥ సర్వలోకప్రసవనాత్ **సవితా** స తు కీర్త్యతే।
యతస్తద్దేవతా దేవీ సావిత్రీత్యుచ్యతే తతః॥

– ఇతి వహ్నిపురాణే (హలాయుధకోశవ్యాఖ్యనుండి)

డి) శ్లో॥ స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ।
దినాన్తే నిహితం తేజః **సవిత్రేవ** హుతాశనః॥

– ఇతి రఘువంశమహాకావ్యే చతుర్థసర్గః।

'సాయంసమయమున సూర్యునిచేత ఉంచబడిన తేజస్సును పొంది అగ్నిహోత్రుడువలె ఆ రఘుమహారాజు మిక్కిలి ప్రకాశించెను.

**క్రియాదర్శము :– ఐక్షత :–** "ఈక్ష (ఈక్ష్) – దర్శనే" (దర్శించుట), సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్, లఙ్, ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :– ఐక్షత** – ఐక్షేతామ్ – ఐక్షన్త

–––

శ్లో॥ తథాఽతితప్తం సవితుర్గభస్తిభి-
ర్ముఖం తదీయం కమలశ్రియం దధౌ।
అపాఙ్గయోః కేవలమస్య దీర్ఘయో-
శ్శనైః శనైశ్శ్యామికయా కృతం పదమ్॥ **21**

**పదవిభాగము :–** తథా, అతితప్తమ్, సవితుః, గభస్తిభిః, ముఖమ్, తదీయమ్, కమలశ్రియమ్, దధౌ, అపాఙ్గయోః, కేవలమ్, అస్య, దీర్ఘయోః, శనైః, శ్యామికయా, కృతమ్, పదమ్।

**అన్వయక్రమము :–** సవితుః గభస్తిభిః తథా అతితప్తం తదీయం ముఖం కమల శ్రియం దధౌ, అస్య దీర్ఘయోః అపాంగయోః కేవలం శనైః శనైః, శ్యామికయా పదం కృతమ్।

**ప్రతిపదార్థము :–** సవితుః – సూర్యునియొక్క, గభస్తిభిః – కిరణములచేత, తథా – అవ్విధముగ, అతితప్తమ్ – మిక్కిలి తపింప చేయబడిన, తదీయమ్ – ఆ పార్వతీదేవిదగు, ముఖమ్ – ముఖము, కమలశ్రియమ్ – తామరపూవుసొబగును, దధౌ – ధరించెను, అస్య – ఈ మోముయొక్క, దీర్ఘయోః – విశాలములైన, అపాంగయోః కేవలమ్ – కనుకొనలందు మాత్రము, శనైః శనైః – మెల్లమెల్లగా, శ్యామికయా – నల్లదనముచేత, పదమ్ – స్థానము, కృతమ్ – చేయబడెను.

**తాత్పర్యము :–** అవ్విధముగ సూర్యకిరణములచేత మిక్కిలి తపింపబడిన ఆ పార్వతీదేవిముఖము తామరపూవుసొబగును ధరించెను. ఈ మోముయొక్క విశాలములైన కనుకొనలయందు మాత్రము మెల్లమెల్లగా నల్లదనముచేత స్థానము చేయబడెను.

**పాఠాన్తరాలు :–** 1. తథాతితప్తమ్ – తథాభితప్తమ్; తథాపి తప్తమ్.

**విభక్తులు/క్రియలు :–** 1. సవితుః – **సవితుః,** సవిత్రోః సవితౄణామ్; ఋకారాన్త పుంలింగ సవితృశబ్దము. ష.ఏ. 2. గభస్తిభిః – గభస్తినా, గభస్తిభ్యామ్, **గభస్తిభిః;** ఇకారాన్త పుంలింగ గభస్తిశబ్దము. తృ.బ. 3. అతితప్తమ్ – **అతితప్తమ్,** అతితప్తే, అతితప్తాని; అకారాన్త నపుంసకలింగ అతితప్తశబ్దము. ప్ర.ఏ. 4. తదీయమ్ – **తదీయమ్,** తదీయే, తదీయాని; అకారాన్త నపుంసకలింగ తదీయశబ్దము. ప్ర.ఏ. 5. ముఖమ్ – ముఖమ్, ముఖే, ముఖాని; అకారాన్త నపుంసకలింగ ముఖశబ్దము. ప్ర.ఏ. 6. కమలశ్రియమ్ – **కమలశ్రియమ్,** కమలశ్రియౌ, కమలశ్రియః, ఈకారాన్త స్త్రీలింగకమలశ్రీశబ్దము. ద్వి.ఏ. 7. దధౌ – క్రియ –లిట్ 8. అస్య – **అస్య,** అనయోః, ఏషామ్; మకారాన్త పుంలింగ 'ఇదమ్'శబ్దము. ష.ఏ. 9. దీర్ఘయోః – దీర్ఘస్య, **దీర్ఘయోః,** దీర్ఘాణామ్; అకారాన్త పుంలింగ దీర్ఘశబ్దము. ష.ద్వి. 10. అపాంగయోః – అపాంగస్య, **అపాంగయోః,** అపాంగానామ్; అకారాన్త పుంలింగ అపాంగశబ్దము. ష.ద్వి. 12. తథా, శనైః – అవ్యయాలు 13. కేవలమ్ – అవ్యయము 14. శ్యామికయా – **శ్యామికయా,** శ్యామికాభ్యామ్, శ్యామికాభిః; ఆకారాన్త స్త్రీలింగశ్యామికాశబ్దము. తృ.ఏ. 15. పదమ్ – **పదమ్,** పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ప్ర.ఏ 16. కృతమ్ – **కృతమ్,** కృతే, కృతాని; అకారాన్త నపుంసకలింగ కృతశబ్దము. ప్ర.ఏ.



**సమాసాలు :–**

1. కమలశ్రియమ్ – కమలస్య శ్రీః (ష.త.) తామ్।
2. అతితప్తమ్ – అత్యన్తమ్ తప్తమ్ (సుప్సుపా.)।

**సంధులు :–**

1. తథా + అతితప్తమ్ – తథాతితప్తమ్।
2. సవితుః + గభస్తిభిః – సవితుర్గభస్తిభిః – విసర్గసన్ధిః (రేఫాదేశః)।
3. దీర్ఘయోః + శనైః – దీర్ఘయోశ్శనైః – శ్చుత్వసన్ధిః।
4. శనైః + శ్యామికయా – శనైశ్శ్యామికయా – శ్చుత్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కేవలమ్ – అవ్యయకోశే (315)**

ఎ) ఏకమాత్రే, అద్వితీయేఽ సహాయే చార్థేఽ స్య స్వరాదిత్వం తిలకప్రభృతయోఽజ్ఞీ కుర్వన్తి। శబ్దకల్పద్రుమాదిషు తు త్రిలిఙ్గోఽ యం విశేష్యనిఘ్నత్వేన పఠితః।

బి) శ్లో॥ **కేవలం** స్మరణేనైవ పునాసి పురుషం యతః।
అనేన వృత్తయశ్శేషా నివేదిత ఫలాస్త్వయి॥ ర.వం. 10 – 29

"నీ స్మరణమాత్రముననే మానవుడు సంపూర్ణముగ పవిత్రుడగుచున్నాడు" అన్నప్పుడు, నీ దర్శన స్పర్శనాదులచే పొందు ఫలములు ఇంతటివి అని నిశ్చయింపజాలము గదా".

సి) "కేవలమిదమేవ పృచ్ఛామి" – అని కాదంబరి

డి) శ్లో॥ బలమార్తభయోపశాన్తయే
విదుషాం సత్కృతయే బహుశ్రుతమ్।
వసు తస్య విభోర్న **కేవలం**
గుణవత్తాపి పరప్రయోజనా॥

– ర.వం. 8–31

**క్రియాదర్శము :- 1. దధౌ :-** డుధాఞ్(ధా) ధారణపోషణయోః (ధరించుట, పోషించుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ. లిట్, ప్రథమపురుషైక వచనాంతః।

**రూపాలు :- దధౌ** – దధతుః – దధుః,
దధిథ – దధతుః – దధ
**దధౌ** – దధివ – దధిమ

---

**శ్లో॥ అయాచితోపస్థితమమ్బు కేవలం**
**రసాత్మకస్యోడుపతేశ్చ రశ్మయః।**
**బభూవ తస్యాః కిల పారణావిధి-**
**ర్న వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః॥ 22**

**పదవిభాగము :-** అయాచితోపస్థితమ్, అమ్బు, కేవలమ్, రసాత్మకస్య, ఉడుపతేః చ, రశ్మయః, బభూవ, తస్యాః, కిల, పారణావిధిః, న, వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః।

**అన్వయక్రమము :-** అయాచితోపస్థితం కేవలమ్ అమ్బు,రసాత్మకస్య ఉడుపతేః రశ్మయః చ, తస్యాః పారణావిధిః బభూవ కిల। వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః న బభూవ।

**ప్రతిపదార్థము :-** అయాచితోపస్థితమ్ – కోరకయే లభించిన, కేవలమ్ అమ్బు – నీరు మాత్రమును, రసాత్మకస్య – అమృతమయుడగు, ఉడుపతేః – చంద్రునియొక్క రశ్మయః + చ – కిరణములును, తస్యాః – ఆ పార్వతీదేవియొక్క, పారణావిధిః – భోజనవిధానము, బభూవ కిల – అయ్యెనుగదా! వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః – వృక్షములకేది జీవనోపాయమో దానికంటె వేరగు ఉపాయము, న బభూవ – కాలేదు.

**తాత్పర్యము :-** కోరకయే లభించిన నీరు మాత్రమును, అమృతమయుడగు చంద్రకిరణములును ఆ పార్వతీదేవియొక్క భోజనవిధానము అయ్యెనుగదా। వృక్షములకేది జీవనోపాయమో దానికంటె వేఱగు ఉపాయము కాలేదు.

**పాఠాన్తరాలు :-** 1. కిల – ఖలు;
2. సాధనః – సాధనమ్;
3. వృక్షవృత్తి.. – వృక్షవృతిః..





**విభక్తులు/క్రియలు :-** 1. అయాచితోపస్థితమ్ – **స్థితమ్,** ...స్థితే, ...స్థితాని; అకారాన్త నపుంసకలింగ...స్థితశబ్దము. ద్వి.ఏ 2. కేవలమ్, చ, కిల, న – అవ్యయాలు 3. అమ్బు – **అమ్బు,** అమ్బునీ, అమ్బూని; ఉకారాన్త నపుంసకలింగ అమ్బుశబ్దము. ద్వి.ఏ. 4. రసాత్మకస్య – రసాత్మ కస్య, రసాత్మకయోః, రసాత్మకానామ్; అకారాన్త పుంలింగ రసాత్మకశబ్దము. ష.ఏ. 5 ఉడుపతే – **ఉడుపతేః,** ఉడుపత్యోః, ఉడుపతీనామ్; ఇకారాన్త పుంలింగ ఉడుపతిశబ్దము. ష.ఏ. 6. తస్యాః – **తస్యాః,** తయోః, తాసామ్; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ష.ఏ. 7. రశ్మయః – రశ్మిః, రశ్మీ, **రశ్మయః ;** ఇకారాన్త పుంలింగ రశ్మిశబ్దము. ప్ర.ఏ 8. పారణావిధిః – **పారణావిధిః,** పారణావిధీ, పారణావిధయః; ఇకారాన్త పుంలింగ పారణావిధిశబ్దము. ప్ర.ఏ. 9. బభూవ – క్రియ, 10. వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః – **సాధనః,** ...సాధనౌ, ... సాధనాః; అకారాన్త పుంలింగ...సాధనశబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:-**

1. అయాచితోపస్థితమ్ – న యాచితమ్ (నఞ్తత్పురుష) అయాచితమ్ అయాచితం చ తత్ ఉపస్థితమ్ (కర్మధా.) అయాచితోపస్థితమ్।
2. ఉడుపతేః – ఉడూనాం పతిః (ష.త.) ఉడుపతిః, తస్య।
3. పారణావిధిః – పారణాయాః విధిః (ష.త.) పారణావిధిః।
4. వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః – వృక్షాణాం వృత్తిః (ష.త.) వృక్షవృత్తిః, విశేషేణ అతిరిక్తమ్ (సుప్సుపా) వ్యతిరిక్తమ్, వృక్షవృత్తేః వ్యతిరిక్తం (ష.త.) సాధనం యస్య (బహువ్రీహి) సః।

**సంధులు:-**

1. రస్మాతకస్య + ఉడుపతేః – రసాత్మకస్యోడుపతేః – గుణసన్ధిః। ఆద్గుణః (సూ. 6-1-84) అవర్ణమునకు (అ,ఆలకు) హ్రస్వదీర్ఘములైన ఇ, ఉ, ఋ, వర్ణములు పరముగా నున్నపుడు పూర్వపరముల స్థానములో గుణము ఏకాదేశమగును. ఇచట గుణములు క్రమముగా ఏ, ఓ, అర్, అల్ అనునవి ఆదేశములగునని తాత్పర్యము.
2. ఉడుపతేః + చ – ఉడుపతేశ్చ – శ్చుత్వసన్ధిః।
3. పారణవిధిః + న – పారణావిధిర్న – విసర్గసన్ధిః (రేఫాదేశః)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:-**

**1. రశ్మిః – (పుం.)** ఎ) అశ్నుతే వ్యాప్నోతీతి।
అశూ వ్యాప్తౌ + 'అశ్నోతేరశ్చ' ఇతి మి, ధాతోరశాదేశశ్చ। (ఉణాది 4-46)
బి) శ్లో॥ రోచిః శోచిరంశుః ప్రద్యోతగభస్తిరశ్మిఘృణికిరణాః।
రుచిరుగ్దీధితిదీప్తిద్యుతిప్రభాభావిభాభానుః॥ 38

శ్లో॥ ఉస్రధామవసుకేతుమరీచిప్రగ్రహోపధృతివృష్ణిమయూఖాః।
అంశుభానుకరపాదవిరోకా గావ ఇత్యభిహితాస్తు సమానాః ॥ 39

అని హలాయుధకోశము '32' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ మక్షికా విప్రుషశ్ఛాయా గౌరశ్వస్సూర్యరశ్మయః।
రజో భూర్వాయురగ్నిశ్చ స్పర్శే మేధ్యా వినిర్దిశేత్॥

అమేధ్యము దాకెడివైనను ఈగలును, నోటితుంపురులును, తాకరానిదాని నీడయు, గోవు, గుఱ్ఱము, సూర్యకిరణములు, దుమ్ము, భూమి, గాలి, అగ్ని వీనిని తాకినను పరిశుద్ధములని యెఱుగవలయును. -మనుస్మృతి 5-134

డి) శ్లో॥ త్రిస్రోతసం వహతి యో గగనప్రతిష్ఠాం
జ్యోతీంషి వర్తయతి చ ప్రవిభక్తరశ్మి।
తస్య ద్వితీయహరివిక్రమనిస్తమస్కం
వాయోరిమం పరివహస్య వదన్తి మార్గమ్॥

– అభిజ్ఞానశాకున్తలమ్ 7-6

"ఇది **పరివహ** మనుపేరగల వాయుమార్గము. ఇది నక్షత్రముల కాంతులను సర్వదిక్కులకు ప్రసరింపజేయునట్టిది, మన్దాకిని ప్రవాహము కల్గినట్టిది, త్రివిక్రమస్వామి రెండవ పాదముచే చీకటిలేనిదానినిగా చేయబడిన వాయు మార్గమునుగా వర్ణింతురు".

**క్రియాదర్శము:–** **బభూవ** – పూర్వము చెప్పబడినది.

---

**అవతారికా:–** వర్షాయాం తపశ్చర్యా। వర్షఋతువున (పార్వతీదేవి) చేసిన తపస్సు.

**శ్లో॥ నికామతప్తా వివిధేన వహ్నినా**
**నభశ్చరేణేన్ధనసమ్భృతేన సా।**
**తపాత్యయే వారిభిరుక్షితా నవై-**
**ర్భువా సహోష్మాణమముఞ్చదూర్ధ్వగమ్॥ 23**

**పదవిభాగము:–** నికామతప్తా, వివిధేన, వహ్నినా, నభశ్చరేణ, ఇన్ధనసమ్భృతేన, సా, తపాత్యయే, వారిభిః, ఉక్షితా, నవైః, భువా, సహ, ఊష్మాణమ్, అముఞ్చత్, ఊర్ధ్వగమ్।





**అన్వయక్రమము:–** వివిధేన నభశ్చరేణ ఇన్ధనసమ్భృతేన వహ్నినా నికామతప్తా సా తపాత్యయే నవైః వారిభిః ఉక్షితా భువా సహ ఊర్ధ్వగమ్ ఊష్మాణమ్ అముఞ్చత్।

**ప్రతిపదార్థము :–** వివిధేన – బహువిధమగునట్టియు, నభశ్చరేణ – ఆకాశమున సంచరించునట్టియు, ఇనన్ధసమ్భృతేన – కఱ్ఱలచే ప్రజ్వలింపజేయబడినట్టిదియు అగు, వహ్నినా – అగ్నిచే, నికామతప్తా – మిక్కిలి తపింపజేయబడినదైన, సా – ఆ పార్వతీదేవి, తపాత్యయే – వేసవియొక్క అంతమునందు, నవైః – క్రొత్త, వారిభిః – నీరులచేత, ఉక్షితా – తడుపబడినదై, భువా – భూమితో, సహ – పాటు, ఊర్ధ్వగమ్ – పైకిపోయెడి, ఊష్మాణమ్ – ఆవిరిని, అముఞ్చత్ – విడచెను.

**తాత్పర్యము:–** బహువిధమగునట్టియు, ఆకాశమున సంచరించునట్టియు, కఱ్ఱలచే ప్రజ్వలింపజేయబడినట్టిదియు అగు అగ్నిచే మిక్కిలి తపింపజేయుబడినదైన ఆ పార్వతీదేవి వేసవియొక్క అంతమునందు క్రొత్తనీరులచేత (తొలకరి జల్లులచేత) తడుపబడినదై, భూమితోపాటు పైకి పోయెడి ఆవిరిని విడచెను.

**పాఠాన్తరాలు:–** 1. వివిధేన – ద్వివిధేన 2. సా – చ

**విభక్తులు/క్రియలు:–** 1. వివిధేన – **వివిధేన,** వివిధాభ్యామ్, వివిధైః; అకారాన్త పుంలింగ వివిధశబ్దము. తృ.ఏ. 2. నభశ్చరేణ – **నభశ్చరేణ,** నభశ్చరాభ్యామ్, నభశ్చరైః; అకారాన్త పుంలింగ నభశ్చరశబ్దము. తృ.ఏ. 3. ఇన్ధనసమ్భృతేన – ...**సమ్భృతేన,** ...సంభృతాభ్యామ్, ...సంభృతైః; అకారాన్త పుంలింగ ...సంభృతశబ్దము. తృ.ఏ 4. వహ్నినా – **వహ్నినా,** వహ్నిభ్యామ్, వహ్నిభిః; ఇకారాన్త పుంలింగ వహ్నిశబ్దము. తృ.ఏ. 5. నికామతప్తా – **నికామతప్తా,** నికామతప్తే, నికామతప్తాః; ఆకారాన్త స్త్రీలింగ నికామతప్తాశబ్దము. ప్ర.ఏ 6. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ. 7. నవైః – నవేన, నవాభ్యామ్, **నవైః**; అకారాన్త నపుంసకలింగ నవశబ్దము. తృ.బ. 8. వారిభిః – వారిణా, వారిభ్యామ్, **వారిభిః**; అకారాన్త నపుంసకలింగవారిశబ్దము. తృ.బ. 9. తపాత్యయే – **తపాత్యయే,** తపాత్యయయోః, తపాత్యయేషు; అకారాన్త పుంలింగ తపాత్యయశబ్దము.స.ఏ 10. ఉక్షితా – **ఉక్షితా,** ఉక్షితే, ఉక్షితాః; ఆకారాన్త స్త్రీలింగ ఉక్షితాశబ్దము. ప్ర.ఏ 11. భువా – **భువా,** భూభ్యామ్, భూభిః; ఊకారాన్త స్త్రీలింగ భూశబ్దము. తృ.ఏ. 12. సహ – అవ్యయము 13. ఊష్మాణమ్ – **ఊష్మాణమ్,** ఊష్మాణౌ, ఊష్మణః; నకారాన్త పుంలింగ ఊష్మన్‌శబ్దము. ద్వి.ఏ 14. అముఞ్చత్ – క్రియ 15. ఊర్ధ్వగమ్ – **ఊర్ధ్వగమ్,** ఊర్ధ్వగే, ఊర్ధ్వగాని; అకారాన్త పుంలింగ ఊర్ధ్వగశబ్దము. ద్వి.ఏ

**సమాసాలు:–**

1. వివిధేన – వివిధా విధా యస్య (బహువ్రీహి) స వివిధః తేన।
2. నభశ్చరేణ – నభసః చరః (ష.త.) నభశ్చరః, తేన।
3. ఇన్ధనసంభృతేన – ఇంధనేన సంభృతః (తృ.త.) తేన।

4. నికామతప్తా – నికామం తప్తా (సుప్సుపా)।

5. తపాత్యయే – తపసః అత్యయః (ష.త.) తపాత్యయః, తస్మిన్।

6. ఊర్ధ్వగమ్ – ఊర్ధ్వం గచ్ఛతి (ఉపపదతత్పు.) ఇతి ఊర్ధ్వగః, తమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. నభః (స్) – (నపుం.)**

ఎ) నహ్యతే మేఘైరితి। ణహ బన్ధనే + నహేర్దివి భశ్చ ఇతి అసున్ భశ్చాన్తాదేశః।
– ఇతి హలాయుధకోశవ్యాఖ్యాయామ్।

బి) నభసః – (పుం. నపుం.)

1. అత్యవిచమితమి – 3.117 ఇతి అసచ్। ణభ హింసాయామ్, భ్వాదిప్రకరణమ్, భ్వాది/ఆత్మనేపదీ/సేట్, దివాది/పరస్మైపదీ/సేట్ + అసుచ్ – ఇతి ఉణాదికోషవ్యాఖ్యాయామ్.

సి) శ్లో॥ **నభో** మరుద్వర్త్మ వియద్విహాయ–
స్తారాపథః పుష్కరమన్తరిక్షమ్।
వ్యోమామ్బరం విష్ణుపదం చ ఖం ద్యౌ–
ర్విహాయసా స్యాద్గగనం తథా ద్యుః॥ 137

–అని హలాయుధకోశము '15' నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ నేక్షతోద్యంతమాదిత్యం నాస్తం యంతం కదాచన।
నోపసృష్టం న వారిస్థం న మధ్యం **నభసో** గతమ్॥ మనుస్మృతి –4–37

ఇ) శ్లో॥ ప్రాతః ప్రయాణాభిముఖాయ తస్మై
సవిస్మయాః కోశగృహే నియుక్తాః।
హిరణ్మయీం కోశగృహస్య మధ్యే
వృష్టిం శశంసుః పతితాం **నభస్తః** ॥ – ర.వం. 5–29

ఎఫ్) శ్లో॥ మృగాః ప్రచణ్డాతపతాపితా భృశం
తృషా మహత్యా పరిశుష్కతాలవః।
వనాన్తరే తోయమితి ప్రధావితా
నిరీక్ష్య భిన్నాఞ్జనసన్నిభం నభః॥ ఋతుసంహారః 1–11

"... అడవి నడుమ బాగుగా నూరినకాటుకతో సమానమైన ఆకాశమును గాంచి..."





**అలంకారాలు:–** అత్ర సహోక్తిరలంకారః। తల్లక్షణం యథా –

"సహోక్తి స్సహభావశ్చేద్భాసతే జనరఞ్జనః" । – ఇతి చంద్రాలోకే – 53

" ఆ పార్వతీదేవి వేసవికాలాంతమునందు తొలకరి జల్లులుచేత తడుపబడినదై భూమి**తోపాటు** పైకి పోయెడి ఆవిరిని విడచెను". సహృదయరంజకముగా సహభావము చెప్పబడిన యెడల అది సహోక్తి యగును।

**క్రియాదర్శము:– అముఞ్చత్** – 'ముచ్ (ముచ్) – మోక్షణే' (విడుచుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్(6), లఙ్, ప్రథమపురుషైకవచనాన్తః

**రూపాలు :– అముఞ్చత్** – అముఞ్చతామ్ – అముఞ్చన్.

(6. ముచ్, 7. విద్, 8. సిచ్ ధాతువులకు శేముచాదీనామ్ (సూ. 7–5–59) అను సూత్రముచే 'నుమ్' (న్) ఆగమము చెప్పబడినది. ముచ్+ అ+ తి – మున్చ్ + అ + తి – ముఞ్చ్ + అ + తి – ముఞ్చతి।)

---

**శ్లో॥ స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః**
**పయోధరోత్సేధనిపాతచూర్ణితాః।**
**వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే**
**చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః॥ 24**

**పదవిభాగము:–** స్థితాః, క్షణమ్, పక్ష్మసు, తాడితాధరాః, పయోధరో... చూర్ణితాః వలీషు, తస్యాః, స్ఖలితాః, ప్రపేదిరే, చిరేణ, నాభిమ్, ప్రథమోదచిన్దవః।

**అన్వయక్రమము:–** ప్రథమోదబిన్దవః తస్యాః పక్ష్మసు క్షణం స్థితాః తాడితాధరాః పయోధరో...చూర్ణితాః వలీషు స్ఖలితాః చిరేణ నాభిం ప్రపేదిరే।

**ప్రతిపదార్థము:–** ప్రథమోదబిన్దవః – తొలకరిజల్లులు, తస్యాః – ఆ పార్వతీదేవి యొక్క, పక్ష్మసు – కనురెప్పలయందు, క్షణమ్ – ఇంచుకసేపు, స్థితాః – నిలిచినవియు, తాడితాధరాః – క్రింది పెదవిని గట్టిగ తాకినవై, పయోధర – ఉత్సేధ – నిపాత – చూర్ణితాః – స్తనోపరిభాగములపై పడుటచేత తుంపురులైనవియు, వలీషు – పొట్టముడుతలయందు, స్ఖలితాః – జారినవియు ఐ, చిరేణ – చాలసేపటికి, నాభిమ్ – బొడ్డును, ప్రపేదిరే – ప్రవేశించినవి.

**తాత్పర్యము :-** తొలకరి జల్లులు ఆ పార్వతీదేవియొక్క కనురెప్పలయందు ఇంచుకసేపు నిలిచినవియు, క్రిందిపెదవిని గట్టిగా తాకినవై, స్తనోపరిభాగములపై పడుటచేత తుంపురులైనవియు, పొట్టముడుతలయందు జారినవియు ఐ చాలసేపటికి బొడ్డును ప్రవేశించినవి.

**పాఠాన్తరాలు:-** 1. ఉత్సేధ - ఉత్సఙ్గ

**విభక్తులు/క్రియలు:-** 1. ప్రథమోదబిన్దవః - ..బిన్దుః, ...బిన్దూ, ...**బిన్దవః**,; ఉకారాన్త పుంలింగ ...బిన్దుశబ్దము. ప్ర.బ. 2. తస్యాః - **తస్యాః**, తయోః, తాసామ్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ష.ఏ 3. క్షణమ్ - **క్షణమ్,** క్షణౌ, క్షణాన్; అకారాన్త పుంలింగ క్షణశబ్దము. ద్వి.ఏ 4. పక్ష్మసు - పక్ష్మణి, పక్ష్మణోః, **పక్ష్మసు;** నకారాన్త నపుంసకలింగ 'పక్ష్మన్'శబ్దము. స.బ. 5. స్థితాః - స్థితః, స్థితౌ, **స్థితాః** ; అకారాన్త పుంలింగ స్థితశబ్దము. ప్ర.బ 6. తాడితాధరాః - తాడితాధరః, తాడితాధరౌ, **తాడితాధరాః** ; అకారాన్త పుంలింగ తాడితాధరశబ్దము. ప్ర.బ7. పయోధర...చూర్ణితాః - ...చూర్ణితః ,...చూర్ణితౌ, **...చూర్ణితాః**; అకారాన్త పుంలింగ...చూర్ణితశబ్దము. ప్ర.బ 8. స్ఖలితాః - స్ఖలితః, స్ఖలితౌ, **స్ఖలితాః** ; అకారాన్త పుంలింగ స్ఖలితశబ్దము. ప్ర.బ 9. వలీషు - వల్యామ్, వల్యోః, **వలీషు;** ఈకారాన్త స్త్రీలింగ వలీశబ్దము. స.బ 10. చిరేణ(అ) - **చిరేణ,** చిరాభ్యామ్, చిరైః; అకారాన్త నపుంసకలింగచిర శబ్దము తృ.ఏ 11. నాభిమ్ - **నాభిమ్,** నాభీ, నాభీః; ఇకారాన్త స్త్రీలింగ నాభిశబ్దము. ద్వి.ఏ., నాభిమ్, నాభీ, నాభీన్; ఇకారాన్త పుంలింగ నాభిశబ్దము. ద్వి.ఏ 12. ప్రపేదిరే- క్రియ-లిట్- ప్ర.బ.

**సమాసాలు:-**

1. ప్రథమోదబిన్దవః - ఉదకస్య బిన్దవః (ష.త.) ఉదబిన్దవః. ప్రథమే చ ఉదబిన్దవః (కర్మధా.) ప్రథమోదబిన్దవః।
2. తాడితాధరాః - తాడితః అధరః యైః (బహువ్రీహి) తే।
3. పయోధరోత్సేధనిపాతచూర్ణితాః - పయోధరయోః ఉత్సేధః (ష.త.) పయోధరోత్సేధః, పయోధరోత్సేధే నిపాతః(స.త.) పయోధరోత్సేధనిపాతేన చూర్ణితాః (తృ.త.)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. అధరః - (పుం.)**

ఏ) న ధ్రియతేఽ సౌ। ధృ + అచ్, తతో నఞ్ సమాసః

బి) శ్లో॥ 'అధరో దన్తచ్ఛద ఓష్ఠ ఉచ్యతే దన్తవాసశ్చ"॥ 524
- అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ పాణిపాదతలౌ రవతౌ నేత్రాన్తరనఖాని చ।
తాలుకోఽ ధర జిహ్వా చ సప్త రక్తం ప్రశస్యతే॥





డి) శ్లో॥ పాటలావర్తులః స్నిగ్ధో రేఖాభూషితమధ్యభూః।
సీమన్తినీనామధరో రాజ్ఞాం చైవ ప్రియో భవేత్॥

శ్లో॥ శ్యామః స్థూలోఽ ధరోష్ఠః స్యాద్ వైధవ్యకలహప్రదః।
మసృణో మత్తకాశిన్యాశ్చేత్తరోష్ఠ సుభోగదః॥ - ఇతి సాముద్రకమ్।

ఇ) 'పిబసి రతిసర్వస్వమధురమ్' - ఇతి శాకున్తలే

ఎఫ్) శ్లో॥ తామ్రోదరేషు పతితం ద్రుమపల్లవేషు
నిర్ధౌతహారగులికావిశదం హిమాంభః।
ఆభాతి లబ్ధపరభాగతయా**ధరోష్ఠే**
లీలాస్మితం సదశనార్చిరివ త్వదీయమ్॥ - ర.వం. 5-70

ఎఱ్ఱని చిగురుటాకుపై బడిన పరిశుద్ధములైన తెల్లని ముత్తెములవంటి హిమాంబుకణములు మీ యెఱ్ఱని అధరోష్ఠమున ప్రకాశించెడు తెల్లని దంతకాన్తితో గూడికొన్న చిఱునవ్వువలెను ప్రకాశించుచున్నది.

**అలంకారములు:-** ఇందు 'పరికరాలంకార' మున్నదని చెప్పదగును.

చంద్రాలోకే తల్లక్షణం యథా-

**"అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణైః"।**

సాభిప్రాయవిశేషణములతో కూడియున్నయెడల 'పరికరాలంకార'మగును. ఇందు ప్రతిపదము సాభిప్రాయము. అనగా ఆసనస్థితిని వ్యంజింపజేయుచున్న పదములు కనుక పరికరాలంకారము.

**క్రియాదర్శము:- ప్రపేదిరే** - ప్ర - ఉపసర్గ, 'పద - గతౌ' (నడుచుట, వెళ్లుట) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, దివాది ప్రకరణమ్(2), లిట్, ప్రథమపురుషైక బహువచనాంతః।

**రూపాలు :-** ప్రపేదే - ప్రపేదాతే - **ప్రపేదిరే.**

శ్లో॥ తమధ్వరే విశ్వజితి క్షితీశం
నిశ్శేషవిశ్రాణితకోశజాతమ్।
ఉపాత్తవిద్యో గురుదక్షిణార్థీ
కౌత్సః **ప్రపేదే** వరతన్తుశిష్యః॥
- ర.వం. 5-1

---

**శ్లో॥ శిలాశయాం తామనికేతవాసినీమ్**
**నిరన్తరాస్వన్తరవాతవృష్టిషు।**
**వ్యలోకయన్నున్మిషితైస్తటిన్మయై-**
**ర్మహాతపస్సాక్ష్య ఇవ స్థితాః క్షపాః॥ 25**

**పదవిభాగము:-** శిలాశయామ్, తామ్, అనికేతవాసినీమ్, నిరన్తరాసు, అన్తరవాత వృష్టిషు, వ్యలోకయన్, ఉన్మిషితైః, తటిన్మయైః, మహాతపఃసాక్ష్యే, ఇవ, స్థితాః, క్షపాః।

**అన్వయక్రమము:-** నిరన్తరాసు అన్తరవాతవృష్టిషు అనికేతవాసినీమ్ శిలాశయాం తాం మహాతపఃసాక్ష్యే స్థితాః క్షపాః తడిన్మయైః ఉన్మిషితైః వ్యలోకయన్ ఇవ।

**ప్రతిపదార్థము: –** నిరన్తరాసు – ఎడతెగని, అన్తరవాతవృష్టిషు – నడుమ గాలులతో కూడిన జడివానలయందు, అనికేతవాసినీమ్ – ఆరుబయటనే వసించుచున్నదియు, శిలాశయామ్ – ఱాతిపై పరుండునదియును అగు, తామ్ – ఆ పార్వతీదేవిని, మహాతపఃసాక్ష్యే – గొప్పగా చేయుచున్న తపమునకు సాక్ష్యమందు, స్థితాః –ఉన్నట్టి, క్షపాః – రాత్రులు, తడిన్మయైః – మెఱుపులనెడి, ఉన్మిషితైః – చూపులతో, వ్యలోకయన్ ఇవ – చూచినవో యనునట్లుండెను.

**తాత్పర్యము:-** ఎడతెగని నడుమ గాలులతో కూడిన జడివానలయందు ఆరుబయటనే వసించుచున్నదియు, రాతిపై పరుండినదియును అగు ఆ పార్వతీ దేవిని గొప్పతపమునకు సాక్ష్యమందున్నట్టి రాత్రులు మెఱుపులనెడి చూపులతో చూచినవో యనునట్లుండెను.

**విభక్తులు/క్రియలు:-** 1. నిరన్తరాసు – నిరన్తరాయామ్, నిరన్తరయోః, నిరన్తరాసు; ఆకారాన్త స్త్రీలింగ నిరన్తరాశబ్దము. స.బ 2. అన్తరవాతవృష్టిషు – ...వృష్టౌ, ...వృష్ట్యోః, ...వృష్టిషు; ఇకారాన్త స్త్రీలింగ ...వృష్టిశబ్దము. స.బ 3. అనికేతవాసినీమ్ – **...వాసినీమ్,** ...వాసిన్యౌ, ...వాసినీః; ఈకారాన్త స్త్రీలింగ ...వాసినీశబ్దము. ద్వి.ఏ. 4. శిలాశయామ్ – **శిలాశయామ్**, శిలాశయే, శిలాశయాః; ఆకారాన్త స్త్రీలింగ శిలాశయాశబ్దము. ద్వి.ఏ 5. తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 6. మహాతపఃసాక్ష్యే – **...సాక్ష్యే,** ...సాక్ష్యయోః, ...సాక్ష్యేషు; అకారాన్త నపుంసకలింగ సాక్ష్యశబ్దము స.ఏ 7. స్థితాః – స్థితా, స్థితే, **స్థితాః;** ఆకారాన్త స్త్రీలింగ స్థితాశబ్దము. ప్ర.బ 8. క్షపాః – క్షపా, క్షపే, **క్షపాః**; ఆకారాన్త స్త్రీలింగ క్షపాశబ్దము. ప్ర.బ 9. తడిన్మయైః – తడిన్మయేన, తడిన్మయాభ్యామ్, **తడిన్మయైః**; అకారాన్త నపుంసకలింగ తడిన్మయశబ్దము. తృ.బ 10. ఉన్మిషితైః – ఉన్మిషితేన, ఉన్మిషితాభ్యామ్, **ఉన్మిషితైః;** అకారాన్త నపుంసకలింగ ఉన్మిషితశబ్దము. తృ.బ 11. వ్యలోకయన్ – క్రియ – లఙ్ – ప్ర.బ





**సమాసాలు:-**

1. నిరన్తరాసు – నిర్గతమ్ అన్తరం యాభ్యః (బహువ్రీహి) తాః, తాసు।
2. అన్తరవాతవృష్టిషు – అన్తరే వాతః యాసాం (బహువ్రీహి) తాః, అన్తరవాతాః అన్తరవాతాశ్చ తాః వృష్టయః (కర్మధా.) తాసు।
3. అనికేతవాసినీమ్ – నికేతే వసతి (ఉపపదతత్పు.) ఇతి నికేతవాసినీ, న నికేతవాసినీ (నఞ్తత్పు.) తామ్।
4. శిలాశయామ్ – శిలాయాం శేతే (ఉపపదతత్పు.) ఇతి శిలాశయా, తామ్।
5. మహాతపఃసాక్ష్యే – మహత్ చ తత్ తపః (కర్మధా.) మహాతపః, మహాతపసః సాక్ష్యమ్ (ష.త.) మహాతపఃసాక్ష్యమ్, తస్మిన్.

**సంధులు: –**

1. నిరన్తరాసు+అన్తర... – నిరన్తరాస్వన్తర...యణాదేశసన్ధిః।
   **ఇకో యణచి** (సూ 6-1-74) ఇ, ఉ, ఋ,ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా య్వ్ర్ల్ (యణ్) అనునవి ఆదేశమగును.
2. ఉన్మిషితైః + తటిన్మయైః – ఉన్మిషితైస్తటిన్మయైః – విసర్గసన్ధిః (సకారాదేశః)।
3. తడిన్మయైః + మహాతపః... – తడిన్మయైర్మహాతపః... విసర్గసన్ధిః(రుత్వమ్)।
4. ...సాక్ష్యే + ఇవ – సాక్ష్య ఇవ – యవలోపః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:-**

**1. క్షపా – (స్త్రీ)**

ఎ) క్షపయతి దూరయతి చేష్టామిన్ద్రియాణామ్। క్షప్ + అచ్ + టాప్।

బి) క్షపయతి చేష్టామ్, క్షి ణిచ్, అచ్।

సి) శ్లో॥ తమీ తమిస్రా కథితా తమస్వినీ
విభావరీ నక్తముఖా చ శర్వరీ।
క్షపా త్రియామా క్షపదా నిశీథినీ
నిశా చ దోషా రజనీ చ యామినీ॥ 107

శ్లో॥ వసతిర్వాసతేయీ చ శ్యామా రాత్రిశ్చ కథ్యతే।
అని హలాయుధకోశము '18' నామములను పేర్కొన్నది.

డి) శ్లో॥ రాజానం తు కురుశ్రేష్ఠం తే హంసమధురస్వరాః।
ఆశ్వాసయన్తో విప్రా గ్ర్యాః **క్షపాం** సర్వాం వ్యనోదయన్॥
– ఇతి మహాభారతే, 3-1-43

ఇ) శ్లో॥ రమ్యం ద్వేష్టి యథా పురా ప్రకృతిభిర్న ప్రత్యహం సేవ్యతే
శయ్యాప్రాన్తవివర్తనైర్విగమయత్యున్నిద్ర ఏవ **క్షపాః**।
దాక్షిణ్యేన దదాతి వాచముచితామన్తఃపురేభ్యో యదా
గోత్రేషు స్ఖలితస్తదాభవతి చ వ్రీడావిలక్షశ్చిరమ్॥
– అభిజ్ఞానశాకున్తలే – షష్ఠాఙ్కే -5

" ...నిద్రలేనివాడై ప్రక్కయందు పొర్లుటలతో రాత్రులను గడుపుచున్నాడు..."

2. రాత్ర్యాదీనాం కర్మసాక్షిత్వముక్తం మహాభారతే–

శ్లో॥ ఆదిత్యచన్ద్రావనలోఽ నిలశ్చ ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ।
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సన్ధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్॥
– 'వివరణమ్' వ్యాఖ్యనుండి.

**అలంకారాలు:–** అత్ర శ్లోకే ఉత్ప్రేక్షాలంకారః। ఇవేతి చక్షుషా విలోనమేవ ఉత్ప్రేక్షయతే। పార్వతీదేవి చేయుచున్న కఠోరతపమును రాత్రులు మెఱుపులను కన్నులతో చూచినవో యనునట్లుండెనని కవి ఊహించుటచే ఉత్ప్రేక్షాలంకారము ఇట చెప్పబడినట్లయినది.

---

37

**అవతారికా:–** హేమన్తే తపశ్చర్యా। హేమన్తఋతువున (పార్వతీదేవి) చేసిన తపస్సు.

**శ్లో॥ నినాయ సాత్యన్తహిమోత్కిరానిలాః**
**సహస్యరాత్రీరుదవాసతత్పరా।**
**పరస్పరాక్రన్దిని చక్రవాకయోః**
**పురో వియుక్తే మిథునే కృపావతీ॥ 26**

**పదవిభాగము:–** నినాయ, సా, అత్యన్తహిమోత్కిరానిలాః, సహస్యరాత్రీః, ఉదవాసతత్పరా, పరస్పరాక్రన్దిని, చక్రవాకయోః, పురః, వియుక్తే, మిథునే, కృపావతీ।

**అన్వయక్రమము :–** సా అత్యన్తహిమోత్కిరానిలాః సహస్యరాత్రీః ఉదవాసతత్పరా పరస్పరాక్రన్దిని పురః వియుక్తే చక్రవాకయోః మిథునే కృపావతీ నినాయ।



**ప్రతిపదార్థము:–** సా – ఆ పార్వతీదేవి, అత్యన్తహిమోత్కిరానిలాః – మిక్కిలి మంచును కురిపించు వాయువులుగల, సహస్యరాత్రీః – పుష్యమాసపు రాత్రులను, ఉదవాసతత్పరా – నీటియందు వసించుటయందాసక్తిగలదై, పరస్పరాక్రన్దిని – ఒకదానికొకటి పిలుచుకొనుచున్నట్టియు, పురః – ఎదుటనే, వియుక్తే – ఎడబాసిన, చక్రవాకయోః మిథునే – చక్రవాకపు జంటయందు, కృపావతీ – దయగలదై, నినాయ – కడపెను.

**తాత్పర్యము:–** ఆ పార్వతీదేవి మిక్కిలి మంచును కురిపించు వాయువులుగల పుష్యమాసపు రాత్రులను నీటియందు వసించుట యందాసక్తిగలదై ఒకదానినొకటి పిలుచుకొనుచున్నట్టియు ఎదుటనే ఎడబాసిన చక్రవాకజంటయందు దయగలదై కడపెను.

**విభక్తులు/క్రియలు:–** 1. సా – **సా**, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. అత్యన్తహిమోత్కిరానిలాః – ...అనిలామ్, ..అనిలే, ...**అనిలాః**; ఆకారాన్త స్త్రీలింగ...అనిలాశబ్దము. ద్వి.బ 3. సహస్యరాత్రీః – ...రాత్రీమ్, ...రాత్ర్యౌ, ...రాత్రీః; ఈకారాన్త స్త్రీలింగ **రాత్రీ**శబ్దము ద్వి.బ, రాత్రిః – ఇకారాన్తమున్ను 4. ఉదవాసతత్పరా – ...**తత్పరా**, ...తత్పరే, ...తత్పరాః; ఆకారాన్త స్త్రీలింగ...తత్పరాశబ్దము. ప్ర.ఏ 5. పరస్పరాక్రన్దిని ...**ఆక్రన్దిని,** ...ఆక్రన్దినోః, ...ఆక్రన్దిషు; ఇకారాన్త నపుంసకలింగ ...ఆక్రన్దిశబ్దము.స.ఏ 6. పురః – అవ్యయము 7. వియుక్తే – **వియుక్తే,** వియుక్తయోః, వియుక్తేషు; అకారాన్త నపుంసకలింగ వియుక్తశబ్దము. స.ఏ 8. చక్రవాకయోః – చక్రవాకే, **చక్రవాకయోః**, చక్రవాకేషు; అకారాన్త పుంలింగ చక్రవాకశబ్దము. స.ద్వి 9. కృపావతీ – **కృపావతీ,** కృపావత్యౌ, కృపావత్యః; ఈకారాన్త స్త్రీలింగ కృపావతీశబ్దము. ప్ర.ఏ 10. నినాయ – క్రియ – లిట్ –ప్ర.ఏ 11. మిథునే – **మిథునే,** మిథునయోః, మిథునేషు; అకారాన్త నపుంసకలింగ మిథునశబ్దము. స.ఏ

**సమాసాలు:–**

1. అత్యన్తహిమోత్కిరానిలాః – హిమానామ్ ఉత్కిరాః (ష.త.) హిమోత్కిరాః, అత్యన్తం హిమోత్కిరాః (సుప్సుపా) అత్యన్తహిమోత్కిరాః, అత్యన్తహిమోత్కిరా అనిలాః యాసు (బహువ్రీహి) తాః।
2. సహస్యరాత్రీః – సహస్యస్య రాత్రీః (ష.త.)।
3. ఉదవాసతత్పరా – ఉదకే వాసః ఉదవాసః, ఉదవాసే తత్పరా (స.త) ఉదవాసతత్పరా।
4. చక్రవాకయోః – చక్రవాకీ చ చక్రవాకశ్చ ఇతి చక్రవాకౌ: (ఏకశేష సమాసః) తయోః।

5. పరస్పరాక్రన్దిని – పరస్పరమ్ ఆక్రన్ది (సుప్సుపా) పరస్పరాక్రన్ది, తస్మిన్।

**సంధులు:–**

1. సా + అత్యన్త... – సాత్యన్త... – సవర్ణదీర్ఘసన్ధిః।
2. సహస్యరాత్రీః + ఉదవాస...– సహస్యరాత్రీరుదవాస...– విసర్గసన్ధిః (రుత్వమ్)
3. పురః + వియుక్తే – పురో వియుక్తే – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**

**1. చక్రవాకః (పుం./స్త్రీ.)**

ఎ) చక్ర ఇత్యాఖ్యయా ఉచ్యతేఽసౌ।
వచ్ + కర్మణి ఘఞ్, తతో 'న్యఙ్క్వా దీనాఞ్చ' ఇతి కుత్వమ్।

బి) శ్లో॥ "...కోకశ్చక్రశ్చక్రవాకో రథాఙ్గః।
...అని హలాయుధకోశము '13' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ 'చక్రవాకాస్తథాన్యే చ ఖగాః సన్త్యమ్బుచారిణః' – ఇతి చరకః

శ్లో॥ తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే **చక్రవాకీ**మివైకామ్।
గాఢోత్కణ్ఠా గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపామ్॥
– ఇతి మేఘదూతే –79

విపులవ్యాఖ్యకు 'మేఘదూతమ్' – 'మృణాళినీ వ్యాఖ్య' చూడగలరు.

**2. ఉదవాసతత్పరా** – ఉదవాస ఉదకవాసః। ఉదకస్య 'పేషం వాసవాహనధిషు చ' (సూ 6–3–59) ఇత్యుదాదేశః। అత్ర మనుః –
'ఆర్ద్రవాసాస్తు హేమన్తే క్రమశో వర్ధయంస్తపః' (6–23) ఇతి।

**క్రియాదర్శము:– నినాయ :-** 'ణీఞ్ (నీ) – ప్రాపణే' (తీసికొని వెళ్లుట) సకర్మకమ్, అకర్మకమ్, (ఉభయ) పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1). లిట్ – ప్రథమపురుషైక వచనాంతః।

**రూపాలు:–** **నినాయ** – నిన్యతుః – నిన్యుః
నినయిథ / నినేథ – నిన్యథుః – నిన్య
**నినాయ** / నినయ – నిన్యివ – నిన్యిమ



శ్లో॥ నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలా
మధ్యాస్య ప్రయతపరిగ్రహద్వితీయః।
తచ్ఛిష్యాధ్యయననివేదితావసానాం
సంవిష్టః కుశశయనే నిశాం **నినాయ**॥ – ర.వం. 1–95

---

**శ్లో॥ ముఖేన సా పద్మసుగన్ధినా నిశి
ప్రవేపమానాధరపత్రశోభినా।
తుషారవృష్టిక్షతపద్మసమ్పదాం
సరోజసన్ధానమివాకరోదపామ్॥ 27**

**పదవిభాగము:–** ముఖేన, సా, పద్మసుగన్ధినా, నిశి, ప్రవేప..శోభినా, తుషార...సమ్పదామ్, సరోజసంధానమ్, ఇవ, అకరోత్, అపామ్।

**అన్వయక్రమము:–** సా నిశి పద్మసుగన్ధినా ప్రవేప..శోభినా ముఖేన తుషారవృష్టిక్షతపద్మసమ్పదామ్ అపాం సరోజసన్ధానమ్ అకరోత్ ఇవ।

**ప్రతిపదార్థము:–** సా – ఆ పార్వతీదేవి, నిశి – రాత్రి(యందు)వేళ, పద్మసుగన్ధినా – తామరవలె పరిమళించుచున్నట్టిదియు, ప్రవేపమాన – అధరపత్ర – శోభినా – మిక్కిలి వణుకుచున్న తామరరేకువంటి క్రిందిపెదవిచే విరాజిల్లుచున్నది అగు, ముఖేన – మోముతో, తుషారవృష్టి – క్షతపద్మసమ్పదామ్ – మంచు కురియుటచే నాశమునొందిన తామరలశోభగలవైన, అపామ్ – నీటికి, సరోజసన్ధానమ్ – తామరలయొక్క కూర్పును, అకరోత్ + ఇవ – చేసినదివలె నుండెను.

**తాత్పర్యము:–** ఆ పార్వతీదేవి రాత్రివేళ తామరవలె పరిమళించుచున్నట్టిదియు, మిక్కిలి వణుకుచున్న తామరరేకువంటి క్రిందిపెదవిచే విరాజిల్లుచున్న మోముతో మంచు కురియుటచే నాశమునొందిన తామరలశోభగలవైన నీటికి తామరలయొక్క కూర్పును చేసినదివలె నుండెను.

**పాఠాన్తరాలు:–** 1. సంధానమ్ – సంతానమ్

**విభక్తులు/క్రియలు: –** 1. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. నిశి – **నిశి/నిశాయామ్,** నిశోః/నిశయోః, నిట్సు / నిశాసు / నిట్సు; ఆకారాన్త స్త్రీలింగ నిశాశబ్దము. స.ఏ 3. పద్మసుగన్ధినా – **పద్మసుగన్ధినా,** పద్మసుగన్ధిభ్యామ్, పద్మసుగన్ధిభిః; ఇకారాన్త నపుంసకలింగ

పద్మసుగన్ధిశబ్దము. తృ.ఏ 4. ప్రవేప..శోభినా – **...శోభినా,**...శోభిభ్యామ్, ...శోభిభిః; ఇకారాన్త నపుంసకలింగ...శోభిశబ్దము. తృ.ఏ 6. తుషార..సమ్పదామ్ – ...సమ్పదః, ...సమ్పదోః, ...**సమ్పదామ్**; దకారాన్తః స్త్రీలింగః సంపచ్ఛబ్దః షష్ఠీబహువచనాంతః 7. **అపామ్** – పాన్తః స్త్రీలింగః 'అప్'శబ్దో నిత్యం బహువచనాంతః ఆపః, అపః, అద్భిః, అద్భ్యః, ఆద్భ్యః, **అపామ్,** అప్సు, హే ఆపః 8. సరోజసన్ధానమ్ – **సరోజసన్ధానమ్,** సరోజసన్ధానే, సరోజసన్ధాని; అకారాన్త నపుంసకలింగ సరోజసన్ధానశబ్దము. ద్వి.ఏ 9. అకరోత్ – క్రియ.

**సమాసాలు:–**

1. పద్మసుగన్ధినా – శోభనః గన్ధః యస్య (బహువ్రీహి) తత్ సుగన్ధి। పద్మమ్ ఇవ సుగన్ధి (కర్మధా.), తేన।
2. ప్రవేపమానాధరపత్రశోభినా – ప్రవేపమానశ్చాసౌ అధరః (కర్మధా.) ప్రవేపమానాధరః, ప్రవేపమానాధర ఏవ పత్రమ్ (కర్మధా.) ప్రవేపమానాధర పత్రమ్, తేన శోభతే (ఉపపదతత్పు.) ఇతి, తేన।
3. తుషారవృష్టిక్షతపద్మసమ్పదామ్ – తుషారాణాం వృష్టిః (ష.త.) తుషారవృష్టిః తుషారవృష్ట్యా క్షతాః (తృ.త.) తుషారవృష్టిక్షతాః, పద్మానాం సమ్పదః (ష.త.) పద్మసమ్పదః, తుషారవృష్టిక్షతాః పద్మసమ్పదః యాసామ్ (బహువ్రీహి) తాః, తాసామ్।
4. సరోజసన్ధానమ్ – సరసి జాయతే (ఉపపదతత్పు.) ఇతి సరోజమ్, సరోజానాం సన్ధానమ్ (ష.త.) సరోజసన్ధానమ్।

**సంధులు:–**

1. ఇవ + అకరోత్ – ఇవాకరోత్ – సవర్ణదీర్ఘసన్ధిః।
2. అకరోత్ + అపామ్ – అకరోదపామ్ – జశ్త్వమ్

**ఝలాం జశోఽన్తే** (సూ.8–2–39) అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు సవర్ణమైన వర్గతృతీయ వర్ణము (జశ్త్వము) ఆదేశముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. సన్ధానమ్ – (నపుం.)** ఎ) సన్ధీయతే యదితి। సమ్ + ధా + ల్యుట్

బి) శ్లో॥ ధాన్యామ్లమారనాలం **సంధానం** కాఞ్జికం చ సౌవీరమ్।
అభిషవమవన్తి సోమం తుషోదకం శుక్తమిచ్ఛన్తి॥ 318

అని హలాయుధకోశము '9' నామములను పేర్కొన్నది.





సి) హలాయుధకోశవ్యాఖ్యానకారుడు – ఈ పదమును వివరిస్తూ ఈ శ్లోకమునే ఉదాహరించినాడు.

డి) 'వాయుః సన్ధానమ్' తైత్తిరీయోపనిషత్ 1–3–2

ఇ) శ్లో॥ యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి **కృతసన్ధానమి**వ తత్।
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః
న మే దూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజనాత్॥

అభిజ్ఞానశాకున్తలే – ప్రథమాఙ్కే – 9

"...నిశ్చయమునకు ఒకటిగా కూర్పబడని వస్తువుకూడా వెనువెంటనే కూర్పబడినదిగా కలిసినట్లు కనబడుచున్నది..."

శ్లో॥ మరుతాం పశ్యతాం తస్య శిరాంసి పతితాన్యపి
మనో నాతివిశశ్వాస పునః **సన్ధాన**శఙ్కినామ్॥ ర.వం. 12–101

**అలంకారములు:–** 'పుంసవనీ' వ్యాఖ్యనుండి

ఎ) అత్ర హేమన్తే తుషారవర్షణాదితరేషు సరోజేషు వినష్టేషు, పార్వత్యాః వదనసరోజమేవ జలే తదానీం సరోజసన్తతి విచ్ఛేదాభావ, మకరోదివేత్యభిధానాత్ **ఉత్ప్రేక్షాలంకారః।**

బి) అధరస్య పత్రరూపణాన్ముఖస్య పద్మరూపణమర్థాదాయాతమిత్యేకదేశవివర్తి **రూపకం** చ।

సి) అన్యత్ కమలం హిమేన ఉపహన్యతే తన్ముఖకమలం తు న తథా, ఇతి వ్యతిరేకాలంకారోఽపి వ్యజ్యత ఇత్యేతేషాం **సంకరః।**

**క్రియాదర్శము:– అకరోత్ :–** డుకృఞ్ (కృ) కరణే (చేయుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ। లఙ్, ప్రథమపురుషైకవచనాంతః। తనాది ప్రకరణమ్(8).

**రూపాలు :– అకరోత్** – అకురుతామ్ – అకుర్వన్.

---

**శ్లో॥ స్వయంవిశీర్ణద్రుమపర్ణవృత్తితా
పరా హి కాష్ఠా తపసస్తయా పునః।
తదప్యపాకీర్ణమతః ప్రియంవదాం
వదన్త్యపర్ణేతి చ తాం పురావిదః॥ 28**

**పదవిభాగము:–** స్వయంవిశీర్ణ...వృత్తితా, పరా, హి, కాష్ఠా, తపసః, తయా, పునః, తత్, అపి, అపాకీర్ణమ్, అతః, ప్రియంవదామ్, వదన్తి, అపర్ణా, ఇతి, చ, తామ్, పురావిదః।

**అన్వయక్రమము:–** స్వయం...వృత్తితా తపసః పరా కాష్ఠా హి। తయా పునః తత్ అపి అపాకీర్ణమ్, అతః ప్రియంవదాం తాం పురావిదః అపర్ణా ఇతి చ వదన్తి॥

**ప్రతిపదార్థము:–** స్వయంవిశీర్ణ – ద్రుమవర్ణ– వృత్తితా – తమంతతామే రాలిన చెట్లయొక్క ఆకులే జీవనముగా గలిగియుండుట, తపసః – తపమునకు, పరా కాష్ఠా – పరాకాష్ఠ, హి – కదా, తయా పునః – ఆ పార్వతీదేవిచేతనో, తదపి – అదియును (అనగా ఆ పర్ణభక్షణమును), అపాకీర్ణమ్ – మానబడెను, అతః – ఇందువలన, ప్రియంవదామ్ – ప్రియభాషిణియగు, తామ్ – ఆ పార్వతీదేవిని, పురావిదః – పురాణజ్ఞులు, అపర్ణా+ఇతి చ–'అపర్ణ'యనియును, వదన్తి– చెప్పుదురు.

**తాత్పర్యము:–** తమంతతామే రాలిన చెట్ల ఆకులే జీవనముగా కలిగియుండుట తపమునకు పరాకాష్ఠ కదా! ఆ పార్వతీదేవిచేతనో అదియును మానబడెను. ఇందువలన ప్రియభాషిణియగు ఆ పార్వతీదేవిని పురాణజ్ఞులు 'అపర్ణ' యనియు చెప్పుదురు.

**విభక్తులు/క్రియలు:–** 1. స్వయం...వృత్తితా – ...వృత్తితా, ...వృత్తితే, ...వృత్తితాః; ఆకారాన్త స్త్రీలింగ...వృత్తితాశబ్దము. ప్ర.ఏ 2. తపసః – తపసః, తపసోః, తపసామ్ సాన్తః; నపుంసకలింగషష్ఠీ ఏకవచనాన్తః 3. హి, పునః, అపి, అతః, చ, పరా – అవ్యయాలు 4. కాష్ఠా – **కాష్ఠా**, కాష్ఠే, కాష్ఠాః ; ఆకారాన్త స్త్రీలింగ కాష్ఠాశబ్దము. ప్ర.ఏ 5. తత్ – **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 6. ప్రియంవదామ్ – **ప్రియంవదామ్,** ప్రియంవదే, ప్రియంవదాః; ఆకారాన్త స్త్రీలింగప్రియంవదాశబ్దము. ద్వి.ఏ 7. తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 8. అపర్ణా – **అపర్ణా,** అపర్ణే, అపర్ణాః; ఆకారాన్త స్త్రీలింగ అపర్ణాశబ్దము. ప్ర.ఏ 9. వదన్తి – క్రియ 10. తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 11. అపాకీర్ణమ్ – **అపాకీర్ణమ్,** అపాకీర్ణే, అపాకీర్ణాని; అకారాన్త నపుంసకలింగ అపారకీర్ణశబ్దము. ప్ర.ఏ 12. పురావిదః – పురావిత్, పురావిదౌ, పురావిదః; దకారాన్త పుంలింగ పురావిచ్ఛబ్దము. ప్ర.బ.

**సమాసాలు:–**

1. స్వయంవిశీర్ణద్రుమపర్ణవృత్తితా – స్వయం విశీర్ణాని (సుప్సుపా) స్వయంవిశీర్ణాని, ద్రుమస్య పర్ణాని(ష.త.) ద్రుమపర్ణాని, స్వయంవిశీర్ణాని ద్రుమపర్ణాని ఏవ వృత్తిర్యస్య (బహువ్రీహి) సః, తస్య భావః।





2. ప్రియంవదామ్ – ప్రియం వదతి (ఉపపదతత్పు.) ఇతి ప్రియంవదా, తామ్।
3. పురావిదః – పురా విదన్తి (ఉపపదతత్పు.) ఇతి తే।
4. అపర్ణా – అవిద్యమానం పర్ణం యస్యాః (బహువ్రీహి) సా।

**సంధులు:–**

1. తపసః + తయా – తపసస్తయా – విసర్గసన్ధిః (సకారాదేశః)।
2. తత్ + అపి – తదపి – జశ్త్వసన్ధిః।
3. అపి + అపాకీర్ణమ్ – అప్యపాకీర్ణమ్ – యణాదేశసన్ధి।
4. వదన్తి + అపర్ణా – వదన్త్యపర్ణా – యణాదేశసన్ధిః।
5. అపర్ణా + ఇతి – అపర్ణేతి – గుణసన్ధిః – ఆద్గుణః (సూ 6-1-84)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1.అపర్ణా(స్త్రీ.) –**

ఎ) నాస్తి పర్ణం తపస్యాయాం పర్ణభక్షణవృత్తిర్వా యస్యాః సా। టాప్।

బి) శ్లో॥ రుద్రాణీ శర్వాణీ కాలీ కాత్యాయనీ భవానీ చ

.........

**అపర్ణా** స్యాన్మహాదేవీ గిరిజా మేనకాత్మజా॥ 16

అని హలాయుధకోశము '21'నామములను పేర్కొన్నది.

సి) హలాయుధకోశవ్యాఖ్యానకారుడు. ఈ పదమును వివరిస్తూ ఈ శ్లోకమునే ఉదాహరించినాడు.

డి) అత్ర 'అపర్ణామ్' ఇతి అపపాఠః। ఇతి శబ్దాభిహితేన ద్వితీయాయా అనుపపత్తేః। యథాహ వామనః – 'నిపాతేనాప్యభిహితే కర్మణి న కర్మవిభక్తిః, పరిగణస్య ప్రాయికత్వాత్' ఇతి మల్లినాథః।

–ఇతి పుంసవనీ వ్యాఖ్యాయామ్

**క్రియాదర్శము:– 1. వదన్తి –** వద (వద్) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1) లట్, ప్రథమపురుషబహువచనాంతః।

**రూపాలు :–** వదతి – వదతః – **వదన్తి**

శ్లో॥ ఆచేష్టే వక్తి **వదతి** రపత్యారవ్యాతి భాషతే।
బ్రూతేఽ భిధత్తే గదతి వ్యాహరత్యపి జల్పతి॥ 93

శ్లో॥ బ్రవీత్యభిదధాతి వ్యాహరతే కథయత్యపి।
గుణత్యుదీరయత్యుక్త్వా కీర్తయత్యాలపత్యపి॥ 94

శ్లో॥ భణత్యపి వచత్యేకే వాచయత్యపి శంసతి। – ఇతి 'ఆఖ్యాతచన్ద్రికాయామ్।'

---

**శ్లో॥ మృణాళికాపేలవమేవమాదిభి**
**ర్వ్రతైః స్వమఙ్గం గ్లపయన్త్యహర్నిశమ్।**
**తపః శరీరైః కఠినైరుపార్జితం**
**తపస్వినాం దూరమధశ్చకార సా॥ 29**

**పదవిభాగము:–** మృణాళికాపేలవమ్, ఏవమ్, ఆదిభిః, స్వమ్, అంగమ్, గ్లపయన్తీ, అహర్నిశమ్, తపః, శరీరైః, కఠినైః, ఉపార్జితమ్, తపస్వినామ్, దూరమ్, అధశ్చకార।

**అన్వయక్రమము:–** మృణాళికాపేలవం స్వమ్ అఙ్గమ్ ఏవమాదిభిః వ్రతైః అహర్నిశం గ్లపయన్తీ సా కఠినైః శరీరైః ఉపార్జితం తపస్వినాం తపః దూరమ్ అధశ్చకార।

**ప్రతిపదార్థము:–** మృణాళికాపేలవమ్ – తామరతూడువలె సుకుమారమైన, స్వమ్ – తన, అఙ్గమ్ – శరీరమును, ఏవమాదిభిః – ఇట్లు పూర్వము చెప్పబడినట్టి, వ్రతైః – వ్రతములచేత, అహర్నిశమ్ – రాత్రింబవళ్లు, గ్లపయన్తీ – కృశింపజేయుచున్నదైన, సా – ఆ పార్వతీదేవి, కఠినైః – క్లేశములను సహింపజాలు, శరీరైః – శరీరములచే, ఉపార్జితమ్ – సంపాదించబడిన, తపస్వినామ్ – ఋషులయొక్క తపః – తపస్సును, దూరమ్ – మిక్కిలి, అధశ్చకార – క్రిందుచేసెను.

**తాత్పర్యము:–** తామరతూడువలె సుకుమారమైన తన శరీరమును ఇట్లు పూర్వము చెప్పబడినట్టి వ్రతములచేత రాత్రింబవళ్లు కృశింపజేయుచున్నదైన ఆ పార్వతీదేవి, క్లేశములను సహింపజాలు శరీరములచే సంపాదించబడిన ఋషులతపస్సును మిక్కిలి క్రిందుచేసెను.

**పాఠాన్తరాలు:–** 1. పేలవ – కోమల,
2. స్వమఙ్గమ్ – తదఙ్గమ్,
3. గ్లపయన్తీ –క్షపయన్తీ

**విభక్తులు/క్రియలు:–** 1. మృణాళికాపేలవమ్ – **మృణాళికాపేలవమ్,** మృణాళికాపేలవే, మృణాళికాపేలవాని అకారాన్త నపుంసకలింగ... పేలవశబ్దము. ద్వి.ఏ 2. స్వమ్ – **స్వమ్,** స్వే, స్వాని





అకారాన్త నపుంసకలింగ 'స్వ'శబ్దము. ద్వి.ఏ 3. అఙ్గమ్ – **అఙ్గమ్,** అఙ్గే, అఙ్గాని అకారాన్త నపుంసకలింగ అఙ్గశబ్దము. ద్వి.ఏ 4. ఏవమాదిభిః – ఏవమాదినా, ఏవమాదిభ్యామ్, **ఏవమాదిభిః** ఇకారాన్త పుంలింగ 'ఏవమాది'శబ్దము. తృ.బ 5. వ్రతైః – **వ్రతేన,** వ్రతాభ్యామ్, వ్రతైః అకారాన్త పుంలింగ వ్రతశబ్దము. తృ.బ 6. అహర్నిశమ్ – సమాహారే ద్వంద్వైకవద్భావః। అత్యన్తసంయోగేద్వితీయా।7. గ్లపయన్తీ – **గ్లపయన్తీ,** గ్లపయన్త్యౌ, గ్లపయన్త్యః ఈకారాన్త స్త్రీలింగ గ్లపయన్తీశబ్దము. తృ.బ. 8. సా – **సా,** తే, తాః దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 9. కఠినైః – కఠినేన, కఠినాభ్యామ్, కఠినైః అకారాన్త నపుంసకలింగ కఠినశబ్దము. తృ.బ. 10. శరీరైః – శరీరేణ, శరీరాభ్యామ్, **శరీరైః** అకారాన్త నపుంసకలింగ శరీరశబ్దము. తృ.బ 11. ఉపార్జితమ్ – **ఉపార్జితమ్,** ఉపార్జితే, ఉపార్జితాని అకారాన్త నపుంసకలింగ ఉపార్జితశబ్దము. ద్వి.ఏ 12. తపస్వినామ్ – తపస్వినః, తపస్వినోః, **తపస్వినామ్** సకారాన్త పుంలింగ తపస్విన్‌శబ్దము. ష.బ 13. తపః – తపః, తపసీ, తపాంసి సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ద్వి.ఏ 14. దూరమ్ – **దూరమ్,** దూరే, దూరాణి, అకారాన్త నపుంసకలింగ దూరశబ్దము. ప్ర.ఏ 15. అధశ్చకార – క్రియ

**సమాసాలు:–**

1. మృణాళికాపేలవమ్ – మృణాలికా ఇవ పేలవమ్ (కర్మధా.)।
2. ఏవమాదిభిః – ఏవమ్ ఆదిర్యేషామ్ (బహువ్రీహి) తే, ఏవమాదయః, తైః।
3. అహర్నిశమ్ – అహశ్చ నిశా చ అహర్నిశమ్ (ద్వంద్వ) తత్।

**సంధులు:–**

1. ఆదిభిః + వ్రతైః ఆదిభివర్వ్రతైః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. గ్లపయన్తీ + అహర్నిశమ్ – గ్లపయన్త్యహర్నిశమ్ – యణాదేశసన్ధిః।
3. కఠినైః + ఉపార్జితమ్ – కఠినైరుపార్జితమ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. తపస్వీ –**

ఎ) తపస్ + అస్త్యర్థే విని।

బి) శ్లో॥ **తపస్వీ** సంయతః శాన్తో మునిర్లింగీ యతిర్వ్రతీ। 344
అని హలాయుధకోశము '7' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ఊరుః పురుః శతద్యుమ్నస్తపస్వీ సత్యవాన్ కవిః।
అగ్నిష్టుదతిరాత్రశ్చ సుద్యుమ్నశ్చేతి తే నవ॥ 18
హరివంశే – ద్వితీయేఽధ్యాయే

డి) శ్లో॥ **తపస్వినస్తస్య** తపః కృశస్య
సరూపతామాప్తుమివాశ్రయద్భిః।

దినే దినే మే దయనీయరూపైః
రజ్ఞైరశేషైరతికార్శ్యమాపే ॥ చంపూభారతే 1-40

ఇ) శ్లో॥ స జాతకర్మణ్యఖిలే **తపస్వినా** తపోవనాదేత్య పురోధసా కృతే,
దిలీపసూనుర్మణిరాకరోద్భవః ప్రయుక్తసంస్కార ఇవాధికం బభౌ॥

(వసిష్ఠుని మంత్రప్రభావముచేత ఆ దిలీపుని కుమారుడు మిక్కిలి తేజోవంతు డయ్యెనని భావము.) ర.వం. -3-18

ఎఫ్) శ్లో॥ మదేకపుత్రా జననీ జరాతురా
నవప్రసూతిర్వరటా **తపస్వినీ॥**
గతిస్తయోరేష జనస్తమర్దయ-
న్నహో విధే త్వాం కరుణా రుణద్ధి నో॥ నైషధకావ్యే - 1 -135

**క్రియాదర్శము:- 1. చకార :-** దుకృఞ్ (కృ) కరణే - చేయుట సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ, తనాది ప్రకరణమ్ (8). లిట్, ప్రథమపురుషైక వచనాంతః।

రూపాలు: - **చకార** - చక్రతుః - చక్రుః.

---

**శ్లో॥ అథాజినాషాఢధరః ప్రగల్భవా-**
**గ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా।**
**వివేశ కశ్చిజ్జటిలస్తపోవనం**
**శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా॥ 30**

**పదవిభాగము:-** అథ, అజినాషాఢధరః, ప్రగల్భవాక్, జ్వలన్, ఇవ, బ్రహ్మమయేన, తేజసా, వివేశ, కశ్చిత్, జటిలః, తపోవనమ్, శరీరబద్ధః, ప్రథమాశ్రమః, యథా।

**అన్వయక్రమము:-** అథ అజినాషాఢధరః ప్రగల్భవాక్ బ్రహ్మమయేన తేజసా జ్వలన్ ఇవ కశ్చిత్ జటిలః శరీరబద్ధః ప్రథమాశ్రమః యథా తపోవనం వివేశ।

**ప్రతిపదార్థము:-** అథ - పిమ్మట, అజినాషాఢధరః - నల్లయిఱ్ఱితోలును మోదుగకఱ్ఱను ధరించినవాడును, ప్రగల్భవాక్ - మాటలాడుటలో కుశలుడును, బ్రహ్మమయేన - వైదికమైన, తేజసా - బ్రహ్మవర్చసముచేత, జ్వలన్ + ఇవ -





ప్రకాశమానుడును అగు, కశ్చిత్ - ఒకానొక, జటిలః - జటాధరుడు, శరీరబద్ధః - రూపుదాల్చిన, ప్రథమాశ్రమః యథా - బ్రహ్మచర్యాశ్రమమో యన్నట్లుగా, తపోవనమ్ - (పార్వతీదేవి తపముచేయు) ఆశ్రమమునుగూర్చి, వివేశ - ప్రవేశించెను.

**తాత్పర్యము:-** పిమ్మట, నల్లయిఱ్ఱితోలును, మోదుగకఱ్ఱను ధరించినవాడును, మాటలాడుటలో కుశలుడును, వైదికయైన బ్రహ్మవర్చసముచేత ప్రకాశమానుడును అగు ఒకానొక జటాధరుడు రూపుదాల్చిన బ్రహ్మచర్యాశ్రమమో యన్నట్లుగా (పార్వతీదేవి తపముచేయు) ఆశ్రమమునుగూర్చి ప్రవేశించెను.

**పాఠాన్తరాలు:-** 1. తేజసా - వర్చసా 2. బద్ధః - బన్ధః

**విభక్తులు/క్రియలు:-**1. అథ, ఇవ, యథా - అవ్యయాలు 2. అజినాషాఢధరః - **అజినాషాఢధరః**, అజినాషాఢధరౌ, అజినాషాఢధరాః; అకారాన్త పుంలింగ అజినాషాఢధరశబ్దము. ప్ర.ఏ 3. ప్రగల్భవాక్ - ప్రగల్భవాక్, ప్రగల్భవాచౌ, ప్రగల్భవాచః; చకారాన్త పుంలింగ 'ప్రగల్భవాచ్' శబ్దము. ప్ర.ఏ 4. బ్రహ్మమయేన - **బ్రహ్మమయేన,** బ్రహ్మమయాభ్యామ్, బ్రహ్మమయైః ; అకారాన్త నపుంసకలింగ బ్రహ్మమయశబ్దము.తృ.ఏ 5. తేజసా - **తేజసా**, తేజోభ్యామ్, తేజోభిః; సకారాన్త నపుంసకలింగ తేజశ్శబ్దము. తృ.ఏ 6. జ్వలన్ - **జ్వలన్,** జ్వలన్తౌ, జ్వలన్తః శత్రన్తో 'జ్వలత్' పుంలింగశబ్దః, ప్ర.ఏ 7. కశ్చిత్, యథా - అవ్యయము 8. జటిలః - **జటిలః,** జటిలౌ, జటిలాః; అకారాన్త పుంలింగ జటిలశబ్దము ప్ర.ఏ 9. శరీరబద్ధః - **శరీరబద్ధః**, శరీరబద్ధౌ, శరీరబద్ధాః; అకారాన్త పుంలింగ శరీరబద్ధశబ్దము. ప్ర.ఏ 10. ప్రథమాశ్రమః - **ప్రథమాశ్రమః** , ప్రథమాశ్రమౌ, ప్రథమాశ్రమాః; అకారాన్త పుంలింగ ప్రథమాశ్రమశబ్దము. ప్ర.ఏ 11. తపోవనమ్ - **తపోవనమ్,** తపోవనే, తపోవనాని; అకారాన్త నపుంసకలింగ తపోవనశబ్దము. ద్వి.ఏ 12. వివేశ - క్రియ

**సమాసాలు:-**

1. అజినాషాఢధరః - అజినం చ ఆషాఢః చేతి (ద్వంద్వ) అజినాషాఢౌ, అజినాషాఢయోః ధరః (ష.త.)।
2. ప్రగల్భవాక్ -ప్రగల్భా వాక్ యస్య (బహువ్రీహి) సః।
3. శరీరబద్ధః - శరీరం బద్ధం యస్య (బహువ్రీహి) సః।
4. ప్రథమాశ్రమః - ప్రథమశ్చ అసౌ ఆశ్రమః (కర్మధా.)
5. తపోవనమ్ - తపసః వనమ్ (ష.త.)

**సంధులు:-**

1. అథ + అజినా.. - అథాజినా.. - సవర్ణదీర్ఘసన్ధిః।
2. కశ్చిత్ + జటిలః - కశ్చిజ్జటిలః - శ్చుత్వసన్ధిః।

3. జటిలః + తపోవనమ్ – జటిలస్తపోవనమ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)

4. ప్రథమాశ్రమః + యథా – ప్రథమాశ్రమో యథా – ఉత్వాదేశః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. జటిలః –**

ఎ) 'జటా అస్త్యర్థే ఇలచ్'

బి) శ్లో॥ లంకేశ్వర ప్రణతిభఙ్గ దృఢవ్రతం త–
ద్వన్ద్యం యుగం చరణయోర్జనకాత్మజాయాః।
జ్యేష్ఠాను**వృత్తిజటిలం** చ శిరోఽస్య సాధోః
అన్యోన్యపావనమభూదుభయం సమేత్య॥ ర.వం. 13–78

"...తన పాతివ్రత్యమును కాపాడుకొనిన సీతాదేవియొక్క పాదద్వంద్వమును, అన్న మీది భక్తితో రాజ్యమును వదిలి, **జటాధారియైన** భరతుని శిరస్సును, ఇప్పుడు ఒండొంతటితో కలిసికొని ఒకదానినొకటి పావనముగా చేసినవి."

సి) "లోమాదిపామాదిపిచ్ఛాదిభ్యః శనేలచః" (సూ 5–2–100)
జటిలో జటావాన్।

శ్లో॥ శ్మశ్రు ప్రవృద్ధిజనితాననవిక్రియాంశ్చ
ప్లక్షాన్ప్రరోహ**జటిలానివ** మన్త్రివృద్ధాన్। ర.వం. 13–71

'..జటాధారులైయున్న వృద్ధమంత్రులను సయితము..."

**అలంకారము:–** ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

"శోభాధిక్యం లోకోత్తరప్రభావముత్ప్రేక్షా హేతుః। 'యథా'శబ్దోయమ్ ఉత్ప్రేక్షాద్యోతకః।"

**క్రియాదర్శము:– వివేశ** – విశ (విశ్) ప్రవేశనే (ప్రవేశించుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాదిప్రకరణమ్(6), లిట్, ప్రథమపురుషైకవచనాంతః।

**రూపాలు :– వివేశ :–** వివిశతుః – వివిశుః

శ్లో॥ మనుష్యవాహ్యం చతురన్తయాన–
మధ్యాస్య కన్యా పరివారశోభి।
**వివేశ** మంచాంతరరాజమార్గం
పతింవరా కౢప్తవివాహవేషా॥ ర.వం. 6–10





**శ్లో॥ తమాతిథేయీ బహుమానపూర్వయా
సపర్యయా ప్రత్యుదియాయ పార్వతీ।
భవన్తి సామ్యేఽపి నివిష్టచేతసాం
వపుర్విశేషేష్వతిగౌరవాః క్రియాః॥ 31**

**పదవిభాగము:–** తమ్, ఆతిథేయీ, బహుమానపూర్వయా, సపర్యయా, ప్రత్యుదియాయ, పార్వతీ, భవన్తి, సామ్యే, అపి, నివిష్టచేతసామ్, వపుర్విశేషేషు, అతిగౌరవాః, క్రియాః।

**అన్వయక్రమము:–** ఆతిథేయీ పార్వతీ తం బహుమానపూర్వయా, సపర్యయా, ప్రత్యుదియాయ। సామ్యే అపి నివిష్టచేతసాం వపుర్విశేషేషు, అతిగౌరవాః క్రియాః భవన్తి।

**ప్రతిపదార్థము:–** ఆతిథేయీ – అతిథులయెడ ఆదరము కలదగు, పార్వతీ – పార్వతీదేవి, తమ్ – ఆ జటాధరుని, బహుమానపూర్వయా – గౌరవపురస్సరమగు, సపర్యయా – పూజచేత, ప్రత్యుదియాయ – ఎదురేగెను, సామ్యే అపి – సమానతయే యున్నను, నివిష్టచేతసామ్ – స్థిరచిత్తముగలవారికి, వపుర్విశేషేషు – వ్యక్తి విశేషములయందు, అతిగౌరవాః – మిక్కిలి ఆదరముతో కూడిన, క్రియాః – వ్యాపారములు, భవన్తి – ఉండును.

**తాత్పర్యము:–** అతిథులయెడ ఆదరము కలదగు పార్వతీదేవి ఆ జటాధరుని గౌరవపురస్సరమగు పూజచేత ఎదురేగెను. సమానతయే యున్నను స్థిరచిత్తము గలవారికి వ్యక్తివిశేషములయందు మిక్కిలి ఆదరముతో కూడిన వ్యాపారము లుండును.

**పాఠాన్తరాలు:–** 1. సామ్యేఽపి నివిష్ట – సామ్యేఽభినివిష్ట, 2. అతి – అధి

**విభక్తులు/క్రియలు:–** 1. ఆతిథేయీ – **ఆతిథేయీ,** ఆతిథేయ్యౌ, ఆతిథేయ్యః ఈకారాన్త స్త్రీలింగ ఆతిథేయీశబ్దము. ప్ర.ఏ. 2. పార్వతీ – **పార్వతీ,** పార్వత్యౌ, పార్వత్యః ఈకారాన్త స్త్రీలింగపార్వతీశబ్దము. ప్ర.ఏ 3. తమ్ – **తమ్,** తౌ, తాన్ దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 4. బహుమానపూర్వయా – **బహుమానపూర్వయా,** బహుమానపూర్వాభ్యామ్, బహుమానపూర్వాభిః ఆకారాన్త స్త్రీలింగ...పూర్వాశబ్దము. తృ.ఏ 5. సపర్యయా – **సపర్యయా,** సపర్యాభ్యామ్, సపర్యాభిః ఆకారాన్త స్త్రీలింగ సపర్యాశబ్దము. తృ.ఏ 6. ప్రత్యుదియాయ – క్రియ –లిట్ 7. సామ్యే – **సామ్యే,** సామ్యయోః, సామ్యేషు అకారాన్త నపుంసకలింగ సామ్యశబ్దము. స.ఏ 8. అపి – అవ్యయము 9. నివిష్టచేతసామ్ – ...చేతసః, ...చేతసోః, ...చేతసామ్ సకారాన్త పుంలింగ ...చేతశ్శబ్దము. ష.బ

10. వపుర్విశేషేషు – వపుర్విశేషే, వపుర్విశేషయోః వపుర్విశేషేషు, అకారాన్త పుంలింగ వపుర్విశేషశబ్దము. స.బ 11. అతిగౌరవాః – **అతిగౌరవా,** అతిగౌరవే, అతిగౌరవాః ఆకారాన్త స్త్రీలింగ అతిగౌరవాశబ్దము. ప్ర.బ 12. క్రియాః – క్రియా, క్రియే, క్రియాః ఆకారాన్త స్త్రీలింగ క్రియాశబ్దము. ప్ర.బ

**సమాసాలు:–**

1. బహుమానపూర్వయా – బహుశ్చాసౌ మానః (కర్మధా.) బహుమానః, బహుమానః పూర్వః యస్యాః (బహువ్రీహి) సా, బహుమానపూర్వా, తయా।
2. నివిష్టచేతసామ్ – నివిష్టం చేతః యేషామ్ (బహువ్రీహి) తే. నివిష్ట చేతసః, తేషామ్।
3. వపుర్విశేషేషు – వపుషాం విశేషాః (ష.త.) వపుర్విశేషాః, తేషు।
4. అతిగౌరవాః – అత్యన్తం గౌరవం యాసామ్ (బహువ్రీహి) తాః॥

**సంధులు:–**

1. సామ్యే + అపి – సామ్యేఽపి – పూర్వరూపసన్ధిః
   **ఏఙః పదాన్తాదతి** (సూ 6-1-105) పదాంతమందున్న ఏఓలకు హ్రస్వఅకారము పరముగా నున్నప్పుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపమేకాదేశమగును.
2. వపుర్విశేషేషు + అతిగౌరవాః – వపుర్విశేషేష్వతిగౌరవాః – యణాదేశసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. సామ్యమ్ – (నపుం.)**

ఎ) సమస్య భావః సమ + ష్యఞ్

బి) "చాణ్డాలాన్త్యస్త్రియో గత్వా భుక్త్వా చ ప్రతిగృహ్య చ।
పతత్యజ్ఞానతో విప్రో జ్ఞానాత్ సామ్యం తు గచ్ఛతి॥"

–ఇతి ప్రాయశ్చిత్తతత్త్వమ్.

సి) శ్లో॥ నమః శాన్తాయ ఘోరాయ మూఢాయ గుణధర్మిణే।
నిర్విశేషాయ **సామ్యాయ** నమో జ్ఞానఘనాయ చ॥

– శ్రీమద్భాగవతే -8-12

డి) శ్లో॥ ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతి **సామ్యతామ్।**
నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పఞ్చ వై॥

– మనుస్మృతి -12-90





ఇ) శ్లో॥ ఇహైవ తైర్జితః సర్గో – యేషాం **సామ్యే** స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ – తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః॥

– భగవద్గీత -5-19

"ఎవరి మనస్సు సమభావమునందు స్థితమై యుండునో వారిచే ఈ జన్మయందే జగత్తంతయు జయింపబడినది యగును"....

ఎఫ్) శ్లో॥ ఉత్క్షిప్యోచ్చైః ప్రస్ఫురన్తం రదాభ్యామీషాదన్తః కుంజరం శాస్త్రవీయమ్।
శృంగప్రోతప్రావృషేణ్యామ్బుదస్య స్పష్టం ప్రాప**త్సామ్యము**ర్వీధరస్య॥

ఇతి శిశుపాలవధే -18-38

**అలంకారములు:–** ఇట 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. సామాన్యముచే విశేషము ఇచట సమర్థింపబడినది. అన్వయము సరళము.

**క్రియాదర్శము:– 1. భవన్తి** – భూ – సత్తాయామ్, లట్, ప్రథమపురుషైకవచనాంతః రూపాలు – భవతి – భవతః – **భవన్తి**

---

**శ్లో॥ విధిప్రయుక్తాం పరిగృహ్య సత్క్రియాం**
**పరిశ్రమం నామ వినీయ చ క్షణమ్।**
**ఉమాం స పశ్యన్నృజునైవ చక్షుషా**
**ప్రచక్రమే వక్తుమనుజ్ఝితక్రమః॥ 32**

**పదవిభాగము :–** విధిప్రయుక్తామ్, పరిగృహ్య, సత్క్రియామ్, పరిశ్రమమ్, నామ, వినీయ, చ, క్షణమ్, ఉమామ్, సః, పశ్యన్, ఋజునా, ఏవ, చక్షుషా, ప్రచక్రమే, వక్తుమ్, అనుజ్ఝితక్రమః।

**ప్రతిపదార్థము :–** సః – ఆ జటాధరుడు, విధిప్రయుక్తామ్ – శాస్త్రప్రకారము చేయబడిన, సత్క్రియామ్ – పూజను, పరిగృహ్య – స్వీకరించి, క్షణమ్ – క్షణకాలము, పరిశ్రమమ్ – శ్రమను, వినీయ నామ – తొలగించుకొని(నట్లు ప్రవర్తించి), ఉమామ్ – పార్వతీదేవిని, ఋజునా + ఏవ – నేఱుగానే, చక్షుషా – కంటితో, పశ్యన్ – చూచుచు, అనుజ్ఝితక్రమః – సంప్రదాయమును వీడనివాడై, వక్తుమ్ – పలుకుటకు, ప్రచక్రమే – ఉపక్రమించెను.

**తాత్పర్యము :–** ఆ జటాధరుడు శాస్త్రప్రకారము చేయబడిన పూజను స్వీకరించి క్షణకాలము శ్రమను తొలగించుకొని (నట్లు ప్రవర్తించి) పార్వతీదేవిని నేఱుగానే కంటితో చూచుచు సంప్రదాయము వీడనివాడై పలుకుట కుపక్రమించెను.

**పాఠాన్తరాలు :–** 1. పరిగృహ్య – ప్రతిగృహ్య

**విభక్తులు/క్రియలు :–** 1. సః – **సః,** తౌ, తే దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. విధిప్రయుక్తామ్ – **విధిప్రయుక్తామ్,** విధిప్రయుక్తే, విధిప్రయుక్తాః; ఆకారాన్త స్త్రీలింగ…ప్రయుక్తాశబ్దము. ద్వి.ఏ 3. సత్క్రియామ్ – **సత్క్రియామ్,** సత్క్రియే, సత్క్రియాః; ఆకారాన్త స్త్రీలింగ సత్క్రియాశబ్దము. ద్వి.ఏ 4. పరిగృహ్య – అవ్యయము (ల్యబన్తము) 5. క్షణమ్ – **క్షణమ్**, క్షణౌ, క్షణాన్; అకారాన్త పుంలింగ క్షణశబ్దము. ద్వి.ఏ 6. పరిశ్రమమ్ – **పరిశ్రమమ్,** పరిశ్రమౌ, పరిశ్రమాన్; అకారాన్త పుంలింగ పరిశ్రమశబ్దము. ద్వి.ఏ 7. వినీయ – ల్యబన్తము 8. ఉమామ్ – **ఉమామ్,** ఉమే, ఉమాః; ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము. ద్వి.ఏ 9. ఋజునా – **ఋజునా,** ఋజుభ్యామ్, ఋజుభిః; ఉకారాన్త నపుంసకలింగ ఋజుశబ్దము. తృ.ఏ 10. చక్షుషా – **చక్షుషా,** చక్షుర్భ్యామ్, చక్షుర్భిః; షాన్తో నపుంసకలింగ చక్షుష్ శబ్దము. తృ.ఏ 11. పశ్యన్ – **పశ్యన్,** పశ్యన్తౌ, పశ్యన్తః; తకారాన్త పుంలింగ పశ్యచ్ఛబ్దము. ప్ర.ఏ 12. అనుజ్ఝితక్రమః – **అనుజ్ఝితక్రమః**, అనుజ్ఝితక్రమౌ, అనుజ్ఝితక్రమాః ; అకారాన్త పుంలింగ అనుజ్ఝితక్రమశబ్దము. ప్ర.ఏ 13. ప్రచక్రమే – క్రియ

**సమాసాలు :–**

1. విధిప్రయుక్తామ్ – విధినా ప్రయుక్తా (తృ.త.) తామ్।
2. సత్క్రియామ్ – సతీ చాసౌ క్రియా (కర్మధా.) సత్క్రియా, తామ్।
3. అనుజ్ఝితక్రమః – న ఉజ్ఝితః (నఞ్‌తత్పురుష) అనుజ్ఝితః క్రమః యేన (బహువ్రీహి) సః।

**సంధులు :–**

1. ఋజునా + ఏవ – ఋజునైవ – వృద్ధిసన్ధిః।
2. పశ్యన్ + ఋజునా – పశ్యన్నృజునా – ఙముడాగమసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఉజ్ఝితమ్ :–** ఎ) ఉజ్ఝ్+ క్త

బి) శ్లో॥ …త్యక్తముత్సృష్టముజ్ఝితమ్। 714

అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.

సి) "ఈ సర్గయందు '34'వ శ్లోకమును కూడా ఈ పదవివరణకై చూడదగును.

డి) శ్లో॥ ఉజ్ఝితా యాస్త్వయా నాథ।
తదైవ మరణం వరమ్। – ఇతి రామాయణే



ఇ) శ్లో॥ ఇతి విరచితవాగ్భిర్వన్దిపుత్రైః కుమారః
సపది విగతనిద్రస్తల్పము**ముజ్ఝాంచకార**।
మదపటునినదద్భిర్బోధితో రాజహంసైః
సురగజ ఇవ గాంగం సైకతం సుప్రతీకః॥ 5–75

– ఇతి రఘువంశమహాకావ్యే

**క్రియాదర్శము :–** **ప్రచక్రమే :–** ప్రేత్యుపసర్గపూర్వకాత్,

'క్రము పాదవిక్షేప' ఇత్యస్మాద్ధాతోరకర్మకాత్కర్తరిభూతే లిడాత్మనే పదీ ప్రథమపురుషైకవచనాంతః। **ప్రచక్రమే** – ప్రచక్రమాతే – ప్రచక్రమిరే.

శ్లో॥ సంచారపూతాని దిగన్తరాణి కృత్వా దినాంతే నిలయాయ గన్తుమ్।
**ప్రచక్రమే** పల్లవరాగతామ్రా ప్రభా పతఙ్గస్య మునేశ్చ ధేనుః॥

– ఇతి రఘువంశమహాకావ్యే – 2–15

---

**శ్లో॥ అపి క్రియార్థం సులభం సమిత్కుశం**
**జలాన్యపి స్నానవిధిక్షమాణి తే।**
**అపి స్వశక్త్యా తపసి ప్రవర్తసే**
**శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్॥ 33**

**పదవిభాగము :–** అపి, క్రియార్థమ్, సులభమ్, సమిత్కుశమ్, జలాని, అపి, స్నానవిధి – క్షమాణి, తే, అపి, స్వశక్త్యా, తపసి, ప్రవర్తసే, శరీరమ్, ఆద్యమ్, ఖలు, ధర్మసాధనమ్।

**అన్వయక్రమము :–** క్రియార్థం సమిత్కుశం సులభమ్ అపి జలాని తే స్నానవిధి – క్షమాణి అపి స్వశక్త్యా తపసి అపి ప్రవర్తసే ఖలు శరీరమ్ ఆద్యం ధర్మసాధనమ్।

**ప్రతిపదార్థము :–** క్రియార్థమ్ – హోమాద్యనుష్ఠానము కొఱకు, సమిత్కుశమ్ – సమిధలును, దర్భలును, సులభమ్ + అపి – సులభముగా లభించుచున్నవా?, జలాని – జలములు, తే – నీకు, స్నానవిధిక్షమాణి అపి – స్నానక్రియకు తగియున్నవా? స్వశక్త్యా – నీ శక్త్యనుసారము, తపసి – తపము చేయుటయందు, అపి ప్రవర్తసే – ప్రవర్తించుచుంటివా? ఖలు – ఏలయన, శరీరమ్ – దేహము, ఆద్యమ్ – మొట్టమొదటి, ధర్మసాధనమ్ – ధర్మమునకు సాధనము.

**తాత్పర్యము :-** హోమాద్యనుష్ఠానముకొఱకు సమిధలును, దర్భలును సులువుగా లభించుచున్నవా? జలములు నీ స్నానక్రియకు తగియున్నవా? నీ శక్త్యనుసారము తపము చేయుటయందు ప్రవర్తించుచుంటివా? ఏలయన ధర్మమునకు దేహము మొట్టమొదటి సాధనము.

**పాఠాన్తరాలు :-**

1. అపి – అయి, 2. క్రియార్థమ్ – క్రియాయై; 3. విధి – విధౌ

**విభక్తులు/క్రియలు :-** 1. అపి, ఖలు – అవ్యయాలు, 2. క్రియార్థమ్ – **క్రియార్థమ్,** క్రియార్థౌ, క్రియార్థాన్; అకారాన్త పుంలింగ 'క్రియార్థ'శబ్దము. ద్వి.ఏ 3. సమిత్కుశమ్ – ('జాతిరప్రాణినామ్' ఇతి సమాహారద్వంద్వః) 4. సులభమ్ – **సులభమ్,** సులభౌ, సులభాన్ ; అకారాన్త పుంలింగ సులభశబ్దము. ద్వి.ఏ 5. జలాని – జలమ్, జలే, **జలాని ;** అకారాన్త నపుంసకలింగ జలశబ్దము. ప్ర.బ 6. తే – **తే,** వామ్, వః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 7. స్నానవిధిక్షమాణి – ...క్షమమ్, ...క్షమే, **...క్షమాణి;** అకారాన్త నపుంసకలింగ ...క్షమశబ్దము. ప్ర.బ 8. స్వశక్త్యా – **స్వశక్త్యా,** స్వశక్తిభ్యామ్, స్వశక్తిభిః; ఇకారాన్త స్త్రీలింగ స్వశక్తిశబ్దము. తృ.ఏ 9. తపసి – **తపసి,** తపసోః, తపస్సు; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. స.ఏ 10. ప్రవర్తసే – క్రియ 11. శరీరమ్ – **శరీరమ్,** శరీరే, శరీరాణి; అకారాన్త నపుంసకలింగ శరీరశబ్దము. ప్ర.ఏ 12. ఆద్యమ్ – **ఆద్యమ్,** ఆద్యే, ఆద్యాని ; అకారాన్త నపుంసకలింగ ఆద్యశబ్దము. ప్ర.ఏ 13. ధర్మసాధనమ్ – **ధర్మసాధనమ్,** ధర్మసాధనే, ధర్మసాధనాని; అకారాన్త నపుంసకలింగ ధర్మసాధనశబ్దము ప్ర.ఏ.

**సమాసాలు :-**

1. క్రియార్థమ్ – క్రియాభ్యః ఇదమ్ (చ.త.)।
2. సమిత్కుశమ్ – సమిధశ్చ కుశాశ్చ (ద్వంద్వ) సమిత్కుశమ్।
3. స్నానవిధిక్షమాణి – స్నానస్య విధిః (ష.త.) స్నానవిధౌ క్షమాణి (స.త.)।
4. స్వశక్త్యా – స్వస్య శక్తిః (ష.త.) స్వశక్తిః తయా।
5. ధర్మసాధనమ్ – ధర్మస్య సాధనమ్ (ష.త.)।

**సంధులు :-**

1. జలాని + అపి – జలాన్యపి – యణాదేశసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. ధర్మః (పుం. నపుం.) :-**

ఎ) ధరతి లోకాన్, ధ్రియతే పుణ్యాత్మభిరితి వా।
ధృ + 'అర్తిస్తుహుస్రుతి' మన్। ఉణాది (1–140)



బి) శ్లో॥ ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతి యః।
శరీరేణ సమం నాశం సర్వమన్యత్తు గచ్ఛతి॥
– ఇతి హితోపదేశే (1–59)

సి) శ్లో॥ '**ధర్మః** పుణ్యం వృషః శ్రేయః సుకృతం చ సమం స్మృతమ్' – 125
అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

డి) 'ధ్రియతే సుఖప్రాప్తయే సేవ్యతే స **ధర్మః',** పక్షపాతరహితోన్యాయః సత్యాచారో వా।

ఇ) శ్లో॥ యం పృథ**గ్ధర్మ** చరణాః పృథగ్ధర్మ ఫలైషిణః।
పృథగ్ధర్మైస్సమర్చన్తి తస్మై ధర్మాత్మనే నమః॥ – భీష్మస్తవరాజము – 53
..ధర్మస్వరూపుడగు ఆ శ్రీమన్నారాయణు'నకు నమస్కారము చేయుచున్నాను.

ఎఫ్) శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమ**ధర్మస్య** తదాత్మానం సృజామ్యహమ్। – భగవద్గీత, 4–7

ఓ అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మముకు వృద్ధియు అగునో అప్పటికప్పుడే నేను నా రూపమును ప్రకటించుచుందును". మఱియు

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే। – భగవద్గీత, 4–8

"సత్పురుషుల పరిరక్షణకొఱకు దుష్టుల వినాశనముకొఱకు మఱియు ధర్మమును సుస్థిరమొనర్చుటకు ప్రతియుగమునందు అవతరింతును.

జి) ధర్మము తన ననుసరించు వారిని తల్లివలె పరమప్రేమతో కాపాడును. ధర్మము ననుష్ఠింపని మానవులు పశువులని మహాభారతము శాంతిపర్వమున చెప్పబడినది.

శ్లో॥ ఆహారనిద్రాభయమైథునం చ సామాన్యమేతత్పశుభిర్నరాణామ్।
**ధర్మో** హి తేషామధికో విశేషో ధర్మేణ హీనాః పశుభిస్సమానాః॥

ఆహారనిద్రాభయమైథునములు మనుష్యులకు పశువులకు సమానముగ నున్నవి కాని **ధర్మము**నునది మనుష్యులకు విశిష్టముగ నున్నది. ధర్మము లేనివారు పశువులతో సమానులు.

హెచ్) వేదశాస్త్రములయందు ధర్మమునకు అధికప్రాముఖ్యమివ్వబడినది.

ప్రజలందఱు ధర్మబద్ధులై ప్రవర్తింపవలయునని వేదము ఘోషించుచున్నది. తైత్తిరీయోపనిషత్తు – శిక్షావల్లి – ఏకాదశానువాకము శిష్యానుశాసనము ఇట అనుసంధానము చేసికొనదగును.

**"వేదమనూచ్యాచార్యోఽ న్తేవాసినమనుశాస్తి। సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజా తంతుం మా వ్యవచ్ఛేత్సీః సత్యాన్న ప్రమదితవ్యం ధర్మాన్న ప్రమదితవ్యం కుశలా న్న ప్రమదితవ్యం భూత్యై న ప్రమదితవ్యం స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం, దేవ పితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం మాతృదేవో భవ పితృదేవో భవ ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ।**

ఆచార్యుడు వేదమును అధ్యయనము చేయించి శిష్యుని ఇట్లు శాసింపవలయును.
సత్యమును పలుకుము.
ధర్మమును ఆచరింపుము.
వేదాధ్యయనమునుండి ఏమరకుము...
సత్యమునుండి ఏమరుపాటు చెందరాదు...
ధర్మానుష్ఠానమునుండి ఏమరుపాటు చెందరాదు...
తల్లియే దైవముగ గలవాడివిగ అగుము.
తండ్రియే దైవముగ గలవాడివిగ అగుము.
ఆచార్యుడే దైవముగ గలవాడివిగ అగుము.
అతిథియే దైవముగ గలవాడివిగ అగును.

**ఐ) ధర్మము :–** శరీరముచేత, వాక్కుచేత, మనస్సుచేత ఇంకను పెక్కింటిచేత సాధింపబడును. అన్నింటిలోను శరీరము ముఖ్యము. 'శీర్యత ఇతి శరీరమ్' అని ఉత్పత్తి. 'శుష్కించిపోవునది శరీరము' అని చెప్పబడుటచే శిథిలముగాకుండ కడు జాగరూకతతో శరీరమును కాపాడుకొనవలయును. శరీరమున్ననే 'ధర్మార్థ కామమోక్షము'లను చతుర్విధపురుషార్థములను సాధింపవీలగును. కనుకనే 'సర్వత ఆత్మానం గోపాయేత్' అని శ్రుతి యందు చెప్పబడినది. విపుల వివరములకై 'కథాపుష్కరిణి' 1–4 భాగములు చూడగలరు.

"ధర్మస్తు శరీరేణ వాచా బుద్ధ్యా ధనాదినా చ బహుభిః సాధ్యతే, తేషు చ శరీరమేవ ముఖ్యం సాధనమ్"।





**అలంకారాలు:–** ఇట 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. ఇందు సామాన్యముచే విశేషము సమర్థింపబడినది.

'శరీరము ధర్మసాధనములలో మొదటిది గదా' యను సామాన్యముచే 'నీ సామర్థ్యము ననుసరించే తపము చేయుటయందు ప్రవర్తించుచుంటివా' యను విశేషము సమర్థింపబడినది.

---

**శ్లో॥ అపి త్వదావర్జితవారిసంభృతం**
**ప్రవాలమాసామనుబంధి వీరుధామ్।**
**చిరోజ్ఝితాలక్తకపాటలేన తే**
**తులాం యదారోహతి దన్తవాససా॥ 34**

**పదవిభాగము :–** అపి, త్వత్ + ఆవర్జితవారిసంభృతమ్, ప్రవాలమ్, ఆసామ్, అనుబంధి, వీరుధామ్, చిరోజ్ఝితాలక్తకపాటలేన, తే, తులామ్, యత్, ఆరోహతి, దన్తవాససా॥

**అన్వయక్రమము :–** త్వదావర్జితవారిసంభృతమ్ ఆసాం వీరుధాం ప్రవాలమ్ అనుబంధి అపి యత్ చిరోజ్ఝితాలక్తకపాటలేన తే దంతవాససా తులామ్ ఆరోహతి।

**ప్రతిపదార్థము :–** త్వత్ – ఆవర్జిత – వారి – సంభృతమ్ – నీచేత పోయబడిన నీటిచేత పుట్టించబడిన, ఆసామ్ – ఈ, వీరుధామ్ – లతలయొక్క, ప్రవాలమ్ – చిగురాకు, అనుబంధి + అపి – పలురీతులలో వర్ధిల్లుచున్నది గదా? యత్ – ఏ చిగురాకు, చిర – ఉజ్ఝిత – అలక్తక – పాటలేన – చిరకాలమునుండి విడువబడిన లత్తుకరంగు పూతకలదగుటచే ఇంచుక ఎఱ్ఱదనముకల, తే – నీయొక్క, దంతవాసనా – అధరముతో, తులామ్ – సామ్యమును, ఆరోహతి – పొందుచున్నదో.

**తాత్పర్యము :–** నీచేత పోయబడిన నీటిచేత పుట్టింపబడిన ఈ లతలయొక్క చిగురాకు పలురీతులలో వర్ధిల్లుచున్నదిగదా? ఏ చిగురాకు చిరకాలమునుండి విడువబడిన లత్తుకరంగు పూతకలదగుటచే ఇంచుక ఎఱ్ఱదనముగల నీ యొక్క అధరముతో సామ్యమును పొందుచున్నదో.

**పాఠాన్తరాలు :–** 1. అపి – అయి

**విభక్తులు/క్రియలు :–** 1. త్వ...సంభృతమ్ – ...**సంభృతమ్,** ...సంభృతే, ...సంభృతాని; అకారాన్త నపుంసకలింగ ...సంభృతశబ్దము. ప్ర.ఏ 2. ఆసామ్ – అస్యాః, అనయోః, **ఆసామ్** ; మకారాన్త స్త్రీలింగ 'ఇదమ్'శబ్దము. ష.ఏ 3. వీరుధామ్ – వీరుధః, వీరుధోః, **వీరుధామ్**; దకారాన్త స్త్రీలింగ 'వీరుధ్'శబ్దము. ష.బ 4. ప్రవాలమ్ – **ప్రవాలమ్,** ప్రవాలే, ప్రవాలాని; అకారాన్త నపుంసకలింగ ప్రవాలశబ్దము. ప్ర.ఏ 5. అనుబంధి – **అనుబంధి,** అనుబన్ధినీ, అనుబన్ధీని; ఇకారాన్త నపుంసకలింగ అనుబంధిశబ్దము. 6. యత్ – **యత్,** యే, యాని; దకారాన్త నపుంసకలింగ యద్‌శబ్దము. ప్ర.ఏ 7. చిర...పాటలేన – **...పాటలేన,** ...పాటలాభ్యామ్, ...పాటలైః; అకారాన్త నపుంసకలింగ ...పాటలశబ్దము. తృ.ఏ 8. తే – **తే,** యువయోః, యుష్మాకమ్ ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 9. దన్తవాససా – దన్తవాససా, దన్తవాసోభ్యామ్, దన్తవాసోభిః; సకారాన్త పుంలింగ దన్తవాసశ్శబ్దము. తృ.ఏ 10. తులామ్ – **తులామ్,** తులే, తులాః; ఆకారాన్త స్త్రీలింగ తులాశబ్దము. ద్వి.ఏ 11. ఆరోహతి – క్రియ – లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు :–**

1. త్వదావర్జితవారిసంభృతమ్ – త్వయా ఆవర్జితమ్ (తృ.త.) త్వదావర్జితమ్, త్వదావర్జితఞ్చ తత్ వారి (కర్మధా.) త్వదావర్జితవారి త్వదావర్జితావారిణా సంభృతమ్ (తృ.త.)।
2. చిరోజ్ఝితాలక్తకపాటలేన – చిరమ్ ఉజ్ఝితః (సుప్సుపా) చిరోజ్ఝితః చిరోజ్ఝితః అలక్తకః యేన (బహువ్రీహి) తత్ చిరోజ్ఝితాలక్తకం చ తత్ పాటలం చ (కర్మధా.)తేన।
3. దన్తవాససా – దన్తాన్ వస్తే – (ఉపపదతత్పు.) ఇతి దన్తవాసః, తేన।

**సంధులు :–**

1. యత్ + ఆరోహతి – యదారోహతి – జశ్త్వసన్ధిః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. దంతవాసాః :–** (పుం.)

ఎ) దన్తస్య వాసో వస్త్రమివావరకత్వాత్। ఓష్ఠః

బి) "శ్లో॥ అధరో దన్తచ్ఛద ఓష్ఠ ఉచ్యతే దన్తవాసశ్చ"॥ 524
అని హలాయుధకోశము '4' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ భాతు నామ సుదృశాం దశనాఙ్కః పాటలో ధవలగణ్డతలేషు।
**దన్తవాససి** సమానగుణశ్రీః సమ్ముఖోఽపి పరభాగమవాప॥
శిశుపాలవధే – 10–85





**అలంకారములు :–** ఇందు 'ప్రతీపాలంకార'మున్నదని చెప్పదగును.

"ప్రతీపముపమానస్యోపమేయత్వప్రకల్పనమ్" అని చంద్రాలోకమున లక్షణమీయబడినది.

ఉపమానముగా ప్రసిద్ధమైన దానిని ఉపమేయముగా కల్పించినయెడల 'ప్రతీపాలంకార'మగునని లక్షణము.

ఇట 'లతలయొక్క చిగురాకు' ఉపమేయము. సహజారుణమగు పార్వతీదేవి యధరము ఉపమానము. ఇందు ప్రసిద్ధోపమానమగు ప్రవాలము (చిగురాకు) నకు ఉపమేయత్వము వర్ణింపబడుటచేత 'ప్రతీపాలంకార'మగుచున్నది.

**క్రియాదర్శము :– ఆరోహతి :–** ఆఙ్ – ఉపసర్గ, రుహ – బీజజన్మని – ప్రాదుర్భావే చ, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్(1), లట్ – ప్రథముపురుషైక వచనాంతః।

**రూపాలు :– ఆరోహతి** – ఆరోహతః – ఆరోహన్తి.

---

**శ్లో॥ అపి ప్రసన్నం హరిణేషు తే మనః**
**కరస్థదర్భప్రణయాపహారిషు।**
**య ఉత్పలాక్షి! ప్రచలైర్విలోచనై–**
**స్తవాక్షిసాదృశ్యమివ ప్రయుంజతే॥ 35**

**పదవిభాగము :–** అపి, ప్రసన్నమ్, హరిణేషు, తే, మనః, కరస్థదర్భప్రణయాపహారిషు, యే, ఉత్పలాక్షి ! ప్రచలైః, విలోచనైః, తవ, అక్షిసాదృశ్యమ్, ఇవ, ప్రయుంజతే।

**అన్వయక్రమము :–** కరస్థదర్భప్రణయాపహారిషు హరిణేషు తే మనః ప్రసన్నమ్ అపి ఉత్పలాక్షి! యే ప్రచలైః విలోచనైః తవ అక్షిసాదృశం ప్రయుంజతే ఇవ।

**ప్రతిపదార్థము :–** కరస్థ – దర్భ – ప్రణయ – అపహారిషు = చేతియందున్న దర్భలను పరిచయముతో లాగికొని పోవుచున్న, హరిణేషు – లేళ్లయందు, తే – నీయొక్క, మనః – మనస్సు, ప్రసన్నమ్ + అపి – అనుగ్రహపూర్ణమైయున్నది గదా! ఉత్పలాక్షి! – నల్లకలువలను బోలు కన్నులు గలదానా! యే – ఏ లేళ్లు, ప్రచలైః – చంచలములైన, విలోచనైః – కన్నులచేత, తవ – నీయొక్క, అక్షిసాదృశ్యమ్ – కన్నులపోలికను, ప్రయుంజతే ఇవ – అభినయించుచున్నవి వలె నున్నవో.

**తాత్పర్యము :–** చేతియందున్న దర్భలను పరిచయముతో లాగికొనిపోవుచున్న లేళ్లయందు నీ మనసు అనుగ్రహపూర్ణమై యున్నదిగదా? కలువకంటీ! ఏ లేళ్లు చంచలములైన కన్నులచేత నీ కన్నుల పోలికను అభినయించుచున్నవి వలెనున్నవో.

**పాఠాన్తరాలు :–** 1. అపహారిషు – అపరాధిషు; 2. ఉత్పలాక్షి ప్రచలైః – ఉత్పలాక్షేపచలైః; 3. సాదృశ్యమ్ – సాపత్న్యమ్.

**విభక్తులు/క్రియలు:–** 1. కరస్థ...అపహారిషు –...అపహారౌ, ...అపహార్యోః, **...అపహారిషు**; ఇకారాన్త పుంలింగ ...అపహారిశబ్దము. స.బ 2. హారిణేషు – హారిణే, హారిణయోః, **హారిణేషు** ; అకారాన్త పుంలింగ హారిణశబ్దము. స.బ 3. తే – **తే,** యువయోః, యుష్మాకమ్, ; దకారాన్త స్త్రీలింగో యుష్మచ్ఛబ్దము. ష.ఏ 4. మనః – **మనః**, మనసీ, మనాంసి; సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము. ప్ర.ఏ 5. ప్రసన్నమ్ – **ప్రసన్నమ్,** ప్రసన్నే, ప్రసన్నాని; అకారాన్త నపుంసకలింగ ప్రసన్నశబ్దము. ప్ర.ఏ 6. ఉత్పలాక్షి – **హే ఉత్పలాక్షి,** హే ఉత్పలాక్ష్యౌ, హే ఉత్పలాక్ష్యః; ఈకారాన్త స్త్రీలింగ ఉత్పలాక్షీశబ్దము (గౌరీశబ్దవత్) సం.ప్ర.ఏ 7. యే – యః, యౌ, **యే;** దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ప్ర.బ 8. ప్రచలైః – ప్రచలేన, ప్రచలాభ్యామ్, **ప్రచలైః;** అకారాన్త నపుంసకలింగ ప్రచలశబ్దము. తృ.బ 9. విలోచనైః– విలోచనేన, విలోచనాభ్యామ్, **విలోచనైః;** అకారాన్త నపుంసకలింగ విలోచనశబ్దము. తృ.బ 10. తవ – **తవ,** యువయోః, యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 11. అక్షిసాదృశ్యమ్ – **అక్షిసాదృశ్యమ్**, అక్షిసాదృశ్యే, అక్షిసాదృశ్యాని; అకారాన్త నపుంసకలింగ అక్షిసాదృశ్యశబ్దము. ద్వి.ఏ 12. ప్రయుంజతే – క్రియ – లట్ .ప్ర.బ 13. అపి, ఇవ – అవ్యయాలు

**సమాసాలు :–**

1. కరస్థదర్భప్రణయాపహారిషు – కరే తిష్ఠన్తి (ఉపపదతత్పు.) ఇతి కరస్థాః, కరస్థాశ్చ తే దర్భాః (కర్మధా.) కరస్థదర్భాః, ప్రణయేనాపహరన్తీతి (ఉపపదతత్పు.) ప్రణయాపహారిణః, కరస్థదర్భాణాం ప్రణయాపహారిణః (ష.త.), తేషు।
2. ఉత్పలాక్షి – ఉత్పలే ఇవ అక్షిణీ యస్యాః (బహుర్వీహి) సా, తత్సమ్బుద్ధౌ।
3. అక్షిసాదృశ్యమ్ – అక్ష్ణోః సాదృశ్యమ్ (ష.త.) అక్షిసాదృశ్యమ్.

**సంధులు :–**

1. యే + ఉత్పలాక్షి – య ఉత్పలాక్షి
2. ప్రచలైః + విలోచనైః – ప్రచలైర్విలోచనైః – విసర్గసన్ధిః (రుత్వమ్)।
3. విలోచనైః + తవ – విలోచనైస్తవ – విసర్గసన్ధిః (సకారాదేశః)।
4. తవ + అక్షిసాదృశ్యమ్ – తవాక్షిసాదృశ్యమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ప్రసన్నమ్ :–**

శ్లో॥ ప్రసన్నదిక్పాంసువివిక్తవాతం శఙ్ఖస్వనానన్తరపుష్పవృష్టి।
శరీరిణాం స్థావరజఙ్గమానాం సుఖాయ తజ్జన్మదినం బభూవ॥
– కు.సం. 1–23

వివరములకు 'మృణాళినీ' వ్యాఖ్య చూడగలరు.

శ్లో॥ మయా **ప్రసన్నేన** తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥ – భ.గీ 11–47

'ఓ అర్జునా నీయెడ ప్రసన్నుడనైన నాచేత నా యోగశక్తిప్రభావముతో నీకు ఈ విరాట్ రూపమును ప్రదర్శించితిని. అది మిక్కిలి తేజోమయమైనది. అనంతమైనది. ఆద్యమైనది. దీనిని నీవు తప్ప ఇతరులు ఇంతకుముందు చూచియుండలేదు."

శ్లో॥ వ్యపదేశమావిలయితుం కిమీహసే జనమిమం చ పాతయితుమ్।
కూలఙ్కషేవ సిన్ధుః **ప్రసన్న**మమ్భస్తటరుహఞ్చ॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే –5–21

శ్లో॥ గమ్భీరాయాః పయసి సరితశ్చేతసీవ **ప్రసన్నే**
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశమ్।
తస్మాదస్యాః కుముదవిశదాన్యర్హసి త్వం న ధైర్యా-
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని॥
– మేఘదూతమ్ –40

మరిన్ని వివరములకు 'మృణాళినీ వ్యాఖ్య' చూడగలరు.

శ్లో॥ **అపి ప్రసన్నేన** మహర్షిణా త్వం
సమ్యగ్వినీయానుమతో గృహాయ।
కాలో హ్యయం సంక్రమితుం ద్వితీయం
సర్వోపకారక్షమమాశ్రమం తే ॥ – ర.వం. 5–10

"నీవు అనుగ్రహోన్ముఖుడయిన వరతన్తు ఋషీశ్వరునిచేత బాగుగా శిక్షించి గృహస్థాశ్రమస్వీకారముకొఱకు అనుమతింపబడినావా ఏమి?..."

3. అస్రోత్తరమ్ – అస్రాణి ఉత్తరాణి యస్మిన్ (బహువ్రీహి) తద్ యథా స్యాత్తథా।
4. తదవగ్రహక్షతామ్ – తస్య అవగ్రహః (ష.త.) తదవగ్రహః, తేన క్షతా (తృ.త.) తామ్।

**సంధులు :–**

1. సః + ప్రార్థితదుర్లభః – స ప్రార్థితదుర్లభః – సులోపః।
2. సఖీభిః + అస్రోత్తరమ్ – సఖీభిరస్రోత్తరమ్ – విసర్గసన్ధిః(రుత్వమ్)।
3. వృషా + ఇవ – వృషేవ – గుణసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సీతా** – (స్త్రీ.)

ఎ) సినోతీతి, షిఞ్ బన్ధనే + 'బాహులకాత్ క్త దీర్ఘశ్చ'। లాంగలరేఖయా సినోతి ఖనతి భూమిమ్, షిఞ్ బన్ధనే క్త, నిపాతనాత్ దీర్ఘః సీతా దన్త్యసాదిః, శేతే భువి ఇతి శీతా, తాలవ్యశాదిశ్చ। లాంగలపద్ధతిః।

బి) హలాయుధకోశవ్యాఖ్యానకారుడు ఈ పదవివరణ సందర్భమున ఈ శ్లోకమునే ఉదాహరించినాడు.

సి) Name of the daughter of Janaka, king of Mithila, and wife of Rama; She was so called because she was supposed to have sprung from a furrow made by king Janaka while ploughing the ground to prepare it for a sacrifice which he had instituted to obtain progeny, and hence also her epithets, అయోనిజ, ధరాపుత్రి. – ఆప్టే మహాశయుడు.

డి) శ్లో॥ ...స్యాత్ సీతా లాంగులపద్ధతిః। – అని హలాయుధకోశము

ఇ) శ్లో॥ **సీతాద్రవ్యాపహరణే** వస్త్రాణామౌషధస్య చ।
కాలమాసాద్య కార్యం చ రాజా దండం ప్రకల్పయేత్॥
– మనుస్మృతి 9–293

**అలంకారములు :–**

1. ఇందు 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.
'వృషేవ సీతాం...' అని చెప్పబడుటచే ఉపమాలంకారము.
ఉపమానము – నాగేటి చాలుము
ఉపమేయము – పార్వతీదేవి
సమానధర్మము – అనుగ్రహించుట
ఉపమావాచకము – ఇవ (వలె)





2) తదర్థకతపఃకృశామ్ – బింబము (పార్వతీదేవి) – సఖీమ్
తత్కృతావగ్రహక్షతామ్ – ప్రతిబింబము (నాగేటి చాలుము) – సీతామ్
సఖీభిరస్రోత్తరమీక్షితామ్, ప్రార్థితదుర్లభః – ఇవ ఉభయాన్వయములు, శ్లిష్టములు
సః –(పినాకపాణిః) – బింబము
వృషా – (ఇంద్రః) – ప్రతిబింబము
కనుక ఈ శ్లోకమున అనుగామిత్వ – బింబ ప్రతిబింబ భావ – శ్లేషలకు మిశ్రణము గలదు.

**క్రియాదర్శము :–**

1. **అభ్యుపపత్స్యతే** – అభి, ఉప – ఉపసర్గలు, 'పద – గతౌ' లృట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**అభ్యుపపత్స్యతే** – అభ్యుపపత్స్యేతే – అభ్యుపపత్స్యన్తే.
2. **వేద్మి** – 'విద – జ్ఞానే' లట్ – ఉత్తమపురుషైకవచనాంతః।
**వేద్మి** – విద్వః – విద్మః

---

శ్లో॥ **అగూఢసద్భావమితీఙ్గితజ్ఞయా
నివేదితో నైష్ఠికసున్దరస్తయా।
అయీదమేవం పరిహాస ఇత్యుమా–
మపృచ్ఛదవ్యఞ్జితహర్షలక్షణః॥ 62**

**పదవిభాగము :–** అగూఢసద్భావమ్, ఇతి, ఇఙ్గితజ్ఞయా, నివేదితః, నైష్ఠికసున్దరః, తయా, అయి, ఇదమ్, ఏవమ్, పరిహాసః, ఇతి, ఉమామ్, అపృచ్ఛత్, అవ్యఞ్జితహర్షలక్షణః।

**అన్వయక్రమము :–** ఇంగితజ్ఞయా తయా ఇతి అగూఢసద్భావం నివేదితః నైష్ఠికసుందరః అవ్యఞ్జితహర్షలక్షణః అయి! ఇదమ్ ఏవం పరిహాసః ఇతి ఉమామ్ అపృచ్ఛత్।

**ప్రతిపదార్థము :–** ఇంగితజ్ఞయా – పార్వతీదేవి మనస్సును ఎఱిగినదైన, తయా – ఆ సఖిచేత, ఇతి – ఈ రీతిగ, అగూఢసద్భావమ్ – వెల్లడింపబడిన మంచి యభిప్రాయముగలుగునట్లుగా, నివేదితః – తెలియజేయబడినవాడై, నైష్ఠికసుందరః

– యావజ్జీవ బ్రహ్మచారిఐన యా అందగాడు, అవ్యఞ్జితహర్షలక్షణః – వెల్లడింపని సంతోషచిహ్నములు గలవాడై, అయి! – ఓ పార్వతీ! ఇదమ్ – ఈ సఖి చెప్పిన మాట , ఏవమ్ – నిజమా?, పరిహాసః – పరిహాసమునకా?, ఇతి – అని, ఉమామ్ – పార్వతీదేవిని, అపృచ్ఛత్ – అడిగెను.

**తాత్పర్యము :–** పార్వతీదేవి మనస్సును ఎఱిగినదైన ఆ సఖిచేత ఈ రీతిగ వెల్లడింపబడిన మంచి యభిప్రాయము గలుగునట్లుగా తెలియజేయబడినవాడై యావజ్జీవ బ్రహ్మచారి ఐన యా యందగాడు వెల్లడింపని సంతోషచిహ్నములు గలవాడై 'ఓ పార్వతీ! ఈ సఖి చెప్పినమాట నిజమా లేక పరిహాసమునకా?' అని పార్వతీదేవిని అడిగెను.

**పాఠాన్తరాలు :–** 1. అయిాద. – అపాద.

**విభక్తులు/క్రియలు :–** 1. ఇంగితజ్ఞయా –**...జ్ఞయా,** ...జ్ఞాభ్యామ్, ...జ్ఞాభిః; ఆకారాన్త స్త్రీలింగ 'ఇంగితజ్ఞా'శబ్దము. తృ.ఏ 2. తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 3. ఇతి, అయి – అవ్యయాలు 4. అగూఢసద్భావమ్ – క్రియావిశేషణము 5. నివేదితః – **నివేదితః,** నివేదితౌ, నివేదితాః; అకారాన్త పుంలింగ నివేదితశబ్దము. ప్ర.ఏ 6. నైష్ఠికసుందరః – **...సుందరః,** ...సుందరౌ, ...సుందరాః; అకారాన్త పుంలింగ...సుందరశబ్దము. ప్ర.ఏ 7. అవ్యఞ్జితహర్షలక్షణః – **...లక్షణః,** ...లక్షణౌ, ...లక్షణాః; అకారాన్త పుంలింగ ...లక్షణశబ్దము. ప్ర.ఏ 8. ఇదమ్ – **ఇదమ్,** ఇమే, ఇమాని; మకారాన్త నపుంసకలింగ ఇదమ్‌శబ్దము. ప్ర.ఏ 9. ఏవమ్ – అవ్యయము 10. పరిహాసః – **పరిహాసః,** పరిహాసౌ, పరిహాసాః ; అకారాన్త పుంలింగ పరిహాసశబ్దము. ప్ర.ఏ 11. ఉమామ్ – **ఉమామ్,** ఉమే, ఉమాః; ఆకారాన్త స్త్రీలింగ ఉమాశబ్దము. ద్వి.ఏ 12. అపృచ్ఛత్ – క్రియ

**సమాసాలు / విగ్రహవాక్యాలు :–**

1. అగూఢసద్భావమ్ – న గూఢః – అగూఢః (నఞ్‌తత్పు.), అగూఢః సద్భావః యస్మిన్ కర్మణి యథా భవతి తత్తథా – క్రియావిశేషణము.
2. ఇంగితజ్ఞయా – ఇంగితం జానాతీతి ఇంగితజ్ఞా, తయా।
3. నైష్ఠికసుందరః – నైష్ఠికః చాసౌ సుందరః (కర్మధా.) నైష్ఠికసుందరః।
4. అవ్యంజితహర్షలక్షణః – న వ్యంజితమ్ – అవ్యంజితమ్ (నఞ్‌తత్పు.) హర్షస్య లక్షణమ్, హర్షలక్షణమ్ (ష.త.) అవ్యంజితం హర్షలక్షణం యస్య సః (బహువ్రీహి), అవ్యంజితహర్షలక్షణః।

**సంధులు :–**

1. నివేదితః + నైష్ఠికసుందరః – నివేదితో నైష్ఠికసుందరః – ఉత్వాదేశః।

83



2. నైష్ఠికసుందరః + తయా – నైష్ఠికసుందరస్తయా–విసర్గసన్ధిః–సకారాదేశః।
3. అయి + ఇదమ్ – అయీదమ్ – సవర్ణదీర్ఘసన్ధిః।
4. పరిహాసః + ఇతి – పరిహాస ఇతి – విసర్గలోపః।
5. ఇతి + ఉమామ్ – ఇత్యుమామ్ – యణాదేశసన్ధిః।
6. అపృచ్ఛత్ + అవ్యంజిత... – అపృచ్ఛదవ్యంజిత... – జశ్త్వమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అయి** – అవ్యయకోశము (108)

ప్రశ్నానురాగాదిష్వపి దృశ్యతే।

1. సంబోధనే – 'అయి విజహీహి దృఢోపగూహనమ్'।
2. అనునయే – ఎ) 'అయి ఘనోరు! పదాని శనైః శనైః' – (వేణీసంహారే)।
   బి) 'అయి సాహసకారిణి –' (రత్నావలీ)।
3. ప్రశ్నే – 'అయి కఠోర యశః కిల తే ప్రియమ్?'।
4. అనురాగే – 'అయి జీవితనాథ జీవసి –' కుమారసమ్భవే 4–3

**2. నైష్ఠికసుందరః –**

ఎ) 'యావజ్జీవం బ్రహ్మచర్యాశ్రమే ఏవ స్థితః తదుక్తమ్ –

"నైష్ఠికో బ్రహ్మచారీ తు వసేదాచార్యసన్నిధౌ।
తదభావేఽస్య తనయే పత్న్యాం వైశ్వానరేఽపి వా॥

– ఇతి యాజ్ఞవల్క్యస్మృతిః 1–49

బి) నైష్ఠికో నైష్ఠికబ్రహ్మచారీ। ఉపకుర్వాణో నైష్ఠికః చేతి ద్వివిధో బ్రహ్మచారీ। తత్ర గృహస్థాద్యాశ్రమేష్వపి య ఉపకరోతి స **ఉపకుర్వాణః।** యః తు బ్రహ్మచర్యాశ్రమ మాత్రేణ నిష్ఠాం ప్రాప్నోతి స **నైష్ఠికః।**

సి) నైష్ఠికః చాసౌ సుందరః చేతి నైష్ఠికసుందరః। సుందరశబ్దేనాత్ర కాముకత్వం లక్ష్యతే। పరస్పరవిరుద్ధం నైష్ఠికత్వం సుందరత్వం చ పరమేశ్వర ఏవోపపద్యతే। – 'వివరణమ్' వ్యాఖ్యనుండి.

**క్రియాదర్శము :– అపృచ్ఛత్ –** 'ప్రచ్ఛ – జ్ఞీప్సాయామ్ ' (అడుగుట) ద్వికర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాది ప్రకరణమ్ (6). లఙ్, ప్రథమపురుషైకవచనాంతః। **అపృచ్ఛత్** – అపృచ్ఛతామ్ – అపృచ్ఛన్.

---

**శ్లో॥ అథాగ్రహస్తే ముకులీకృతాఙ్గులౌ**
**సమర్పయన్తీ స్ఫటికాక్షమాలికామ్।**
**కథఞ్చిదద్రేస్తనయా మితాక్షరం**
**చిరవ్యవస్థాపితవాగభాషత। 63**

**పదవిభాగము :–** అథ, అగ్రహస్తే, ముకులీకృతాఙ్గులౌ, సమర్పయన్తీ, స్ఫటికాక్షమాలికామ్, కథఞ్చిత్, అద్రేః, తనయా, మితాక్షరమ్, చిరవ్యవస్థాపితవాక్, అభాషత।

**అన్వయక్రమము :–** అథ అద్రేః తనయా ముకులీకృతాంగులౌ అగ్రహస్తే స్ఫటికాక్షమాలికాం సమర్పయన్తీ కథంచిత్ చిరవ్యవస్థాపితవాక్ మితాక్షరమ్ అభాషత।

**ప్రతిపదార్థము :–** అథ – అంతట, అద్రేః – హిమవంతునియొక్క, తనయా – కూతురు, ముకులీకృంతాంగుళౌ – మొగ్గగా చేయబడిన వ్రేళ్లుగల, అగ్రహస్తే – ముంజేతియందు, స్ఫటికాక్షమాలికామ్ – స్ఫటికములచే చేయబడిన జపమాలను, సమర్పయన్తీ – ఉంచుచున్నదై, కథంచిత్ – ఎట్లాగో, చిరవ్యవస్థాపితవాక్ – చాలాసేపటికి మాటలాడుటకుపక్రమించినదై, మితాక్షరమ్ – కొంచెమైన వర్ణములు గలుగునట్లుగ, అభాషత – మాటలాడెను.

**తాత్పర్యము :–** అంతట హిమవంతునియొక్క కూతురు మొగ్గగాచేయబడిన వ్రేళ్లుగల ముంజేతియందు స్ఫటికములచే చేయబడిన జపమాలను ఉంచుచున్నదై, ఎట్లాగో చాలాసేపటికి మాటలాడుటకుపక్రమించినదై కొంచెమైన వర్ణములుగలుగునట్లుగ మాటలాడెను.

**పాఠాన్తరాలు :–** 1. మాలికామ్ – మణ్డలమ్।

**విభక్తులు/క్రియలు :–** 1.అథ, కథంచిత్ – అవ్యయాలు 2. అద్రేః – **అద్రేః,** అద్ర్యోః, అద్రీణామ్; ఇకారాన్త పుంలింగ అద్రిశబ్దము. ష.ఏ 3. తనయా – **తనయా,** తనయే, తనయాః; ఆకారాన్త స్త్రీలింగ తనయాశబ్దము. ప్ర.ఏ 4. ముకులీకృతాంగుళౌ –**...అంగుళౌ,** ...అంగుళ్యోః, ...అంగుళిషు; ఇకారాన్త పుంలింగ ...అంగుళిశబ్దము. స.ఏ 5. అగ్రహస్తే – **అగ్రహస్తే,** అగ్రహస్తయోః, అగ్రహస్తేషు; ఇకారాన్త పుంలింగ అగ్రహస్త శబ్దము. స.ఏ 6. స్ఫటికాక్షమాలికామ్ – ...**మాలికామ్**, ...మాలికే, ...మాలికాః; ఆకారాన్త స్త్రీలింగ...మాలికాశబ్దము. ద్వి.ఏ 7. సమర్పయన్తీ – సమర్పయన్తీ, సమర్పయన్త్యౌ, సమర్పయన్త్యః; ఈకారాన్త స్త్రీలింగ సమర్పయన్తీశబ్దము. ప్ర.ఏ 8. చిరవ్యవస్థాపితవాక్ –...వాక్, ...వాచౌ, ...వాచః; చకారాన్త స్త్రీలింగ...వాక్శబ్దము. ప్ర.ఏ 9. మితాక్షరమ్ – మితాక్షరమ్, మితాక్షరే , మితాక్షరాణి ; అకారాన్త నపుంసకలింగ మితాక్షరశబ్దము. ప్ర.ఏ 10. అభాషత – క్రియ



**సమాసాలు :–**

1. ముకులీకృతాంగుళౌ – ముకులీకృతా అంగుళయః యస్మిన్ (బహువ్రీహి) సః, ముకులీకృతాంగుళిః, తస్మిన్।
2. అగ్రహస్తే – అగ్రః చాసౌ హస్తః (కర్మధా.) అగ్రహస్తః, తస్మిన్।
3. స్ఫటికాక్షమాలామ్ – స్ఫటికానామ్ అక్షమాలికా (ష.త.) స్ఫటికాక్షమాలికా, తామ్।
4. చిరవ్యవస్థాపితవాక్ – చిరేణ వ్యవస్థాపితాః వాచః యయా (బహువ్రీహి) సా।
5. మితాక్షరమ్ – మితాని అక్షరాణి యస్మిన్ (బహువ్రీహి) తత్।

**సంధులు :–**

1. అథ + అగ్రహస్తే – అథాగ్రహస్తే – సవర్ణదీర్ఘసన్ధిః।
2. అద్రేః + తనయా – అద్రేస్తనయా – విసర్గసన్ధిః, సకారాదేశః।
3. ...వాక్ + అభాషత – ...వాగభాషత – జశ్త్వమ్

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అక్షరమ్** (నపుం.) –

ఎ) అశేః సరః – 3.7 ఇతి సరః।
అశూ వ్యాప్తౌ సంఘాతే చ స్వాది/ఆత్మనేపదీ/వేట్ + సరః। అశ్నుత ఇత్యక్షరమ్। వేదాది శాస్త్రాణి।

బి) శ్లో॥ అక్షరాణామకారోస్మి ద్వన్ద్వః సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః॥
– శ్రీమద్భగవద్గీత –10 –33

సి) శ్లో॥ ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామాః పరం తపః।
సావిత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే॥ – మనుస్మృతి 2–83
"ఓమను నొక యక్షరమే బ్రహ్మము. ప్రాణాయామములే గొప్ప తపస్సు. గాయత్రి కంటె మించిన మంత్రము లేదు. మౌనము కంటె సత్యము చెప్పుట మేలు."

డి) శ్లో॥ ముహు**రంగులి**సంవృతాధరోష్ఠం
ప్రతిషే**ధాక్షర**విక్లబాభిరామమ్।
ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం చుంబితం తు॥ – ఇతి అభిజ్ఞానశాకున్తలే 3–24

"మాటిమాటికి సిగ్గువలన చేతిప్రేళ్లచే అధరోష్ఠమును దాచుకొనుచున్నట్టియు, ముద్దిడబోవ, వలదువలదని మరొకవైపునకు తల త్రిప్పుకొనుచు **ముగ్ధభాష**, లొనర్చుచున్నట్టియు, ఆ పక్ష్మలాక్షియొక్క ముఖమే అతిప్రయాసతో పైకెత్తితినిగాని ముద్దిడుకొనుటకు ఏ మాత్రము వీలయినది కాదాయె."

ఇ) **అక్షరం** వర్ణనిర్మాణం వర్ణమప్యక్షరం విదుః।
**అక్షరం** న క్షరం విద్యాదశ్నోతేర్వా సరోఽక్షరమ్॥

ఎఫ్) లవః – (సగర్వమివ) అహో సం**దీపనాన్యక్షరాణి।** – ఉత్తరరామచరితే –4

**క్రియాదర్శము :– అభాషత** – భాష (భాష్) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాదిప్రకరణమ్(1), లఙ్ – ప్రథమపురుషైకవచనాంతః **అభాషత** – అభాషేతామ్ – అభాషన్త.

శ్లో॥ ఏతావదుక్త్వా విరతే మృగేన్ద్రే
ప్రతిస్వనేనాస్య గుహాగతేన।
శిలోచ్చయోఽపి క్షితిపాలముచ్చైః
ప్రీత్యా తమేవార్థమభాషతేవ॥ – ర.వం. 2–51

---

**శ్లో॥ యథా శ్రుతం వేదవిదాంవర! త్వయా**
**జనోఽయముచ్చైఃపదలంఘనోత్సుకః।**
**తపః కిలేదం తదవాప్తిసాధనం**
**మనోరథానామగతిర్న విద్యతే। 64**

**పదవిభాగము :–** యథా, శ్రుతమ్, వేదవిదాంవర!, త్వయా, జనః, అయమ్, ఉచ్చైఃపదలంఘనోత్సుకః, తపః, కిల, ఇదమ్, తత్ + అవాప్తిసాధనమ్, మనోరథానామ్, అగతిః, న, విద్యతే।

**అన్వయక్రమము :–** వేదవిదాంవర! త్వయా యథా శ్రుతమ్ అయం జనః ఉచ్చైః పదలంఘనోత్సుకః ఇదం తపః తదవాప్తిసాధనం కిల! మనోరథానామ్ అగతిః న విద్యతే।

**ప్రతిపదార్థము :–** వేదవిదాం వర! – వేదవేత్తలలో శ్రేష్ఠుడా!, త్వయా – నీచేత, యథా – ఎట్లు, శ్రుతమ్ – వినబడినదో, అయమ్ + జనః – ఈ ప్రాణి, ఉచ్చైః



పదలంఘనోత్సుకః – గొప్పదైన స్థానమును ఆక్రమించుటకు కోరియున్నది, ఇదమ్ తపః – ఇచ్చటి తపము, తదవాప్తిసాధణమ్ కిల– ఆ గొప్పదైన స్థానమును పొందుటకు సాధనము గదా!, మనోరథానామ్ – కోరికలకు, అగతిః – స్థానము లేకుండుట, న విద్యతే – ఉండదు గదా!

**తాత్పర్యము :–** వేదవేత్తలలో శ్రేష్ఠుడా! నీ చేత ఎట్లు వినబడినదో ఈ ప్రాణి గొప్పదైన స్థానమును ఆక్రమించుటకు కోరియున్నది. ఇచ్చటి తపము ఆ గొప్పదైన స్థానమును పొందుటకు సాధనము గదా! కోరికలకు స్థానము లేకుండుట ఉండదుగదా! (గొప్పదైనస్థానము – శివుని భర్తగా పొందుట)

**విభక్తులు/క్రియలు :–** 1. వేదవిదామ్ – వేదవిదః, వేదవిదోః, **వేదవిదామ్**; దకారాన్త పుంలింగ వేదవిచ్ఛబ్దము. ష.బ 2. త్వయా – **త్వయా**, యువాభ్యామ్, యుష్మాభిః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. తృ.ఏ 3. యథా, ఇదమ్, న, కిల – అవ్యయాలు (ఇదమ్ – అత్ర ఇత్యర్థే) 4. శ్రుతమ్ – **శ్రుతమ్**, శ్రుతే, శ్రుతాని ; అకారాన్త నపుంసకలింగ శ్రుతశబ్దము. ప్ర.ఏ 5. అయమ్ – **అయమ్,** ఇమౌ, ఇమే; మకారాన్త పుంలింగ ఇదమ్‌శబ్దము. ప్ర.ఏ 6. జనః – **జనః,** జనౌ, జనాః అకారాన్త పుంలింగ జనశబ్దము. ప్ర.ఏ 7. ఉచ్చైఃపదలంఘనోత్సుకః – **…ఉత్సుకః**, …ఉత్సుకౌ, …ఉత్సుకాః; అకారాన్త పుంలింగ …ఉత్సుకశబ్దము. ప్ర.ఏ 8. తపః – **తపః,** తపసీ, తపాంసి; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. ప్ర.ఏ 9. తదవాప్తిసాధనమ్ – …**సాధనమ్**, …సాధనే, …సాధనాని; అకారాన్త నపుంసకలింగ..సాధనశబ్దము. ప్ర.ఏ 10. మనోరథానామ్ – మనోరథస్య, మనోరథయోః, **మనోరథానామ్** అకారాన్త పుంలింగ మనోరథశబ్దము. ష.బ 11. అగతిః – **అగతిః**, అగతీ, అగతయః ఇకారాన్త స్త్రీలింగ అగతిశబ్దము. ప్ర.ఏ. (గమ్ + క్తిన్ – గతిః) 12. విద్యతే – క్రియ – లట్.

**సమాసాలు :–**

1. వేదవిదామ్ – వేదం వదన్తి (ఉపపదతత్పు.) ఇతి వేదవిదః। తేషామ్।
2. ఉచ్చైఃపదలంఘనోత్సుకః – ఉచ్చైశ్చ తత్పదమ్ (కర్మధా.) ఉచ్చైఃపదమ్, ఉచ్చైఃపదస్య లంఘనమ్ (ష.త.) ఉచ్చైఃపదలంఘనమ్, ఉచ్చైఃపదలంఘనే ఉత్సుకః (స.త.)।
3. తదవాప్తిసాధనమ్ – తస్య అవాప్తిః (ష.త.) తవాప్తేః సాధనమ్ (ష.త.) తత్।
4. అగతిః – న గతిః (నఞ్‌తత్పు.)।

**సంధులు :–**

1. జనః + అయమ్ – జనోఽయమ్ – ఉత్వాదేశః – పూర్వరూపసన్ధిః।

2. కిల + ఇదమ్ – కిలేదమ్ – గుణసన్ధిః।
3. అగతిః + న – అగతిర్న – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :-**

**1. ఉత్సుకః** (త్రి.)

ఎ) ఉత్ ఉద్యోగం సువతి స్తౌతి సునోతి వా। సు ప్రసవైశ్వర్యయోః। విచి సంజ్ఞాపూర్వకత్వాత్ గుణాభావః క్విపి ఆగమశాస్త్రస్యానిత్యత్వాత్ తుగభావో వా। తతః సంజ్ఞాయాం కన్। యద్వా ఉత్ సువతి, ఘూ – ప్రేరణే. మితద్రవాదిత్వాజ్ డు, సత్సూతి క్విప్ వా, కాని కేణ ఇతి హ్రస్వః। ఉత్ + సూ+ క్విప్ + కన్। వాంఛితకర్మోద్యతః।

బి) శ్లో॥ ... **ఉత్సుకః** ప్రసృతః స్మృతః॥ 353 – అని హలాయుధకోశము

సి) శ్లో॥ వత్సో**త్సుకా**పి స్తిమితా సపర్యాం
ప్రత్యగ్రహీత్సేతి ననన్దతుస్తౌ।
భక్త్యోపపన్నేషు హి తద్విధానాం
ప్రసాదచిహ్నాని పురః ఫలాని॥ – ర.వం 2–22

"ఆ నందినీధేనువు 'తన లేగదూడను చూడవలెను పాలీయవలెను' అని **ఉవ్విళ్లూరుచున్నప్పటికిని**, తనకు రాజదంపతులు చేయు పూజను ప్రశాంతముగా స్వీకరించెను..."

డి) ప్రసితోత్సుకాభ్యాం తృతీయా చ (సూ 2–3–44) కారకప్రకరణమ్. 'ఆభ్యాం యోగే తృతీయా స్యాచ్చాత్సప్తమీ। ప్రసిత ఉత్సుకో హరిణా హరౌ వా।
– పాణినిసూత్రవ్యాఖ్యా

శ్లో॥ మాముపాస్త దిదృక్షావాన్ యాష్టీకావ్యహేతో హరిః।
ఆజ్ఞాలాభ**ోత్సుకో** దూరాత్మాక్షేణానాదరేక్షితః॥ – ఇతి భట్టికావ్యే 5–24
ఆజ్ఞాలాభే ఉత్సుక ఇతి పూర్వవత్సమాసః।

**అలంకారములు:–** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. **సామాన్యమైన ఒక అర్థమును చెప్పి దానిచే విశేషార్థమునుగాని, విశేషము చెప్పి సామాన్యర్థమునుగాని సమర్థించుట।** అర్థాన్తరన్యాసాలంకార'మగును.

"మనోరథానామ్ అగతిః న విద్యతే" అను సామాన్యముచే ఇట 'తపః తదవాప్తిసాధనమ్ కిల'। అను విశేషము సమర్థింపబడినది.





శ్లో॥ **మనోరథానాం** న సమాప్తిరస్తి, వర్షాయుతైరప్యథవాపి లక్షైః।
పూర్ణేషు పూర్ణేషు పునర్నవానామ్, ఉత్పత్తయస్సన్తి **మనోరథానామ్॥**

కోరికలకు చాలిమి అనేది ఎన్నటికీ ఉండదు. వే యేండ్లకు కానిందు, లక్ష సంవత్సరాలకే కానిందు. కోరికలను తీరుస్తూన్న కొద్దీ మరల మరల క్రొత్త కోరికలు బైలుదేరుతూనే ఉంటాయి గదా!

శ్లో॥ స్వప్నో ను? మాయా ను? మతిభ్రమో ను?
క్లప్తం ను తావత్ఫలమేవ పుణ్యైః?।
అసన్నివృత్త్యై తదదీతమేవ
మనోరథానామతటఃప్రపాతః॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే

**క్రియాదర్శము :– విద్యతే** – విద (విద్) సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, దివాదిప్రకరణమ్(4), లట్ – ప్రథమపురుషైకవచనాంతః। **విద్యతే** – విద్యేతే – విద్యన్తే.

---

**శ్లో॥ అథాహ వర్ణీ విదితో మహేశ్వర–**
**స్తదర్థినీ త్వం పునరేవ వర్తసే।**
**అమఙ్గలాభ్యాసరతిం విచిన్త్య తం**
**తవానువృత్తిం న చ కర్తుముత్సహే॥ 65**

**పదవిభాగము :–** అథ, ఆహ, వర్ణీ, విదితః, మహేశ్వరః, తదర్థినీ, త్వమ్, పునః, ఏవ, వర్తసే, అమంగలాభ్యాసరతిమ్, విచిన్త్య, తమ్, తవ, అనువృత్తిమ్, న, చ, కర్తుమ్, ఉత్సహే।

**అన్వయక్రమము :–** అథ వర్ణీ ఆహ। మహేశ్వరః విదితః పునః ఏవ త్వం తదర్థినీ వర్తసే। అమంగలాభ్యాసరతిం తం విచిన్త్య తవ అనువృత్తిం కర్తుం న ఉత్సహే చ।

**ప్రతిపదార్థము :–** అథ – పిమ్మట, వర్ణీ – బ్రహ్మచారి, ఆహ – పలికెను, మహేశ్వరః – మహాదేవుడు, విదితః – తెలియబడినా, పునః ఏవ – మఱి, త్వమ్ – నీవు, తదర్థినీ – ఆయనను కోరుదానవుగా, వర్తసే – ఉన్నావు, అమంగల–అభ్యాస–రతిమ్ – అశుభమైన ఆచారమందు ఆసక్తిగలవాడైన, తమ్ – ఆ మహాదేవుని, విచిన్త్య –

తలంచి, తవ - నీయొక్క, అనువృత్తిమ్ - అనుసరణమును, కర్తుమ్ - చేయుటకు , న ఉత్సహేచ - ఉత్సహించను. (అంగీకరింపలేను)

**తాత్పర్యము :-** పిమ్మట, బ్రహ్మచారి పలికెను. మహాదేవుడు తెలియుచున్నాడు. మఱి నీవు ఆయనను కోరుదానవుగా ఉన్నావు. అశుభమైన ఆచారమందు ప్రీతిగలవాడైన ఆ మహాదేవుని తలంచి నీయొక్క అనుసరణమును చేయుటకు ఉత్సహించను.

**పాఠాన్తరాలు :-** 1. పునరేవ - పుర ఏవ 2. రతిమ్ - రతమ్ 3. చ - తు।

**విభక్తులు/క్రియలు :-** 1. అథ, పునః, ఏవ, న, చ - అవ్యయాలు 2. విచిన్త్య, కర్తుమ్ - అవ్యయాలు 3. వర్ణీ - **వర్ణీ,** వర్ణినౌ, వర్ణినః; నకారాన్త పుంలింగ వర్ణిన్‌శబ్దము. ప్ర.ఏ 4. **ఆహ** - క్రియ 5. మహేశ్వరః - **మహేశ్వరః**, మహేశ్వరౌ, మహేశ్వరాః ; అకారాన్త పుంలింగ మహేశ్వరశబ్దము. ప్ర.ఏ 6. విదితః - **విదితః,** విదితౌ, విదితాః; అకారాన్త పుంలింగ విదితశబ్దము. ప్ర.ఏ 7. త్వమ్ - **త్వమ్,** యువామ్, యూయమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ 8. తవ - **తవ,** యువయోః , యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ 9. తమ్ - **తమ్**, తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 10. తదర్థినీ - **తదర్థినీ**, తదర్థిన్యౌ, తదర్థిన్యః ఈకారాన్త స్త్రీలింగ తదర్థినీశబ్దము. ప్ర.ఏ 11. **వర్తసే**- క్రియ 12. అమంగలాభ్యాసరతిమ్ -...**రతిమ్**, ...రతీ, ...రతీన్; ఇకారాన్త పుంలింగ...రతిశబ్దము. ద్వి.ఏ 13. అనువృత్తిమ్ - **అనువృత్తిమ్**, అనువృత్తీ, అనువృత్తీః; ఇకారాన్త స్త్రీలింగ అనువృత్తిశబ్దము. ద్వి.ఏ 14. **ఉత్సహే** - క్రియ - ఉత్తమపురుషైకవచనాంతః - లట్.

**సమాసాలు :-**

1. మహేశ్వరః - మహాంశ్చాసౌ ఈశ్వరః (కర్మధా.) మహేశ్వరః।
2. తదర్థినీ - తమ్ అర్థయతే ( ఉపపదతత్పు.) తచ్ఛీలా।
3. అమంగలాభ్యాసరతిమ్ - న మంగలమ్ (నఞ్‌తత్పు.) అమంగలమ్, అమంగలస్య అభ్యాసః (ష.త.) అమంగలాభ్యాసః, అమంగలాభ్యాసే రతిః యస్య (బహువ్రీహి) సః, తమ్।

**సంధులు :-**

1. అథ + ఆహ - అథాహ - సవర్ణదీర్ఘసన్ధిః।
2. విదితః + మహేశ్వరః - విదితో మహేశ్వరః - ఉత్వాదేశః।
3. మహేశ్వరః + తదర్థినీ - మహేశ్వరస్తదర్థినీ - విసర్గసన్ధిః (సకారాదేశః)।
4. పునః + ఏవ - పునరేవ - విసర్గసన్ధిః (రుత్వమ్)।

87



**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. అథాహ -**

ఎ) అథ శబ్దస్య తదాదిత్వాత్ 'తదాదౌ చే'తి భోజసూత్రానుసారేణాథ శబ్దయోగాత్ భూతార్థే లట్। ఉక్తవాన్ ఇత్యర్థః - అని 'వివరణమ్' వ్యాఖ్య.

బి) 'ఆహేతి భూతార్థే లట్ ప్రయోగో భ్రాన్తిమూలః' ఇత్యాహ వామనః'।

- ఇతి మల్లినాథః।

**క్రియాదర్శము :- ఆహ** :- 'బ్రూఞ్ -వ్యక్తాయాం వాచి' లట్ - ప్ర.ఏ. అదాదిప్రకరణమ్(2). సకర్మకమ్, అనిట్, వచ్యాదేశే త్వనిట్, (ఉభయపదీ) పరస్మైపదీ।

**బ్రవీతి/ఆహ** - బ్రూతః/ఆహతుః - బ్రువన్తి/ఆహుః

---

**శ్లో॥ అవస్తునిర్బన్ధపరే! కథం ను తే**
**కరోఽ యమాముక్తవివాహకౌతుకః।**
**కరేణ శమ్భోర్వలయీకృతాహినా**
**సహిష్యతే తత్ప్రథమావలమ్బనమ్॥ 66**

**పదవిభాగము :-** అవస్తునిర్బన్ధపరే!, కథమ్, ను, తే, కరః, అయమ్, ఆముక్త...కౌతుకః, కరేణ, శమ్భోః, వలయీకృతాహినా, సహిష్యతే, తత్ప్రథమావలమ్బనమ్।

**అన్వయక్రమము :-** అవస్తునిర్బన్ధపరే। ఆముక్తవివాహకౌతుకః తే అయం కరః వలయీకృతాహినా శంభోః కరేణ తత్ప్రథమావలంబనం కథం ను సహిష్యతే।

**ప్రతిపదార్థము :-** అవస్తునిర్బన్ధపరే! - తుచ్ఛవస్తువునందు పట్టుదల ప్రధానముగా గలదానా! ఓ పార్వతీ!, ఆముక్త-వివాహ-కౌతుకః - కట్టబడిన పెండ్లికి సంబంధించిన హస్తసూత్రముకలదైన, తే - నీయొక్క, అయమ్ - ఈ, కరః - చేయి, వలయీకృతాహినా - అలంకారముగా చేయబడిన సర్పములుగల, శంభోః - శివునియొక్క, కరేణ - చేతిచేత, తత్ప్రథమావలమ్బనమ్ - అదే మొదటిదగు పట్టును, కథమ్ + ను - ఎట్లుగా, సహిష్యతే - ఓర్చును.

**తాత్పర్యము :–** తుచ్ఛవస్తువునందు పట్టుదల ప్రధానముగా గలదానా! ఓ పార్వతీ! కట్టబడిన పెండ్లికి సంబంధించిన హస్తసూత్రముకలదైన నీయొక్క యీ **చేయి** అలంకారములుగా చేయబడిన సర్పములుగల శివునియొక్క చేతిచేత అదే మొదటిదగు పట్టును ఎట్లుగా ఓర్చును.

**పాఠాన్తరాలు :–** 1. కరేణ – భుజేన।

**విభక్తులు/క్రియలు :–** 1. అవస్తునిర్బన్ధపరే! – **హే అవస్తునిర్బన్ధపరే!** హే అవస్తునిర్బన్ధపరే! హే అవస్తునిర్బన్ధపరాః; ఆకారాన్త స్త్రీలింగ అవస్తునిర్బన్ధపరాశబ్దము. సం.ప్ర.ఏ 2. ఆముక్తవివాహకౌతుకః – **...కౌతుకః,** ...కౌతుకౌ, ...కౌతుకాః; అకారాన్త పుంలింగ...కౌతుకశబ్దము. ప్ర.ఏ 3. తే – **తే,** యువయోః, యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 4. అయమ్ – **అయమ్,** ఇమౌ, ఇమే; మకారాన్త పుంలింగ ఇదమ్‌శబ్దము. ప్ర.ఏ 5. కరః – **కరః,** కరౌ, కరాః; అకారాన్త పుంలింగ కరశబ్దము.ప్ర.ఏ 6. వలయీకృతాహినా – **...అహినా,** ...అహిభ్యామ్, ...అహిభిః; ఇకారాన్త పుంలింగ...అహిశబ్దము. తృ.ఏ 7. శంభోః – **శంభోః,** శంభ్వోః, శంభూనామ్; ఉకారాన్త పుంలింగ శంభుశబ్దము. ష.ఏ 8. కరేణ – **కరేణ**, కరాభ్యామ్, కరైః; అకారాన్త పుంలింగ కరశబ్దము. తృ.ఏ 9. తత్ప్రథమావలమ్బనమ్ – ...**అవలంబనమ్**, ...అవలంబనే, ...అవలంబనాని ; అకారాన్త నపుంసకలింగ ...అవలంబనశబ్దము. ద్వి.ఏ 10. కథమ్, ను – అవ్యయము 11. సహిష్యతే – క్రియ – లృట్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. అవస్తునిర్బన్ధపరే – న వస్తు(నఞ్‌తత్పు.) అవస్తు, అవస్తుని నిర్బన్ధః (స.త.) అవస్తునిర్బన్ధః, అవస్తునిర్బన్ధః పరం యస్యాః (బహువ్రీహి) సా, తత్సమ్బుద్ధౌ।
2. ఆముక్తవివాహకౌతుకః – వివాహే కౌతుకమ్ (స.త.) వివాహకౌతుకమ్, ఆముక్తం వివాహకౌతుకమ్ యస్య (బహువ్రీహి) సః।
3. వలయీకృతాహినా – వలయీకృతః అహిః యస్మిన్ (బహువ్రీహి) సః, తేన।
4. తత్ప్రథమావలమ్బనమ్ – తదేవ ప్రథమమ్ (సుప్సుపా) తత్ప్రథమమ్, తత్ప్రథమం చ తత్ అవలమ్బనమ్ (కర్మధా.) తత్।

**సంధులు :–**

1. కరః + అయమ్ – కరోఽయమ్ – ఉత్వాదేశః, పూర్వరూపసన్ధిః।
2. శమ్భోః + వలయీకృతాహినా – శమ్భోర్వలయీకృతాహినా – విసర్గసన్ధిః (రుత్వమ్)।





**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు– కావ్యప్రయోగాలు :–**

**1. అహిః** – (పుం.)

ఎ) ఆహన్తీతి। ఆ + హన్ + ఇణ్। హన్ హింసాగత్యోః
'ఆజి శ్రిహనిభ్యాం హ్రస్వశ్చేతి' ఇణ్, స చ డిత్। డిత్వాట్ టిలోప ఆజో హ్రస్వశ్చ। (ఉణాది 4–137)

బి) శ్లో॥ విషధరదన్దశూకపవనాశనసర్పసరీసృపోరగవ్యాళ
భుజగభుజంగకుమ్భీనసపన్నగనాగభోగినః।
**అహి** ఫణభృత్పృదాకుకాకోదరకంచుకిచక్రిగూఢపాద్
ద్విరసనకాద్రవేయదర్వీకరదృక్‌శ్రుతయో భుజంగమాః॥ 640
శ్లో॥ ఆశీవిషో దీర్ఘపృష్ఠః కుణ్డలీ జిహ్మగః స్మృతః।
అని హలాయుధకోశము '29' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ విషధరతోఽప్యతివిషమః ఖల ఇతి న మృషా వదన్తి విద్వాంసః।
యదహిర్నకులద్వేషీ స్వకులద్వేషీ పునః పిశునః।
– ఇతి వాసవదత్తాయాః ప్రస్తావనాశ్లోకః।

డి) **'అహయః** సవిషాః సర్వే నిర్విషా దుందుమాః స్మృతాః'
– కథాసరిత్సాగరః। 14–84

**క్రియాదర్శము :– 1. సహిష్యతే** – 'షహ – మర్షణే' భ్వాది(1), ఆత్మనేపదీ, సకర్మకమ్, సేట్, లట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**సహిష్యతే** – సహిష్యేతే – సహిష్యన్తే.

---

**శ్లో॥ త్వమేవ తావత్ పరిచిన్తయ స్వయం**
**కదాచిదేతే యది యోగమర్హతః।**
**వధూదుకూలం కలహంసలక్షణం**
**గజాజినం శోణితబిన్దువర్షి చ॥ 67**

**పదవిభాగము :–** త్వమ్, ఏవ, తావత్, పరిచిన్తయ, స్వయమ్, కదాచిత్, ఏతే, యది, యోగమ్, అర్హతః, వధూదుకూలమ్, కలహంసలక్షణమ్, గజాజినమ్, శోణితబిన్దువర్షి, చ।

**అన్వయక్రమము :-** త్వమ్ + ఏవ స్వయం తావత్ పరిచిన్తయ। కలహంసలక్షణం వధూదుకూలం శోణితబిన్దువర్షి గజాజినఞ్చ ఏతే కదాచిత్ యోగమ్ అర్హతః యది।

**ప్రతిపదార్థము :-** త్వమ్ + ఏవ - నీవే, స్వయమ్ - స్వయముగా, తావత్ - ఇంతమాత్రము, పరిచిన్తయ - ఆలోచింపుము, కలహంసలక్షణమ్ - కలహంస చిహ్నములుగలయట్టి, వధూదుకూలమ్ - పెండ్లికూతురు ధరించిన పట్టువస్త్రము, శోణితబిన్దువర్షి - నెత్తుటిబొట్లను స్రవించుచున్న, గజాజినమ్- ఏనుగుతోలు, ఏతే చ - ఈ రెండును, కదాచిత్ - ఎప్పుడేని, యోగమ్ - కలయికను, అర్హతః యది - తగిన వేమో.

**తాత్పర్యము :-** నీవే స్వయముగ ఇంతమాత్రము ఆలోచింపుము. కలహంస చిహ్నము గలయట్టి పెండ్లికూతురు ధరించిన పట్టువస్త్రమును, నెత్తుటి బొట్లను స్రవించుచున్న ఏనుగుతోలును, ఈ రెండును ఎప్పుడేని కలయికను తగినవేమో?

**పాఠాన్తరాలు :-**

1. స్వయమ్ - స్వతః, ద్వయం 2. కలహంస - చ సహంస

**విభక్తులు/క్రియలు :-** 1. ఏవ, స్వయమ్, తావత్, చ, కదాచిత్, యది - అవ్యయాలు 2. త్వమ్ - **త్వమ్,** యువామ్, యూయమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ 3. పరిచిన్తయ - క్రియ 4. కలహంసలక్షణమ్ - **కలహంసలక్షణమ్,** కలహంసలక్షణే, కలహంసలక్షణాని; అకారాన్త నపుంసకలింగ కలహంసలక్షణశబ్దము. ద్వి.ఏ 5. వధూదుకూలమ్ - **వధూదుకూలమ్,** వధూదుకూలే, వధూదుకూలాని; అకార్తాన నపుంసకలింగ వధూదుకూలశబ్దము. ప్ర.ఏ 6. శోణితబిన్దువర్షి - ...**వర్షి**, ...వర్షిణీ, ...వర్షీణి; నకారాన్త నపుంసకలింగ ...వర్షిన్‌శబ్దము. ప్ర.ఏ 7. గజాజినమ్ - **గజాజినమ్,** గజాజినే, గజాజినాని; అకారాన్త నపుంసకలింగ గజాజినశబ్దము. ప్ర.ఏ 8. ఏతే - ఏషః, ఏతౌ, ఏతే; దకారాన్త పుంలింగ ఏతచ్ఛబ్దము. ప్ర.బ 9. యోగమ్ - **యోగమ్,** యోగే, యోగాన్; అకారాన్త పుంలింగ యోగశబ్దము. ద్వి.ఏ 10. అర్హతః - క్రియ. లట్.

**సమాసాలు :-**

1. కలహంసలక్షణమ్ - కలహః చాసౌ హంసః (కర్మధా.) కలహంసస్య లక్షణమివ లక్షణం యస్య (బహువ్రీహి) తత్।
2. వధూదుకూలమ్ - వధ్వాః దుకూలమ్ (ష.త.)
3. శోణితబిన్దువర్షి - శోణితస్య బిందవః (ష.త.) శోణితబిన్దవః, శోణితబిందూన్ వర్షతి (ఉపపదతత్పు.) ఇతి తత్।
4. గజాజినమ్ - గజస్య అజినమ్ (ష.త.) గజాజినమ్।





**సంధులు :-**

1. కదాచిత్ + ఏతే - కదాచిదేతే - జశ్త్వమ్।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. అజినమ్** (నపుం.) -

ఎ) అజతి ధూల్యాదిమ్ ఆవృణోతి యత్। అజ + 'అజేరజ చ' ఇతి విభావం బాధ్విత్వా ఇనచ్। - హలాయుధకోశవ్యాఖ్య

బి) శ్లో॥ అసృగ్ధ**రాజినం** చర్మ కృత్తిస్త్వక్ పరికీర్తితా। 630
అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

సి) అజతి క్షిపతి రజ ఆది ఆవరణేన, అజ్ - ఇనచ్, అజే రజ చ। ఉణాది 2-48, విభావబాధనార్థమ్। - ఆప్టే

డి) ఆప్టే మహాశయుడు - ఈ పదమును వివరిస్తూ, ఈ సర్గమునందలి 5-30ను, ఈ శ్లోకమును ఉదాహరించినాడు. ఇంకనూ

ఇ) 'ఐణేయే**నాజినేన** బ్రాహ్మణం రౌరవేణ క్షత్రియమ్ అజినేన వైశ్యమ్'.. - ఆశ్వలాయనస్మృతిని ఉదాహరించినాడు.

**అలంకారములు :-** అత్ర దుకూలాజినయోః పరస్పరసంఘటనయోగ్యతావిరహాద్ విషమాలంకారః।

**క్రియాదర్శము :- 1. పరిచిన్తయ** - చితి (చిన్త్) స్మృత్యామ్ (చింతించుట) చురాదిప్రకరణమ్(10). అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లోట్- మధ్యమపురుషైక వచనాంతః। పరి - ఉపసర్గ.

**పరిచిన్తయ/పరిచిన్తయతాత్** - పరిచిన్తయతమ్ - పరిచిన్తయత.

2. **అర్హతః -** అర్హ్ -పూజాయామ్ (పూజించుట), సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్, భ్వాదిప్రకరణమ్ (1), అర్హతి - **అర్హతః** - అర్హసి.

---

**శ్లో॥ చతుష్కపుష్పప్రకరావకీర్ణయోః**
**పరోఽపి కో నామ తవానుమన్యతే।**
**అలక్తకాఙ్కాని పదాని పాదయో-**
**ర్వికీర్ణకేశాసు పరేతభూమిషు॥ 68**

**పదవిభాగము :–** చతుష్క...కీర్ణయోః, పరః, అపి, కః, నామ, తవ, అనుమన్యతే, అలక్తకాంకాని, పదాని, పాదయోః, వికీర్ణకేశాసు, పరేతభూమిషు.

**అన్వయక్రమము :–** చతుష్కపుష్పప్రకర – అవకీర్ణయోః తవ పాదయోః అలక్తకాంకాని పదాని వికీర్ణకేశాసు పరేతభూమిషు పరః + అపి కః నామ అనుమన్యతే।

**ప్రతిపదార్థము :–** చతుష్క – పుష్పప్రకర – అవకీర్ణయోః = చతుశ్శాలయందు పుష్పసమూహమునందు ఉంచబడినవగు, తవ – నీ, పాదయోః – పాదములయొక్క, అలక్తకాంకాని – లత్తుకచే ఎఱ్ఱని గుర్తుగల, పదాని – పదచిహ్నములను, వికీర్ణకేశాసు – వెదజల్లబడిన వెంట్రుకలుగల, పరేతభూమిషు – ప్రేతభూములయందు, పరః అపి – శత్రువయినను, కః నామ అనుమన్యతే – ఎవ్వడనుమతించును?

**తాత్పర్యము :–** చతుశ్శాలయందు పుష్పసమూహమునందు ఉంచబడినవగు నీ పాదములయొక్క లత్తుకలచే ఎఱ్ఱనిగుర్తుగల పదచిహ్నములను, వెదజల్లబడిన వెంట్రుకలుగల ప్రేతభూములందు శత్రువయినను ఎవ్వడనుమతించును?

**విభక్తులు/క్రియలు :–** 1. చతుష్క ... అవకీర్ణయోః –... అవకీర్ణస్య, ...**అవకీర్ణయోః,** ...అవకీర్ణానామ్; అకారాన్త పుంలింగ ...అవకీర్ణశబ్దము. ష.ద్వి. 2. తవ – **తవ,** యువయోః, యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 3. పాదయోః – పాదస్య, **పాదయోః,** పాదానామ్; అకారాన్త పుంలింగ పాదశబ్దము. ష.ద్వి. 4. అలక్తకాంకాని – అలక్తకాంకమ్, అలక్తకాంకే, **అలక్తకాంకాని;** అకారాన్త నపుంసకలింగ ..అలక్తకాంకశబ్దము. ద్వి.బ 5. పదాని – పదమ్, పదే, **పదాని;** అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ద్వి.బ 6. వికీర్ణకేశాసు – ...కేశాయామ్, ...కేశయోః , **...కేశాసు;** ఆకారాన్త స్త్రీలింగ...కేశాశబ్దము. స.బ 7. పరేతభూమిషు – ...భూమ్యామ్, ...భూమ్యోః , **...భూమిషు;** ఇకారాన్త స్త్రీలింగ...భూమిశబ్దము. స.బ 8. అపి, నామ – అవ్యయాలు 9. కః – **కః** , కౌ, కే; మకారాన్త పుంలింగ కిమ్‌శబ్దము. ప్ర.ఏ 10. అనుమన్యతే – క్రియ – లట్ – ప్ర.ఏ

**సమాసాలు :–**

1. చతుష్కపుష్పప్రకరావకీర్ణయోః – పుష్పాణాం ప్రకరః (ష.త.) పుష్ప ప్రకరః, చతుష్కే పుష్పప్రకరః (స.త.) చతుష్కపుష్పప్రకరః, చతుష్కపుష్పప్రకరే అవకీర్ణౌ (స.త.) తయోః
2. అలక్తకాంకాని – అలక్తకస్య అంకః యేషు (బహువ్రీహి) తాని।
3. వికీర్ణకేశాసు – వికీర్ణాః కేశాః యాసు (బహువ్రీహి) తాః వికీర్ణకేశాః, తాసు।
4. పరేతభూమిషు – పరేతానాం భూమయః (ష.త.) పరేతభూమయః, తాసు।



**సంధులు :–**

1. పరః + అపి – పరోఽపి – ఉత్వాదేశః – పూర్వరూపసన్ధిః।
2. కః+నామ – కోఽనామ – ఉత్వాదేశః।
3. తవ+ అనుమన్యతే – తవానుమన్యతే – సవర్ణదీర్ఘసన్ధిః।
4. పాదయోః + వికీర్ణకేశాసు – పాదయోర్వికీర్ణకేశాసు – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అలక్తకః** (పుం.) –

ఎ) న రక్తోఽస్మాత్ । రస్య లత్వమ్। అలక్తః, స్వార్థే కన్।

బి) శ్లో॥ జతుయావకలాక్షాలక్తకాః సమాః...

అని హలాయుధకోశము 4 నామములను పేర్కొన్నది.

సి) 'పాదాలక్తకరక్తమౌక్తికశిలః సిద్ధాఙ్గనానాఙ్గతైః' – ఇతి నాగానందే.

డి) The red resin of certain trees, red lac or sap - formerly used by women to dye certain parts of their body, particularly the soles of the feet and lip _ Apte.

ఇ) శ్లో॥ రక్తాశోకరుచా విశేషితగుణో బింబాధరా**లక్తకః**
ప్రతిఖ్యాతవిశేషకం కురవకం శ్యామావదాతారుణమ్।
ఆక్రాన్తా తిలకక్రియాపి తిలకైర్లగ్నద్విరేఫాంజనైః
సావజ్ఞేవ ముఖప్రసాధనవిధౌ శ్రీర్మాధవీ యోషితామ్॥

– మాలవికాగ్నిమిత్రే 3–5

'రక్తాశోకవృక్షములకాంతి, దొండపండువంటి క్రింది పెదవియందలి **లత్తుక** గుణమును అతిశయించుచున్నది. నలుపు తెలుపు ఎఱుపు రంగులగల కురవక పుష్పము (స్త్రీల) చెక్కిళ్లయందలి పత్త్రభంగములను (బుగ్గలపై వేసికొను మకరికాది అలంకరణరేఖలను) తిరస్కరించుచున్నది. తుమ్మెదలనెడు కాటుక అంటిన తిలకపుష్పములు స్త్రీల తిలకపు తీరును మఱీ అతిక్రమించుచున్నవి. (కనుక) ఈ వసంతలక్ష్మి స్త్రీల ముఖాలంకరణ విధాన విషయమునందు తిరస్కారభావము కలదా? అన్నట్లున్నది!

ఎఫ్) శ్లో॥ ప్రసాధికాలమ్బితమగ్రపాదమాక్షిప్య కాచిత్ ద్రవరాగమేవ।
ఉత్సృష్టలీలాగతిరాగవాక్షాత్ **అలక్తకాఙ్కాం** పదవీం తతాన॥

– ర.వం. 7–7

మఱియొక స్త్రీ తన పాదములకు **లత్తుక** ద్రవమును చెలికత్తె పూయుచుండగా పూర్తికాకమునుపే లాగికొని విలాసగమనమును మాని, వేగముగ కిటికీవద్దకు నడుచుచు, ఆ కిటికీవరకు ఉన్న **నేలనంతటిని తడి పారాణి** గుర్తులు కలదిగా చేసెను.

జి) 'స్త్రియో హృతార్థాః పురుషం నిరర్థం నిష్పీడి**తాలక్తక**వత్త్యజన్తి'...

– మృచ్ఛకటికే – 4-15

**క్రియాదర్శము :– అనుమన్యతే** – అను – ఉపసర్గ, 'మను – అవబోధనే' (తెలియుట) సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, తనాదిప్రకరణమ్(8), కర్మణిప్రయోగము.

**అనుమన్యతే** – అనుమన్యేతే – అనుమన్యన్తే.

---

**శ్లో॥ అయుక్తరూపం కిమతః పరం వద**
**త్రినేత్రవక్షః సులభం తవాపి యత్।**
**స్తనద్వయేఽస్మిన్ హరిచన్దనాస్పదే**
**పదం చితాభస్మరజః కరిష్యతి॥ 69**

**పదవిభాగము :–** అయుక్తరూపమ్, కిమ్, అతఃపరమ్, వద, త్రినేత్రవక్షః, సులభమ్, తవ, అపి, యత్, స్తనద్వయే, అస్మిన్, హరిచన్దనాస్పదే, పదమ్, చితాభస్మరజః, కరిష్యతి।

**అన్వయక్రమము :–** త్రినేత్రవక్షః తవ సులభమ్ అపి అతఃపరమ్ అయుక్తరూపం కిం వద। యత్ హరిచన్దనాస్పదే అస్మిన్ స్తనద్వయే చితాభస్మరజః పదం కరిష్యతి।

**ప్రతిపదార్థము :–** త్రినేత్రవక్షః – శివుని వక్షఃస్థలము, తవ – నీకు, సులభమ్ + అపి – సులభమే, అతఃపరమ్ – ఇంతకన్నను, అయుక్తరూపమ్ – మిక్కిలి అయోగ్యము, కిం వద – ఏమున్నదో చెప్పుము, యత్ – ఎందువలన, హరిచన్దనాస్పదే – హరిచందనమునకు తావయిన, అస్మిన్ – ఈ, స్తనద్వయే – కుచద్వయమందు, చితాభస్మరజః– చితా భస్మపుపొడి, పదమ్+కరిష్యతి–అడుగిడునో.

**తాత్పర్యము :–** శివుని వక్షఃస్థలము నీకు సులభమే. ఇంతకన్నను మిక్కిలి అయోగ్యము ఏమున్నదో చెప్పుము. ఎందువలన హరిచందనమునకు తావయిన ఈ కుచద్వయమందు చితాభస్మపుపొడి అడుగిడునో।



**పాఠాన్తరాలు :–** 1. వద – భవేత్ 2. ఆస్పదే – అఙ్కితే.

**విభక్తులు/క్రియలు :–** 1. త్రినేత్రవక్షః – త్రినేత్రవక్షః, త్రినేత్రవక్షసీ, త్రినేత్రవక్షాంసి; సకారాన్త నపుంసకలింగ...వక్షశ్శబ్దము. ప్ర.ఏ 2. తవ – **తవ**, యువయోః, యుష్మాకమ్ ; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 3. సులభమ్ – **సులభమ్,** సులభే, సులభాని; అకారాన్త నపుంసకలింగ సులభశబ్దము. ద్వి.ఏ 4. అపి, యత్, కిమ్ – అవ్యయాలు 5. అయుక్తరూపమ్ – **అయుక్తరూపమ్,** అయుక్తరూపే, అయుక్తరూపాణి; అకారాన్త నపుంసకలింగ అయుక్తరూపశబ్దము. ప్ర.ఏ 6. హరిచన్దనాస్పదే – ...**ఆస్పదే,** ...ఆస్పదయోః, ...ఆస్పదేషు; అకారాన్త నపుంసకలింగ...ఆస్పదశబ్దము. స.ఏ 7. అస్మిన్ – **అస్మిన్,** అనయోః, ఏషు ; మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము. స.ఏ 8. స్తనద్వయే – స్తనద్వయే, స్తనద్వయోః, స్తనద్వయేషు; అకారాన్త నపుంసకలింగ స్తనద్వయశబ్దము. స.ఏ 9. చితాభస్మరజః – ...**రజః**, రజసీ, రజాంసి; సకారాన్త నపుంసకలింగ రజశ్శబ్దము. ప్ర.ఏ 10. పదమ్–**పదమ్,** పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ప్ర.ఏ 11. కరిష్యతి–క్రియ

**సమాసాలు :–**

1. త్రినేత్రవక్షః – త్రీణి నేత్రాణి యస్య (బహువ్రీహి) సః త్రినేత్రః, త్రినేత్రస్య వక్షః (ష.త.) త్రినేత్రవక్షః।
2. అయుక్తరూపమ్ – అతిశయేనయుక్తం యుక్తరూపమ్, తత్ న భవతీతి (నఞ్తత్పు.)
3. స్తనద్వయే – స్తనయోః ద్వయమ్ (ష.త.) తస్మిన్।
4. హరిచన్దనాస్పదే – హరేః చందనమ్ – హరిచందనమ్ (ష.త.) హరిచందనస్య ఆస్పదమ్ – హరిచన్దనాస్పదమ్, తస్మిన్।
5. చితాభస్మరజః – చితాయాః భస్మ (ష.త.) చితాభస్మ, చితాభస్మనః రజః (ష.త.) చితాభస్మరజః।

**సంధులు :–**

1. తవ + అపి – తవాపి – సవర్ణదీర్ఘసన్ధిః।
2. స్తనద్వయే + అస్మిన్ – స్తనద్వయేఽస్మిన్ – పూర్వరూపసన్ధిః
**ఏఙః పదాన్తాదతి** (సూ 6-1-105) పదాంతమందున్న ఏ ఓ లకు హ్రస్వ అకారము పరముగానున్నప్పుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపమేకాదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. స్తనః (పుం.) –**

ఎ) స్తన్యతే శబ్ద్యతే కాముకైః, స్తనయతి కథయతి వక్షః శోభామితి వా।

స్తన్ శబ్దే + ఘఞ్.

బి) శ్లో॥ ఉరసిజకుచవక్షోరుహ పయోధరాః **స్తన**సమాననామాని। 526
అని హలాయుధకోశము '5' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ అరోమశౌ **స్తనౌ** పీనౌ ఘనావవిషమౌ శుభౌ।
కఠినావరోమమురో మృదుగ్రీవా చ కమ్బుభా ॥ ఇతి గారుడే 53/95

డి) స్తన్ అచ్

ఇ) శ్లో॥ అనేన పర్యాసయతాస్రబిందూన్
ముక్తాఫలస్థూలతమాన్ **స్తనేషు।**
ప్రత్యర్పితాశ్శత్రువిలాసినీనామ్
ఉన్ముచ్య సూత్రేణ వినైవ హారాః ॥ – ర.వం. 6-28

ఈ రాజు శత్రువధ చేయుటచేత వారి స్త్రీలకన్నులలోనుండి బాష్పజల బిందువులు పెద్ద ముత్యములవలె వారి **స్తనముల**పై బడి దారములేని ముత్యాల హారములు వలె ప్రకాశించినవి. అనగా ఈ రాజు శత్రుసంహారకుడని భావము.

**క్రియాదర్శము :–** **కరిష్యతి** – డుకృఞ్(కృ) కరణే (చేయుట) సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, లృట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**కరిష్యతి** – కరిష్యతః – కరిష్యన్తి

---

92

**శ్లో॥ ఇయం చ తేఽన్యా పురతో విడమ్బనా**
**యదూఢయా వారణరాజహార్యయా।**
**విలోక్య వృద్ధోక్షమధిష్ఠితం త్వయా**
**మహాజనః స్మేరముఖో భవిష్యతి॥ 70**

**పదవిభాగము :–** ఇయమ్, చ, తే, అన్యా, పురతః, విడమ్బనా, యత్, ఊఢయా, వారణరాజహార్యయా, విలోక్య, వృద్ధోక్షమ్, అధిష్ఠితమ్, త్వయా, మహాజనః, స్మేరముఖః, భవిష్యతి।

**అన్వయక్రమము :–** ఇయఞ్చ తే పురతనః అన్యా విడమ్బనా యత్ ఊఢయా వారణరాజహార్యయా త్వయా అధిష్ఠితం వృద్ధోక్షం విలోక్య మహాజనః స్మేరముఖః భవిష్యతి।



**ప్రతిపదార్థము :–** ఇయఞ్చ – ఇదియు, తే పురతః – నీ యెదుటే, అన్యా – వేఱొక, విడంబనా – పరిహాసము, యత్ – ఏదనగా, ఊఢయా – వివాహమాడి, వారణరాజహార్యయా – గజేంద్రముచేత తీసికొనిపోదగిన, త్వయా – నీ చేత, అధిష్ఠితమ్ – ఎక్కబడిన, వృద్ధోక్షమ్ – ముసలియెద్దును, విలోక్య – చూచి, మహాజనః – ఎల్ల జనము, స్మేరముఖః – చిఱునగుమోము గలది, భవిష్యతి – అగును.

**తాత్పర్యము :–** ఇదియు నీ యెదుటే వేఱొక పరిహాసము ఏదనగా వివాహమాడి గజేంద్రముచేత తీసికొనిపోదగిన నీ చేత ఎక్కబడిన ముసలియెద్దును చూచి ఎల్లజనము చిఱునగుమోము గలది అగును.

**పాఠాన్తరాలు :–** హార్యయా – భార్యయా

**విభక్తులు/క్రియలు :–** 1. ఇయమ్ – **ఇయమ్**, ఇమే, ఇమాః; మకారాన్త స్త్రీలింగ ఇదమ్శబ్దము. ప్ర.ఏ 2. తే – **తే,** యువయోః, యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 3. అన్యా – అన్యా, అన్యే, అన్యాః; ఆకారాన్త స్త్రీలింగ అన్యాశబ్దము. ప్ర.ఏ 4. విడంబనా – **విడంబనా**, విడంబనే, విడంబనాః; ఆకారాన్త స్త్రీలింగ విడంబనాశబ్దము. ప్ర.ఏ 5. యత్ – **యత్,** యే, యాని; దకారాన్త నపుంసకలింగ యద్శబ్దము. ప్ర.ఏ 6. ఊఢయా – ఊఢయా, ఊఢాభ్యామ్, ఊఢాభిః; ఆకారాన్త స్త్రీలింగ ఊఢాశబ్దము. తృ.ఏ 7. వారణరాజహార్యయా – ...**హార్యయా**, ...హార్యాభ్యామ్, ...హార్యాభిః ; ఆకారాన్త స్త్రీలింగ వారణరాజహార్యాశబ్దము. తృ.ఏ 8. త్వయా – **త్వయా,** యువాభ్యామ్, యుష్మాభిః ; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. తృ.ఏ 9. అధిష్ఠితమ్ – **అధిష్ఠితమ్** – అధిష్ఠితౌ, అధిష్ఠితాన్ ; అకారాన్త పుంలింగ అధిష్ఠితశబ్దము. ద్వి.ఏ 10. వృద్ధోక్షమ్ – **వృద్ధోక్షమ్,** వృద్ధోక్షౌ, వృద్ధోక్షాన్; అకారాన్త పుంలింగ వృద్ధోక్షశబ్దము. ద్వి.ఏ 11. విలోక్య – అవ్యయము 12. మహాజనః – **మహాజనః** , మహాజనౌ, మహాజనాః; అకారాన్త పుంలింగ మహాజనశబ్దము. ప్ర.ఏ 13. స్మేరముఖః – **స్మేరముఖః** , స్మేరముఖౌ, స్మేరముఖాః ; అకారాన్త పుంలింగ స్మేరముఖశబ్దము. ప్ర.ఏ 14. భవిష్యతి – క్రియ – లృట్.

**సమాసాలు :–**

1. వారణరాజహార్యయా – వారణానాం రాజా (ష.త.) వారణరాజః, వారణరాజేన హార్యా (తృ.త.) వారణరాజహార్యా, తయా।
2. వృద్ధోక్షమ్ – వృద్ధః చాసౌ ఉక్షా చ (కర్మధా.) వృద్ధోక్షః, తమ్। వృద్ధోక్షమ్।
3. మహాజనః – మహాంశ్చాసౌ జనః (కర్మధా.) మహాజనః।
4. స్మేరముఖః – స్మేరం ముఖం యస్య (బహువ్రీహి) సః।

**సంధులు :–**

1. తే + అన్యా – తేఽన్యా – పూర్వరూపసన్ధిః।

2. పురతః + విడంబనా – పురతో విడమ్బనా – ఉత్వాదేశః
3. స్మేరముఖః + భవిష్యతి – స్మేరముఖో భవిష్యతి – ఉత్వాదేశః

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు– కావ్యప్రయోగాలు :–**

**1. వృద్ధోక్షః** – (పుం.)

ఎ) **వృద్ధః** చాసౌ **ఉక్షా** చేతి। **'అచతురేత్యాది' నా అచ్ ప్రత్యయః।**

బి) శ్లో॥ ...వృద్ధోక్షస్తు జరద్గవః।

అని హలాయుధకోశము '2' నామములను పేర్కొన్నది.

సి) అచతుర విచతుర సుచతుర స్త్రీపుంస ధేన్వనుడుహర్క్సామవాఙ్ మనస్సాక్షి భ్రువదారగవోర్వష్ఠీవపదష్ఠీవనక్తందివరాత్రిందివాహర్దివసరజసనిఃశ్రేయసపురుషాయుషద్వ్యాయుషత్ర్యాయుషర్గ్యజుషజాతోక్షమహోక్షవృద్ధోక్షోపశునగోష్ఠశ్వాః। **(సూ 5–4–77)**

ఏతే పంచవింశతి రజన్తా నిపాత్యన్తే। ఆద్య స్త్రయో బహువ్రీహయః। అవిద్యమానాని చత్వారి యస్య సః అచతురః। విచతురః సుచతురః।

**వా॥** త్ర్యుపాభ్యాం చతురోఽజిష్యతే।

త్రిచుతరః। చతుర్ణాం సమీపే ఉపచతురాః। ఏకాదశ ద్వంద్వాః స్త్రీ పుంసౌ। ధేన్వనుడుహౌ । ఋక్సామే। వాఙ్మనసే। అక్షిణీ చ భ్రువౌచ అక్షిభ్రువమ్। దారాశ్చ గావశ్చ దారగవమ్। ఊరూ చాష్ఠీవన్తౌ చోర్వష్ఠీవమ్। నిపాతనాట్టిలోపః। పదష్ఠీవమ్। నిపాతనాత్పాదశబ్దస్య పద్భావః। నక్తం చ దివాచ నక్తందివమ్। రాత్రౌ చ దివా చ రాత్రిందివమ్। రాత్రే ర్మాన్తత్వం నిపాత్యతే। అహని చ దివా చ అహర్దివమ్। వీప్సాయాం ద్వన్ద్వో నిపాత్యతే। అహన్యహనీత్యర్థః। సరజసమితి సాకల్యే ఽవ్యయీభావః। బహువ్రీహౌ ఽ తు సరజః పంకజమ్। నిశ్చితం శ్రేయోనిఃశ్రేయసమ్। । పురుషాస్యాయుః పురుషాయుషమ్। తతో ద్విగుః। ద్వ్యాయుషమ్। త్ర్యాయుషమ్। తతో ద్వంద్వః। ఋగ్యజుషమ్। తతస్త్రయః కర్మధారయాః। జాతోక్షః। మహోక్షః। వృద్ధోక్షః। శునః సమీపముపశునమ్। టిలోపాభావః సంప్రసారణం చ నిపాత్యయే। గోష్ఠే గోష్ఠశ్వః।

స్త్రీ చ పుమాంశ్చ స్త్రీ పుంసౌ। అచ్।

**క్రియాదర్శము: – భవిష్యతి** – భూ – సత్తాయామ్ (ఉండుట), భ్వాదిప్రకరణమ్, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లృట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**భవిష్యతి** – భవిష్యతః – భవిష్యన్తి.





**శ్లో॥ ద్వయం గతం సంప్రతి శోచనీయతాం**
**సమాగమప్రార్థనయా పినాకినః।**
**కలా చ సా కాన్తిమతీ కలావత –**
**స్త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ॥ 71**

**పదవిభాగము :–** ద్వయమ్, గతమ్, సంప్రతి, శోచనీయతామ్, సమాగమప్రార్థనయా, పినాకినః, కలా, చ, సా, కాన్తిమతీ, కలావతః, త్వమ్, అస్య, లోకస్య, చ, నేత్రకౌముదీ।

**అన్వయక్రమము :–** పినాకినః సమాగమప్రార్థనయా సంప్రతి ద్వయం శోచనీయతాం గతం, సా కాన్తిమతీ కలావతః కలా చ అస్య లోకస్య నేత్రకౌముదీ త్వమ్ చ।

**ప్రతిపదార్థము :–** పినాకినః – శివునియొక్క, సమాగమ – ప్రార్థనయా– ప్రాప్తికోరుటచే, సంప్రతి – ఇప్పుడు, అస్మిన్ కాలే, ద్వయమ్ – రెండు, శోచనీయతామ్ – దుఃఖత్వమును, గతమ్ – పొందినవి, సా – ఆ, కాన్తిమతీ – కాంతిమంతమగు, కలావతః – చంద్రునియొక్క, కలా చ– పదునాఅవ పాలును, అస్య –ఈ, లోకస్య – లోకమునకు, నేత్రకౌముదీ – కన్నులకు వెన్నెలగు, త్వఞ్చ – నీవును.

**తాత్పర్యము :–** శివునియొక్క ప్రాప్తి కోరుటచే ఇప్పుడు రెండు దుఃఖత్వమును పొందినవి. ఆ కాంతిమంతమగు చంద్రునియొక్క పదనాఅవ పాలును, ఈ లోకమునకు కన్నులకు వెన్నెలగు నీవును.

**పాఠాన్తరాలు :–** 1. పినాకినః – కపాలినః ; 2. కలావతః – కలాభృతః

**విభక్తులు/క్రియలు :–** 1. పినాకినః – **పినాకినః**, పినాకినోః, పినాకినామ్; నకారాన్త పుంలింగ పినాకిన్శబ్దము. ష.ఏ 2. సమాగమప్రార్థనయా – ...**ప్రార్థనయా**, ...ప్రార్థనాభ్యామ్, ప్రార్థనాభిః; ఆకారాన్త స్త్రీలింగ...ప్రార్థనాశబ్దము. తృ.ఏ 3. సంప్రతి, చ –అవ్యయము 4. ద్వయమ్ – **ద్వయమ్,** ద్వయే, ద్వయాని; అకారాన్త నపుంసకలింగ ద్వయశబ్దము. ప్ర.ఏ 5. శోచనీయతామ్ – **శోచనీయతామ్,** శోచనీయతే, శోచనీయతాః; ఆకారాన్త స్త్రీలింగ శోచనీయతాశబ్దము. ద్వి.ఏ 6. గతమ్ – **గతమ్**, గతే, గతాని; అకారాన్త నపుంసకలింగ గతశబ్దము. ప్ర.ఏ 7. సా – **సా,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 8. కాన్తిమతీ – **కాన్తిమతీ,** కాన్తిమత్యౌ, కాన్తిమత్యః; ఈకారాన్త స్త్రీలింగ కాన్తిమతీశబ్దము. ప్ర.ఏ 9. కలావతః – **కలావతః,** కలావతోః, కలావతామ్; ; తకారాన్త పుంలింగ కలా(వాన్) వత్ శబ్దము. ష.ఏ 10. కలా – **కలా**, కలే, కలాః ; ఆకారాన్త స్త్రీలింగ కలాశబ్దము. ప్ర.ఏ 11. అస్య – **అస్య,** అనయోః, ఏషామ్ మకారాన్త పుంలింగ ఇదమ్శబ్దము. ష.ఏ 12. లోకస్య – **లోకస్య,** లోకయోః, లోకానామ్; అకారాన్త పుంలింగ లోకశబ్దము. ష.ఏ. 13. నేత్రకౌముదీ –

**నేత్రకౌముదీ**, నేత్రకౌముద్యౌ, నేత్రకౌముద్యః; ఈకారాన్త స్త్రీలింగ నేత్రకౌముదీశబ్దము, ప్ర.ఏ 14.
త్వమ్ - **త్వమ్**, యువామ్, యూయమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు :-**

1. సమాగమప్రార్థనయా - సమాగమస్య ప్రార్థనా (ష.త.) తయా।
2. నేత్రకౌముదీ - నేత్రయోః కౌముదీ (ష.త.) నేత్రకౌముదీ।

**సంధులు :-**

1. కలావతః + త్వమ్ - కలావతస్త్వమ్ - విసర్గసన్ధిః ।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. కలా** (స్త్రీ.) -

ఎ) కలయతి వృద్ధితో ధనం సంగృహ్ణాతి, సంచినోతీత్యర్థః।
కల్ + అచ్ + టాప్।

బి) 1. చన్ద్రస్య షోడశాంశః।

2) శ్లో॥ సాలంకారతయా త్వయా మమ కథం నేన్దోః కలా దృశ్యతే।
పశ్యామీన్దుకలాం స్ఫుటం పునరిదం అలంకారతా నాస్మి యత్॥
- ఇతి వక్రోక్తిపంచాశికాయామ్।

సి) శ్లో॥ అమృతా మానదా పూషా తుష్టిః పుష్టీ రతిర్ధృతిః।
శశినీ చన్ద్రికా జ్యోతిర్జ్యోత్స్నా శ్రీః ప్రీతిరేవ చ।
అంగదా చ తథా పూర్ణామృతా షోడశ వై కలాః॥

1. అమృత 2. మానద 3. పూష 4. తుష్టి 5. పుష్టి 6. రతి 7. ధృతి 8. శశిని 9. చన్ద్రిక 10. కాంతి(జ్యోతి) 11. జ్యోత్స్న 12. శ్రీ 13. ప్రీతి 14. అంగద 15. పూర్ణ 16. **అమృత**

డి) "యథా **కలం** యథా శఫం యథా ఋణం సంనయామసి'
- ఋగ్వేదే 8-10-17

ఇ) 'కలా తు షోడశోభాగః' ఇత్యమరః।

ఎఫ్) శ్లో॥ జగతి జయినస్తే తే భావా **నవేన్దుకలాదయః**
ప్రకృతిమధురాః సన్త్వేవాన్యే మనో మదయన్తి యే।
మమ తు యదియం యాతా లోకే విలోచనచన్ద్రికా
నయనవిషయం జన్మన్యేకః స ఏవ మహోత్సవః॥
- మాలతీమాధవే -1-36





శ్లో॥ తత ఉదయగిరిరివైక ఏవ
స్ఫురితగుణద్యుతిసుందరః **కలావాన్।**
ఇహ జగతి మహోత్సవస్య హేతు-
ర్నయనవతాముదియాయ బాలచన్ద్రః॥ - మాలతీమాధవే 2-10

---

**అవతారికా :-** 'కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్, బాన్ధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్న మితరే జనాః' ఇతి లోకానామ్ ఆభాషణమ్, తత్రకించిదపి నాస్తీత్యాహ। కన్య సౌందర్యమును కన్యకామాత ధనమును, కన్యకాజనకుడు విద్యను, పెఱవారగు బంధువులు ఇష్టాన్నమును వరుని కుండుట కోరుకుందురు. ఇది లోకులు చెప్పుకొను పలుకు. అందొక్కటీ శివునియందు లేదనుచున్నాడు.

**శ్లో॥ వపుర్విరూపాక్షమలక్ష్యజన్మతా**
**దిగమ్బరత్వేన నివేదితం వసు।**
**వరేషు యద్బాలమృగాక్షి! మృగ్యతే**
**తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే॥ 72**

**పదవిభాగము :-** వపుః, విరూపాక్షమ్, అలక్ష్యజన్మతా, దిగంబరత్వేన, నివేదితమ్, వసు, వరేషు, యత్, బాలమృగాక్షి, మృగ్యతే, తత్, అస్తి, కిమ్, వ్యస్తమ్, అపి, త్రిలోచనే।

**అన్వయక్రమము :-** వపుః విరూపాక్షమ్ అలక్ష్యజన్మతా వసు దిగమ్బరత్వేన నివేదితం బాలమృగాక్షి! యత్ వరేషు మృగ్యతే తత్ త్రిలోచనే వ్యస్తమ్ + అపి అస్తి కిమ్?

**ప్రతిపదార్థము :-** వపుః - రూపము, విరూపాక్షమ్ - వికారమైన కన్నులుగలది, అలక్ష్యజన్మతా - తెలియబడని పుట్టువుగలవాడగుట, వసు - ధనము, దిగమ్బరత్వేన - దిసమొలగలవాడగుటచేతనే, నివేదితమ్ - తెలుపబడినది, హే బాలమృగాక్షి - ఓ పిల్లలేడి కన్నులదానా!, యత్ - ఏ రూప విత్తాదికము, వరేషు - వరులయెడ, మృగ్యతే - వెదుకబడునో, తత్ - అది, త్రిలోచనే - శివునియందు, వ్యస్తమ్ అపి - ఒక్కటీ, అస్తి కిమ్ - అదైనా ఇదైనా ఉన్నదా?

**తాత్పర్యము :-** రూపము వికారమైన కన్నులుగలది తెలియబడని పుట్టువుగలవాడగుట ధనము దిసమొలగల వాడగుటచేతనే తెలుపబడినది. ఓ పిల్లలేడి

కన్నులదానా! ఏ రూపవిత్తాదికము వరులయెడ వెదుకబడునో అది శివునియందు ఒక్కటీ అదైనా, ఇదైనా ఉన్నదా?

**విభక్తులు/క్రియలు :–** 1. వపుః – వపుః, వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుశ్శబ్దము. ప్ర.ఏ 2. విరూపాక్షమ్ – **విరూపాక్షమ్,** విరూపాక్షే, విరూపాక్షాణి; అకారాన్త నపుంసకలింగ విరూపాక్షశబ్దము. ప్ర.ఏ 3. అలక్ష్యజన్మతా – **...జన్మతా,** ...జన్మతే, ...జన్మతాః; ఆకారాన్త స్త్రీలింగ జన్మతాశబ్దము. ప్ర.ఏ 4. వసు – **వసు,** వసునీ, వసూని; ఉకారాన్త నపుంసకలింగ వసుశబ్దము. ప్ర.ఏ 5. దిగమ్బరత్వేన – **దిగమ్బరత్వేన,** దిగమ్బరత్వాభ్యామ్, దిగమ్బరత్వైః; అకారాన్త నపుంసకలింగ దిగమ్బరత్వశబ్దము. తృ.ఏ 6. నివేదితమ్ – **నివేదితమ్,** నివేదితే, నివేదితాని అకారాన్త నపుంసకలింగ నివేదితశబ్దము. ప్ర.ఏ 7. బాలమృగాక్షి – **హే బాలమృగాక్షి!** హే బాలమృగాక్ష్యౌ, హే బాలమృగాక్ష్యః; ఈకారాన్త స్త్రీలింగ బాలమృగాక్షీశబ్దము. సం.ప్ర.ఏ 8. యత్ – **యత్,** యే, యాని; దకారాన్త నపుంసకలింగ యద్శబ్దము. ప్ర.ఏ 9. తత్ – **తత్,** తే, తాని; దకారాన్త నపుంసకలింగ తద్శబ్దము. ప్ర.ఏ 10. వరేషు – వరే, వరయోః, **వరేషు;** అకారాన్త పుంలింగ వరశబ్దము. స.బ 11. మృగ్యతే – క్రియ – కర్మణి 12. త్రిలోచనే – **త్రిలోచనే,** త్రిలోచనయోః, త్రిలోచనేషు ; అకారాన్త పుంలింగ త్రిలోచనశబ్దము. స.ఏ 13. వ్యస్తమ్ – **వ్యస్తమ్,** వ్యస్తే, వ్యస్తాని; అకారాన్త నపుంసకలింగ వ్యస్తశబ్దము. ప్ర.ఏ 14. అపి, కిమ్ – అవ్యయము 15. అస్తి – క్రియ.

**సమాసాలు :–**

1. విరూపాక్షమ్ – విరూపాణి అక్షీణి యస్య (బహువ్రీహి) తత్।
2. అలక్ష్యజన్మతా – న లక్ష్యమ్ (నఞ్తత్పు.) అలక్ష్యమ్, అలక్ష్యం జన్మ యస్య (బహువ్రీహి) సః, అలక్ష్యజన్మా, తస్య భావః।
3. దిగమ్బరత్వేన–దిగేవ అమ్బరం యస్య (బహువ్రీహి) సః, తస్య భావః। తేన।
4. బాలమృగాక్షి – బాలః చాసౌ మృగః (కర్మధా.) బాలమృగః, బాలమృగస్య అక్షిణీ ఇవ అక్షిణీ యస్యాః సా – బాలమృగాక్షీ (బహువ్రీహి), తస్యాః సంబుద్ధిః.।

**సంధులు :–**

1. వపుః + విరూపాక్షమ్ – వపుర్విరూపాక్షమ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. యత్ + బాలమృగాక్షి – యద్బాలమృగాక్షి – జశ్త్వమ్।
3. తత్ + అస్తి – తదస్తి – జశ్త్వమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వసు –**

ఎ) (నపుం.) – వసత్యనేనేతి, వస్ + 'శృస్వృస్నిహీతి ' ఉ ।ధనమ్।



బి) శ్లో॥ ద్యుమ్నం ద్రవ్యం ద్రవిణం రాః సారం స్వాపతేయమర్థః స్వమ్।
ఋక్థం పృక్థం విత్తం ధనం హిరణ్యం చ **వసు** విభః॥ 80
అని హలాయుధకోశము 15 నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ బలమార్తభయోపశాన్తయే
విదుషాం సత్కృతయే బహుశ్రుతమ్।
వసు తస్య విభోర్న కేవలం
గుణవత్తాపి పరప్రయోజనా॥ – ర.వం. 8–31

"ఆ అజమహారాజుయొక్క **ధనము** పరుల ప్రయోజనముకొఱకు మాత్రమే పనికి వచ్చినది..."

డి) **వసు** చార్థవాచి। లింగానుశాసనప్రకరణమ్(54)

ఇ) శ్లో॥ **వసూని** తోమం ఘనవద్వ్యతారీత్
సహాసనం గోత్రభిదాధ్యవాత్సీత్। ...భట్టికావ్యే 1–3

ఎఫ్) పుం, స్త్రీ. లింగములందు గల భిన్నార్థవివరములకు నిఘంటువులు చూడగలరు.

2. **శ్లో॥ కన్యా కామయతే రూపం విత్తం పితా శ్రుతమ్।
బాన్ధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్నమితరే జనాః ॥**
ఇతి – వివాహప్రకరణే – వరవిచారే।

**క్రియాదర్శము :– 1. మృగ్యతే** – 'మృగ్ – అన్వేషణే' ఇతి ధాతోః కర్మణి లట్। చురాది (10), సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, కర్మణి ప్రయోగము.

లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**మృగ్యతే** –మృగ్యేతే – మృగ్యన్తే.

బి) మృగ – అన్వేషణే.

To search for, కం. మృగ్యతి, తారానాథేన దివాదావప్యపారి।

---

**శ్లో॥ నివర్తయాస్మాదసదీప్సితాన్మనః
క్వ తద్విధస్త్వం క్వ చ పుణ్యలక్షణా।
అపేక్ష్యతే సాధుజనేన వైదికీ
శ్మశానశూలస్య న యూపసత్క్రియా॥ 73**

**పదవిభాగము :–** నివర్తయ, అస్మాత్, అసదీప్సితాత్, మనః, క్వ, తద్విధః, త్వమ్, క్వ, చ, పుణ్యలక్షణా, అపేక్ష్యతే, సాధుజనేన, వైదికీ, శ్మశానశూలస్య, న, యూపసత్క్రియా।

**అన్వయక్రమము :–** అస్మాత్, అసదీప్సితాత్, మనః, నివర్తయ। తద్విధః క్వ పుణ్యలక్షణా త్వమ్ చ క్వ సాధుజనేన శ్మశానశూలస్య వైదికీ యూపసత్క్రియా న అపేక్ష్యతే।

**ప్రతిపదార్థము :–** అస్మాత్ – ఈ, అసదీప్సితాత్ – చెడ్డకోరికనుండి, మనః – మనస్సును, నివర్తయ – మఱల్చుకొమ్ము, తద్విధః – అట్టివాడు, క్వ – ఎక్కడ?, పుణ్యలక్షణా – మంచి భాగ్యచిహ్నములుగలదానవు, త్వమ్ చ క్వ – నీవును ఎక్కడ?, సాధుజనేన – సత్పురుషునిచేత, శ్మశానశూలస్య – వల్లకాటి కొఱ్ఱికి, వైదికీ – వేదోక్తమైన, యూపసత్క్రియా – యూపమునకు చేయు సంస్కారము, న అపేక్ష్యతే – కోరబడదు.

**పాఠాన్తరాలు :–** 1. అపేక్షతే సాధుజనేన వైదికీ – అపేక్షతే సాధుజనో న వైదికీం

**విభక్తులు/క్రియలు :–** 1. అస్మాత్ – **అస్మాత్,** ఆభ్యామ్, ఏభ్యః; మకారాన్త నపుంసకలింగ 'ఇదమ్' శబ్దము. పం.ఏ 2. అసదీప్సితాత్ – **అసదీప్సితాత్,** అసదీప్సితాభ్యామ్, అసదీప్సితేభ్యః; అకారాన్త నపుంసకలింగ అసదీప్సితశబ్దము. పం.ఏ 3. మనః – **మనః,** మనసీ, మనాంసి; సకారాన్త నపుంసకలిగ మనశ్శబ్దము ద్వి.ఏ 4. నివర్తయ – క్రియ – లోట్, మ.ఏ 5. తద్విధః – **తద్విధః,** తద్విధౌ, తద్విధాః అకారాన్త పుంలింగ తద్విధశబ్దము ప్ర.ఏ 6, క్వ, చ, న – అవ్యయాలు 7. పుణ్యలక్షణా – **పుణ్యలక్షణా,** పుణ్యలక్షణే, పుణ్యలక్షణాః; ఆకారాన్త స్త్రీలింగ పుణ్యలక్షణాశబ్దము. ప్ర.ఏ 8. త్వమ్ – త్వమ్, యువామ్, యూయమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ప్ర.ఏ 9. సాధుజనేన – **సాధుజనేన,** సాధుజనాభ్యామ్, సాధుజనైః; అకారాన్త పుంలింగ సాధుజనశబ్దము. తృ.ఏ 10. శ్మశానశూలస్య – **శ్మశానశూలస్య,** శ్మశానశూలయోః శ్మశానశూలానామ్; అకారాన్త పుంలింగ శ్మశానశూలశబ్దము. ష.ఏ 11. వైదికీ – **వైదికీ,** వైదిక్యౌ, వైదిక్యః; ఈకారాన్త స్త్రీలింగ వైదికీశబ్దము. ప్ర.ఏ 12. యూపసత్క్రియా – **యూపసత్క్రియా,** యూపసత్క్రియే, యూపసత్క్రియాః ; ఆకారాన్త స్త్రీలింగ యూపసత్క్రియాశబ్దము. ప్ర.ఏ 13. అపేక్ష్యతే – క్రియ – కర్మణి

**సమాసాలు :–**

1. అసదీప్సితాత్ – న సత్ (నఞ్తత్పు.) అసత్, అసచ్చ తదీప్సితమ్(కర్మధా,) తస్మాత్।
2. తద్విధః – సా విధా యస్య (బహువ్రీహి) సః, తద్విధః।
3. పుణ్యలక్షణా – పుణ్యాని లక్షణాని యస్యాః (బహువ్రీహి) సా।
4. సాధుజనేన – సాధుః చాసౌ జనః (కర్మ) తేన।
5. శ్మశానశూలస్య – శ్మశానస్య శూలః (ష.త.) శ్మశానశూలః తస్య।
6. యూపసత్క్రియాః – సతీ చాసౌ క్రియా సత్క్రియా (కర్మధా.) యూపస్య సత్క్రియా (ష.త.) యూపసత్క్రియా।



**సంధులు :–**

1. నివర్తయ + అస్మాత్ – నివర్తయాస్మాత్ – సవర్ణదీర్ఘసన్ధిః।
2. ఈప్సితాత్ + మనః – ఈప్సితాన్మనః – అనునాసికసన్ధిః।
3. తద్విధః + త్వమ్ – తద్విధస్త్వమ్ – విసర్గసన్ధిః (సకారాదేశః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. యూపః –**

ఎ) యజ్ఞే పశుబంధనకాష్ఠమ్।

బి) కు యుభ్యాం చ – 3–27 ఇతి పః। యు – మిశ్రణే (అదాది। పరస్మైపదీ/సేట్) + పః। యువన్తి బధ్నన్త్యస్మిన్ పశుమితి యూపః – యజ్ఞస్తమ్భః।

సి) కిత్ దీర్ఘశ్చ। కౌతి శబ్దయతీతి కూపః, (ఉదపానం వా)।
యౌతి మిశ్రయతీతి యూపః, యజ్ఞశాలాస్తమ్భో వా (చాన్నిత్)।
కూపయూపయోరాద్యుదాత్తత్వదర్శనాన్నిదనువృత్తిరావశ్యకీ।

– ఇతి ఉణాదికోషః

డి) శ్లో॥ గ్రామేష్వాత్మవిసృష్టేషు
**యూపచి**హ్నేషు యజ్వనామ్।
అమోఘాః ప్రతిగృహ్ణన్తా–
వర్ఘ్యానుపదమాశిషః॥ – ర.వం. 1–44

"మునుపు తమ వంశమువారు విడిచిపెట్టిన యూపస్తంభములే గుర్తుగాకల మార్గమధ్యమునందున్న గ్రామములయందలి సోమయాజులు సమర్పించిన అర్ఘ్యమును, దాని వెంటనే వారి అమోఘమైన ఆశీస్సులను స్వీకరించుచు ముందుకు సాగిరి".

ఇ) శ్లో॥ మేదస్వినం విపులకాణ్డవభక్షణేన
దేహం నిజం చలయితుం శిఖినోఽక్షమస్య।
ఉద్గమ్య సంజ్వలితుముత్తరవేదికాయామ్
ఆలమ్బనాయ కిల **యూపవరో**ఽన్తికేఽభూత్। **– చంపూభారతే 4–11**

**అలంకారములు :–** అత్ర సాదృశ్యనిమిత్తాప్రస్తుతప్రశంసాలంకారః।
"అప్రస్తుతప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా।" అని చంద్రాలోకమున లక్షణము చెప్పబడినది. ప్రస్తుతము నాశ్రయించుకొని అప్రస్తుతమును తలచినయెడల అది అప్రస్తుతాలంకారమగును. ఇది సరిగా సమాసోక్తికి విరుద్ధముగా వర్తించును. సమాసోక్తియందు ప్రస్తుతమును పేర్కొనగా అప్రస్తుతము స్ఫురించును. ఏతావతా ఈ రెండింటియందు ప్రకృతాప్రకృతములను రెండింటిని సంక్షేపించుటయే జరుగును. అప్రస్తుతమును ప్రశంస చేయుట యిందు జరుగును.

యజ్ఞంలో పశువును బంధించే స్తంభాన్ని **'యూప'**మని పిలుస్తారు. దానికి పవిత్రమైన కఱ్ఱను వాడుతారు. అది లభించలేదని శ్మశానంలోని వధ్య స్తంభాన్ని తీసుకొచ్చి వాడరుగదా।

ఓ పార్వతీదేవీ! నీవు మంగళప్రదురాలవు. శ్మశానంలో తిరిగే శివుణ్ణి వివాహమాడ సరియా!

అని ఈ శ్లోకమున వర్ణింపబడుటచే ఇందు 'సాదృశ్యనిమిత్తక అప్రస్తుత ప్రశంసాలంకార'మున్నదని చెప్పదగును.

మఱియును – సామాన్యముచే విశేషము సమర్థింపబడుటచే 'అర్థాన్తర న్యాసాలంకార'మున్నదనియు చెప్పదగును.

**క్రియాదర్శము :– 1. నివర్తయ** – ని – ఉపసర్గ, 'వృతు – వర్తనే' అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాది,(1) లోట్ –మధ్యమపురుషైకవచనాంతః। ణి జన్తాత్। పరస్మైపదీ।

**నివర్తయ** – నివర్తయతమ్ – నివర్తయత.

**2. అపేక్ష్యతే** – అప – ఉపసర్గ, 'ఈక్ష – దర్శనే' – కర్మణి, లట్.
**అపేక్ష్యతే** – అపేక్ష్యేతే – అపేక్ష్యన్తే.

---

**శ్లో॥ ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదిని**
**ప్రవేపమానాధరలక్ష్యకోపయా।**
**వికుఞ్చితభ్రూలతమాహితే తయా**
**విలోచనే తిర్యగుపాన్తలోహితే॥ 74**



**పదవిభాగము :–** ఇతి, ద్విజాతౌ, ప్రతికూలవాదిని, ప్రవేపమానాధరలక్ష్యకోపయా, వికుంచితభ్రూలతమ్, ఆహితే, తయా, విలోచనే, తిర్యగ్, ఉపాన్తలోహితే।

**అన్వయక్రమము :–** ఇతి, ద్విజాతౌ, ప్రతికూలవాదిని, ప్రవేప...కోపయా, తయా, ఉపాంతలోహితే, విలోచనే, వికుంచితభ్రూలతమ్, తిర్యక్, ఆహితే।

**ప్రతిపదార్థము :–** ఇతి – ఇవ్విధముగ, ద్విజాతౌ – ఆ బ్రాహ్మణుడు, ప్రతికూలవాదిని (సతి) – విరుద్ధముగ పలుకుచుండగా, ప్రవేపమాన – అధర –లక్ష్య –కోపయా – అదురుచున్న పెదవిచేత చూడనయిన కినుక గలదైన, తయా – ఆ పార్వతీదేవిచేత, ఉపాంతలోహితే – కొనలయందు ఎఱ్ఱనైన, విలోచనే – కన్నులు, వికుంచిత భ్రూలతమ్ – వక్రము చేయబడిన కనుబొమలు కలుగునట్లు, తిర్యక్ – అడ్డముగ, ఆహితే – ఉంచబడినవి.

**తాత్పర్యము :–** ఇవ్విధముగ ఆ బ్రాహ్మణుడు విరుద్ధముగ పలుకుచుండగా అదురు చున్న పెదవిచేత చూడనైన కినుకగలదైన ఆ పార్వతీదేవిచేత కొనలయందు ఎఱ్ఱనైన కన్నులు, వక్రము చేయబడిన కనుబొమలు కలుగునట్లు అడ్డముగ ఉంచబడినవి.

**పాఠాన్తరాలు :–** 1. వికుఞ్చిత – నికుఞ్చిత 2. భ్రూలతమ్ – భ్రూలతయా

**విభక్తులు/క్రియలు :–** 1. ఇతి, తిర్యక్ –అవ్యయాలు 2. ద్విజాతౌ – **ద్విజాతౌ,** ద్విజాత్యోః, ద్విజాతిషు; ఇకారాన్త పుంలింగ ద్విజాతిశబ్దము. స.ఏ 3. ప్రతికూలవాదిని – **ప్రతికూలవాదిని,** ప్రతికూలవాదినోః, ప్రతికూలవాదిషు; నకారాన్త పుంలింగ ప్రతికూలవాదిన్‌శబ్దము. స.ఏ 4. ప్రవేప...కోపయా – ...**కోపయా**, ...కోపాభ్యామ్, ...కోపాభిః; ఆకారాన్త స్త్రీలింగ...కోపాశబ్దము. తృ.ఏ 5. తయా – **తయా,** తాభ్యామ్, తాభిః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. తృ.ఏ 6. ఉపాంతలోహితే – ఉపాంతలోహితమ్, **ఉపాన్తలోహితే**, ఉపాంతలోహితాని; అకారాన్త నపుంసకలింగ ఉపాంత లోహితశబ్దము. ప్ర.ద్వి. 7. విలోచనే – విలోచనమ్, **విలోచనే**, విలోచనాని ; అకారాన్త నపుంసకలింగ విలోచన శబ్దము. ప్ర.ద్వి. 8. వికుంచితభ్రూలతమ్ – క్రియావిశేషణము 9.ఆహితే – ఆహితమ్, **ఆహితే**, ఆహితాని; అకారాన్త నపుంసకలింగ ఆహితశబ్దము. ప్ర.ద్వి.

**సమాసాలు :–**

1. ద్విజాతౌ – ద్వే జాతీ యస్య సః – ద్విజాతిః (బహువ్రీహి) తస్మిన్।
2. ప్రవేపమానాధరలక్ష్యకోపయా – ప్రవేపమానః చాసౌ అధరశ్చ ప్రవేపమానాధరః (కర్మధా.) ప్రవేపమానాధరేణ లక్ష్యః – ప్రవేపమాన ధరలక్ష్యః (తృ.త.), ప్రవేపమానాధరలక్ష్యః, కోపః, యస్యాః సా– ప్రవేపమానాధరలక్ష్యకోపా(బహువ్రీహి), తయా।

3. వికుంచితభ్రూలతమ్ – వికుంచితే భ్రూలతే యస్మింస్తత్ తథా (క్రియా విశేషణమ్)
4. ఉపాంతలోహితే – ఉపాంతయోః లోహితే – ఉపాంతలోహితే – (స.త.) తే।

**సంధులు :–**

1. తిర్యక్ + ఉపాన్తలోహితే – తిర్యగుపాన్తలోహితే – జశ్త్వసన్ధిః

**పదవ్యుత్పత్తి –నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. లోహితః** – రక్తవర్ణయుక్తః।

ఎ) రుహ్యతే ఇతి। రుహ్ + 'రుహేరశ్చ లో వా' ఇతి ఇతన్, రస్య లత్వమ్।

బి) శ్లో॥ అరుణః శోణో రక్తో మాంజిష్ఠః పాటలస్తథా తామ్రః।
**లోహిత** ఇత్యేకార్థాః కవిభిః శబ్దాః ప్రయుజన్తే॥ 733
అని హలాయుధకోశము '7'నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ లోహితాన్ వృక్షనిర్యాసాన్ వ్రశ్చన ప్రభవాంస్తథా।
శేలుం గవ్యం చ పీయూషం ప్రయత్నేన వివర్జయేత్॥
– మనుస్మృతి 5–6

డి) శ్లో॥ స్రస్తాంసావతిమాత్ర**లోహితత**లౌ బాహూ ఘటోత్క్షే పణాత్
అద్యాపి స్తన**వేప**థుం న జహతి శ్వాసః ప్రమాణాదికః।
బద్ధం కర్ణశిరోషరోధివదనే ఘర్మాంభసాం జాలకం
బన్ధే స్రంసిని చైక హస్తయమితాః పర్యాకులా మూర్ధజాః॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే 1–28

'ఈ శకున్తల మూపున నీటికుండను మోయుటచే భుజములు వంగినవి. పాణితలములు **మిక్కిలి ఎఱుపెక్కి**నవి. ప్రమాణమును మించిన శ్వాస ఇంకనూ స్తనకంపమును కలిగి విడిచిపెట్టుట లేదు. ఈ కాంత చెవిని ధరించిన దిరిసిన పువ్వులంటుకొని పోవునట్లుగా మోము చెమటలు క్రమ్మినవి. ఊడిన కేశపాశము ఒక్కచేతిచే మెలిపెట్టి ముడి వేయుటతో కేశములు చెల్లాచెదరై గానవచ్చుచున్నవి.

---



**శ్లో॥ ఉవాచ చైనం పరమార్థతో హరం**
**న వేత్సి నూనం యత ఏవమాత్థ మామ్।**
**అలోకసామాన్యమచిన్త్యహేతుకం**
**ద్విషన్తి మన్దాశ్చరితం మహాత్మనామ్॥ 75**

**పదవిభాగము :–** ఉవాచ, చ, ఏనమ్, పరమార్థతః, హరమ్, న, వేత్సి, నూనమ్, యతః, ఏవమ్, ఆత్థ, మామ్, అలోకసామాన్యమ్, అచిన్త్యహేతుకమ్, ద్విషన్తి, మన్దాః, చరితమ్, మహాత్మనామ్।

**అన్వయక్రమము :–** ఏనమ్ ఉవాచ చ పరమార్థతః హరం న వేత్సి। నూనం యతః మామ్ ఏవమ్ ఆత్థ అలోకసామాన్యమ్ అచిన్త్యహేతుకం మహాత్మనాం చరితం మన్దాః ద్విషన్తి।

**ప్రతిపదార్థము :–** ఏనమ్ – ఈ బ్రహ్మచారినిగూర్చి, ఉవాచ చ – మఱి ఇట్లు పలికినది. పరమార్థతః – వాస్తవముగ, హరమ్ – శివుని, న వేత్సి – ఎఱుగవు. నూనమ్ – (అది) నిశ్చయము. యతః – ఏల, మామ్ – (నన్ను) నాతో, ఏవమ్ – ఇట్లు, ఆత్థ – పలుకుచుంటివో, అలోకసామాన్యమ్ – అనితరసాధారణము, అచిన్త్యహేతుకమ్ – ఊహింపశక్యమయిన కారణముగలది కానట్టిది అగు, మహాత్మనామ్ – పెద్దలయొక్క, చరితమ్ – ఆచరణమును, మన్దాః – మూఢులు, ద్విషన్తి – దూషింతురు.

**తాత్పర్యము :–** ఈ బ్రహ్మచారినిగూర్చి మఱి ఇట్లు పలికినది. వాస్తవముగ శివుని ఎఱుగవు. (అది) నిశ్చయము. ఏల నాతో ఇట్లు పలుకుచుంటివో? అనితర సాధారణము, ఊహింపశక్యమైన కారణము గలది కానట్టిది అగు పెద్దలయొక్క ఆచరణమును మూఢులు దూషింతురు.

**విభక్తులు/క్రియలు :–** 1. ఏనమ్ – **ఏనమ్**, ఏనౌ, ఏనాన్; మకారాన్త పుంలింగ 'ఇదమ్'శబ్దము. ద్వి.ఏ 2. ఉవాచ – క్రియ 3. పరమార్థతః – తసిల్ ప్రత్యయాన్తావ్యయము 4. హరమ్ – **హరమ్,** హరౌ, హరాన్; అకారాన్త పుంలింగ హరశబ్దము. ద్వి.ఏ 5. న, నూనమ్ – అవ్యయాలు 6. వేత్సి – క్రియ 7. యతః – అవ్యయము 8. మామ్ – **మామ్**, ఆవామ్, అస్మాన్; దకారాన్త స్త్రీలింగ 'అస్మ'ఛ్ఛబ్దము. ద్వి.ఏ 9. ఆత్థ – క్రియ 10. అలోకసామాన్యమ్ – ...**సామాన్యమ్,** ...సామాన్యే, ...సామాన్యాని ; అకారాన్త నపుంసక...సామాన్యశబ్దము. ద్వి.ఏ 11. అచిన్త్యహేతుకమ్ – ...**హేతుకమ్,** ...హేతుకే, ...హేతుకాని; అకారాన్త నపుంసకలింగ హేతుకశబ్దము. ద్వి.ఏ 12. చరితమ్ – **చరితమ్,** చరితే, చరితాని; అకారాన్త నపుంసకలింగ చరితశబ్దము. ద్వి.ఏ 13. మన్దాః – మన్దః, మన్దౌ, **మన్దాః;**

అకారాన్త పుంలింగ మన్దశబ్దము. ప్ర.బ 14. ద్విషన్తి - క్రియ 15. మహాత్మనామ్ - మహాత్మనః, మహాత్మనోః, **మహాత్మనామ్**; నకారాన్త పుంలింగ మహాత్మన్‌శబ్దము. ష.బ

**సమాసాలు / విగ్రహవాక్యాలు :-**

1. పరమార్థతః - పరమః చాసౌ అర్థః పరమార్థః, తస్మాత్, పరమార్థతః, పంచమ్యర్థే, సార్వవిభక్తికస్తసిః।
2. అలోకసామాన్యమ్ - లోకేషు సామాన్యమ్ (స.త.) లోకసామాన్యమ్, న లోకసామాన్యమ్, (నఞ్‌తత్పు.) అలోకసామాన్యమ్। తత్।
3. అచిన్త్యహేతుకమ్ - న చిన్త్యః అచిన్త్యః స హేతుః యస్య (బహువ్రీహి) అచిన్త్యహేతుకమ్, తత్। (సమాసాంతః కప్)
4. మహాత్మనామ్ - మహాన్ ఆత్మా యేషాం తే (బహువ్రీహి) మహాత్మానః, తేషామ్।

**సంధులు :-**

1. చ + ఏనమ్ - చైనమ్ - వృద్ధిసన్ధిః - **వృద్ధిరేచి** (సూ 6-1-85) అవర్ణమునకు (అ,ఆలకు) ఏఓఐఔలు పరమగునపుడు పూర్వపరముల స్థానములో వృద్ధి ఏకాదేశమగును. ఏఐలు పరమగునపుడు ఐకారమును, ఓఔలు పరమగునపుడు ఔ కారము వచ్చునని తాత్పర్యము.
2. పరమార్థతః+హరమ్ - పరమార్థతో హరమ్ - ఉత్వాదేశః।
3. మన్దాః + చరితమ్ - మన్దాశ్చరితమ్ - శ్చుత్వసన్ధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. నూనమ్** - అవ్యయకోశః (485)

**ఎ) 'తర్కనిశ్చయోత్ప్రేక్షాదయోఽస్యార్థాః"**

1. తర్కే - 'నూనం శరత్ ప్రఫుల్లా హి కాశాః'
2. నిశ్చయే - 'నూనమయం జానాతి।'
3. ఉత్ప్రేక్షాయామ్ - 'నూనమస్య దైవోఽనుగ్రహః'। భాష్యే 6-3-109

**బి) స్మరణవాక్యపూరణయోరపి దృశ్యతే**

1. స్మరణే - 'నూనం సా తవ ప్రియా।'
2. వాక్యపూరణే - 'స ఏవ నూనం జడవద్ బ్రవీతి'।

సి) 'అద్య' ఇత్యర్థకోఽపి ఋక్షు ప్రయుజ్యతే। యథా-
'నమః పురా తే వరుణోత నూనమ్' (ఋక్ 2-8-28)।





**అలంకారములు :-** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకారము'న్నదని చెప్పదగును. ఉత్తరార్ధరూపసామాన్యముచే పూర్వార్ధరూపవిశేషము సమర్థించిన 'అర్థాన్తర న్యాసాలంకారము' ఇందు గలదు.

**క్రియాదర్శము :-**

1. ఉవాచ - 3వశ్లోక భాగవ్యాఖ్య - చూడగలరు.
2. వేత్సి - 58వశ్లోక భాగవ్యాఖ్య చూడగలరు.
3. **ఆత్థ** - బ్రూఞ్ (బ్రూ) వ్యక్తాయాం వాచి(మాట్లాడుట) ద్వికర్మకమ్, సేట్, పరస్మైపదీ, అదాదిప్రకరణమ్(2), లట్, మధ్యమపురుషైకవచనమ్।
   **ఆత్థ** - ఆహథుః - బ్రూథ
4. **ద్విషన్తి** 'ద్విష - అప్రీతౌ' (ద్వేషించుట) సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ, అదాదిప్రకరణమ్ (2), లట్ - ప్రథమపురుషబహువచనాంతః
   ద్వేష్టి - ద్విష్టః - **ద్విషన్తి.**

---

**అవతారికా :-** సంప్రతి 'అమఙ్గలాభ్యాసరతిమ్' ఇత్యాద్యుక్తం దూషణజాతం 'విపద్' ఇత్యాదిభిః షడ్భిః శ్లోకైః పరిహర్తుమారభతే। ఇప్పుడు అమంగళాభ్యాసరతుడని చెప్పిన దూషణలను ఆఱుశ్లోకములతో పరిహరించుటకు ఆరంభించుచున్నది.

**శ్లో॥ విపత్ప్రతీకారపరేణ మఙ్గళం**
**నిషేవ్యతే భూతిసముత్సుకేన వా।**
**జగచ్ఛరణ్యస్య నిరాశిషః సతః**
**కిమేభిరాశోపహతాత్మవృత్తిభిః॥ 76**

**పదవిభాగము :-** విపత్ప్రతీకారపరేణ, మఙ్గళమ్, నిషేవ్యతే, భూతిసముత్సుకేన, వా, జగత్ శరణ్యస్య, నిరాశిషః, సతః, కిమ్, ఏభిః, ఆశోపహతాత్మవృత్తిభిః।

**అన్వయక్రమము :-** విపత్ - ప్రతీకారపరేణ వా భూతి - సముత్సుకేన మఙ్గలం నిషేవ్యతే జగత్ శరణ్యస్య నిరాశిషః సతః ఆశా - ఉపహత - ఆత్మవృత్తిభిః, ఏభిః కిమ్:

**ప్రతిపదార్థము :-** విపత్ - ప్రతీకారపరేణ వా - కీడునకు నివారణ ముఖ్యముగాగల వానిచేతగాని, భూతిసముత్సుకేన వా - ఐశ్వర్యమందు పూనికగలవానిచేగాని,

మంగళమ్ – శుభవస్తువు, నిషేవ్యతే – ధరింపబడును, జగత్ + శరణ్యస్య – లోకరక్షకుడైనట్టియు, నిరాశిషః – కోరికలు లేనివాడైయున్న, సతః – శివునికి, ఆశా – ఉపహత – ఆత్మవృత్తిభిః – కోరికల చేత చెడగొట్టబడిన చిత్తవృత్తిగలవియు అగు, ఏభిః – ఈ మంగళములచేత, కిమ్ – ఏమి ప్రయోజనము?

**తాత్పర్యము :–** కీడునకు నివారణ ముఖ్యముగాగల వానిచే గాని, ఐశ్వర్యమందు పూనికలగల వానిచే గాని శుభవస్తువు ధరింపబడును. లోకరక్షకుడైనట్టియు కోరికలు లేనివాడైయున్న శివునికి కోరికలచేత చెడగొట్టబడిన చిత్తవృత్తిగలవియు అగు ఈ మంగళముల చేత ఏమి ప్రయోజనము?

**పాఠాన్తరాలు :–**

1. కిమేభిః – కిమాభిః

**విభక్తులు/క్రియలు :–** 1. విపత్ప్రతీకారపరేణ – ...**పరేణ,** ...పరాభ్యామ్, ...పరైః ; అకారాన్త పుంలింగ ...పరశబ్దము. తృ.ఏ 2. భూతిసముత్సుకేన – ...**ఉత్సుకేన,** ...ఉత్సుకాభ్యామ్, ...ఉత్సుకైః; అకారాన్త పుంలింగ ఉత్సుకశబ్దము. తృ.ఏ 3. మంగళమ్ – **మంగళమ్,** మంగళే, మంగళాని; అకారాన్త నపుంసకలింగ మంగళశబ్దము ప్ర.ఏ 4. నిషేవ్యతే – క్రియ 5. జగచ్ఛరణ్యస్య – **జగచ్ఛరణ్యస్య,** జగచ్ఛరణ్యయోః, జగచ్ఛరణ్యానామ్; అకారాన్త పుంలింగ జగచ్ఛరణ్యశబ్దము. ష.ఏ 6. నిరాశిషః – **నిరాశిషః,** నిరాశిషోః, నిరాశిషామ్; షకారాన్త పుంలింగ నిరాశీశ్శబ్దము. ష.ఏ 7. సతః – సతః, సతోః, సతతామ్; తకారాన్త పుంలింగ సత్‌శబ్దము. ష.ఏ 8. ఆశా...వృత్తిభిః – ...వృత్తినా, ...వృత్తిభ్యామ్, **...వృత్తిభిః** ; ఇకారాన్త నపుంసకలింగ ...వృత్తిశబ్దము. తృ.బ 9. ఏభిః – అనేన, ఆభ్యామ్, ఏభిః; మకారాన్త నపుంసకలింగ ఇదమ్‌శబ్దము. తృ.బ 10. కిమ్ – అవ్యయము

**సమాసాలు :–**

1. విపత్ప్రతీకారపరేణ – విపదః ప్రతీకారః (ష.త.) విపత్ప్రతీకారే పరః (స.త.) సః, తేన।
2. భూతిసముత్సుకేన – భూతౌ సముత్సుకః (స.త.) భూతిసముత్సుకః, తేన।
3. జగచ్ఛరణస్య – జగతః శరణ్యః (ష.త.) జగచ్ఛరణః, తస్య।
4. నిరాశిషః – నిర్గతః ఆశీః యస్మాత్ (బహువ్రీహి) సః, నిరాశీః, తస్య।
5. ఆశోపహతాత్మవృత్తిభిః – ఆశయా ఉపహతా (తృ.త.) ఆశోపహతా, ఆత్మనః వృత్తిః (ష.త) ఆత్మవృత్తిః, ఆశోపహతా ఆత్మవృత్తిః యేషాం (బహువ్రీహి), తాని ఆశోపహతావృత్తీని, తైః।

**సంధులు :–**

1. ఏభిః + ఆశోపహతా – ఏభిరాశోపహతా – విసర్గసన్ధిః (రుత్వమ్)।

100



2. జగత్ + శరణ్యస్య – జగచ్ఛరణ్యస్య

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. **వా** – అవ్యయకోషః (708)
**వికల్పోపమాన ద్వంద్వ సముచ్చయావధారణానవక్లప్తివితర్కపాదపూరణాదిషు వర్తతే।**

1. వికల్పే – ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వాపి తద్విధా.। – మనుస్మృతి 2-112
2. ఉపమానే – 'వ్యోమ పశ్చిమకలాస్థితేన్దు వా। – ర.వం. 19-51
3. ద్వంద్వే – 'సా వా శమ్భోస్తదీయా వా మూర్తిర్జలమయీ మమ' (కు.సం. 2-60) న తృతీయేత్యర్థః।
4. సముచ్చయే – 'వాయుర్వా త్వా మనుర్వా త్వా'। (తై.సం. 1-7-7-2)
5. అవధారణే – 'సుయోధనం వా న గుణైరతీతాః' (కిరాత. 3-13)
6. అనవక్లప్తౌ – 'శస్త్రవేదమధిగమ్య తత్త్వతః కస్య వేహ...' (కిరాత 13-62)
7. వితర్కే – 'కిం తే హిడింబ ఏతైర్వా సుఖసుప్తైః ప్రబోధితైః'।
8) పాదపూరణే – 'దేవాసురగణాన్ వాపి సగన్ధర్వోరగాన్ భువి' – (రామాయణే 1-25-3)
9. 'కదాచిద్ భవతి, కదాచిన్న భవతి' ఇత్యర్థే వైయాకరణైరయం బహుల ముపయుజ్యతే। అర్థోఽయం లోకేఽతీవాప్రసిద్ధః। 'దోషో ణౌ, వాచిత్తవిరాగే' 'చిత్తం దూషయతి దోషయతి వా' ఇతి రూపద్వయసాధనమత్ర వివక్షితమ్।

**క్రియాదర్శము :– నిషేవ్యతే** – షే వృ (సేవ్) – అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాది(1), లట్ – ప్రథమపురుషైకవచనాంతః। కర్మణి.

**నిషేవ్యతే** – నిషేవ్యేతే – నిషేవ్యన్తే.

---

**శ్లో॥ అకిఞ్చనః సన్ ప్రభవః స సమ్పదాం**
**త్రిలోకనాథః పితృసద్మగోచరః।**
**స భీమరూపః శివ ఇత్యుదీర్యతే**
**న సన్తి యాథార్థ్యవిదః పినాకినః॥ 77**

**పదవిభాగము :–** అకించనః, సన్, ప్రభవః, సః, సమ్పదామ్, త్రిలోకనాథః, పితృసద్మగోచరః, సః, భీమరూపః, శివః, ఇతి, ఉదీర్యతే, న, సన్తి యాథార్థ్యవిదః, పినాకినః॥

**అన్వయక్రమము :–** సః అకించనః సన్ సమ్పదాం ప్రభవః పితృసద్మగోచరః త్రిలోకనాథః సః భీమరూపః శివః ఇతి ఉదీర్యతే। పినాకినః యాథార్థ్యవిదః న సన్తి।

**ప్రతిపదార్థము :–** సః – అతడు, అకించనః సన్ – దరిద్రుడగుచు, సమ్పదామ్ – సంపదలకు, ప్రభవః – కారణుడు, పితృసద్మ – గోచరః సన్ – శ్మశానాశ్రయుడగుచు, త్రిలోకనాథః – ముల్లోకముల కేలిక. సః – అతడు, భీమరూపః సన్ – భయంకరమైన స్వరూపముగలవాడగుచు, శివః ఇతి – సౌమ్యరూపుడు అని, ఉదీర్యతే – చెప్పబడుచున్నాడు. పినాకినః – శివునియొక్క, యాథార్థ్యవిదః – తత్త్వమును ఎఱింగినవారు, న సన్తి –ఉండరు.

**తాత్పర్యము :–** అతడు దరిద్రుడగుచు సంపదలకు కారణుడు. శ్మశానాశ్రయుడగుచు ముల్లోకమల కేలిక. అతడు భయంకరమయిన స్వరూపముగల వాడగుచు, సౌమ్యరూపుడు అని చెప్పబడుచున్నాడు. శివతత్త్వమును ఎఱింగినవారు ఉండరు.

**పాఠాన్తరాలు :–** 1. త్రిలోకనాథః – స లోకనాథః 2. యాథార్థ్య – యాథాత్మ్య

**విభక్తులు/క్రియలు :–** 1. సః – **సః**, తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 2. అకించనః – **అకించనః**, అకించనౌ, అకించనాః; అకారాన్త పుంలింగ అకించనశబ్దము. ప్ర.ఏ 3. సమ్పదామ్ – సమ్పదః, సమ్పదోః, **సమ్పదామ్**; దకారాన్త స్త్రీలింగ సంపద్‌శబ్దము. ష.బ 4. ప్రభవః – **ప్రభవః**, ప్రభవౌ, ప్రభవాః; అకారాన్త పుంలింగ ప్రభవశబ్దము. ప్ర.ఏ 5. పితృసద్మగోచరః – ...**గోచరః,** ...గోచరౌ, ...గోచరాః; అకారాన్త పుంలింగ...గోచరశబ్దము. ప్ర.ఏ 6. త్రిలోకనాథః – **త్రిలోకనాథః,** త్రిలోకనాథౌ, త్రిలోకనాథాః; అకారాన్త పుంలింగ త్రిలోకనాథశబ్దము. ప్ర.ఏ 7. భీమరూపః – **భీమరూపః**, భీమరూపౌ, భీమరూపాః; అకారాన్త పుంలింగ భీమరూపశబ్దము. ప్ర.ఏ 8. శివః – **శివః,** శివౌ, శివాః; అకారాన్త పుంలింగ శివశబ్దము. ప్ర.ఏ 9. ఉదీర్యతే – క్రియ – కర్మణి 10. పినాకినః – **పినాకినః**, పినాకినోః, పినాకినామ్; నకారాన్త పుంలింగ పినాకిన్‌శబ్దము. ష.ఏ 11. యాథార్థ్యవిదః – విత్, ...విదౌ, ...**విదః**; దకారాన్త పుంలింగ ...విద్‌శబ్దము. ప్ర.బ 12. న – అవ్యయము 13.సన్తి–క్రియ 14.సన్– **సన్,** సంతౌ, సన్తః సచ్ఛబ్దము. తకారాన్త పుంలింగము ప్ర.ఏ.

**సమాసాలు :–**

1. అకించనః – అవిద్యమానం కించన యస్య (బహుర్వీహి) సః।
2. పితృసద్మగోచరః – పితౄణాం సద్మ (ష.త.) పితృసద్మ గోచరః యస్య (బహుర్వీహి) సః।





3. త్రిలోకనాథః – త్రయాణాం లోకానాం నాథః (ఉత్తరపదద్విగు.)
4. భీమరూపః – భీమం రూపం యస్య (బహుర్వీహి) సః, భీమరూపః।
5. యాథార్థ్యవిదః – యథాభూతః అర్థః (సుప్సుపా) యథార్థః, తస్య భావః యాథార్థ్యమ్, యాథార్థ్యం విదన్తి (ఉపపదతత్పు.) ఇతి తే।

**సంధులు :–**

1. సః + భీమరూపః – స భీమరూపః – సులోపః।
2. శివః + ఇతి – శివ ఇతి – విసర్గలోపః।
3. ఇతి + ఉదీర్యతే – ఇత్యుదీర్యతే – యణాదేశసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. సన్** – (త్రి.)

ఎ) అస్తీతి। అస్ శతృ।

బి) శ్లో॥ ధీరో ధీమాన్ లబ్ధవర్ణో విపశ్చిద్
వృద్ధో విద్వాన్ ప్రాప్తరూపోఽభిరూపః।
సూరిః ప్రాజ్ఞః పణ్డితః **సన్మ**నీషీ
జ్ఞో దోషజ్ఞః కోవిదః స్యాత్ప్రబుద్ధః॥ 332

శ్లో॥ బుధః సుధీః కృతీ కృష్టిః కవిర్వ్యక్తో విశారదః।
విచక్షణశ్చ మేధావీ సంఖ్యావాన్మతిమాన్మతః॥ 333

అని హలాయుధకోశము 'సత్' శబ్దమునకు '28' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ స్థానే భవానేకనరాధి**పస్స**–
**న్నకించనత్వం** మఖజం వ్యనక్తి।
పర్యాయపీతస్య సురైర్హిమాంశోః
కళాక్షయః శ్లాఘ్యతరో హి వృద్ధేః॥ – ర.వం. 5–16

"నీవు సార్వభౌముడవైన **వాడవగుచు** యజ్ఞజన్యమైన **నిర్ధనత్వము**ను ప్రకటన చేయుచున్నావు..."

డి) 'సన్మహత్పరమోత్కృష్టాః పూజ్యమానైః' (సూ. 2-1-61)
సద్వైద్యః వక్ష్యమాణేన మహతః ఆకారః। మహావైయాకరణః।

శ్లో॥ ప్రదక్షిణీకృత్య హుతం హుతాశ–
మనన్తరం భర్తురరున్ధతీం చ।

ధేనుం సవత్సాం చ నృపః ప్రతస్థే
సన్మంగలోదగ్రతరప్రభావః॥ - ర.వం. 2-71

-ఇతి పాణినిసూత్రవ్యాఖ్యాయామ్ - తత్పురుషసమాసప్రకరణే.

**క్రియాదర్శము :- 1. ఉదీర్యతే** - ఉత్, ఉపసర్గ, 'ఈర - క్షేపే' ఉప - ఉపసర్గతో కూడిన చెప్పుట అను అర్థము. సకర్మకమ్, సేట్, ఉభయపదీ, కర్మణిప్రయోగము. లిట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**ఉదీర్యతే** - ఉదీర్యేతే - ఉదీర్యన్తే

2. సన్తి - పూర్వశ్లోకవ్యాఖ్యాన భాగమున చెప్పబడినది.

---

**అవతారికా :-** దేవస్య లౌకికమలౌకికం చ ప్రసాధనం నాస్తీత్యాశయేనాహ। ఆ దేవునికి ప్రపంచములో ధరించుకొనునవిగాని, ధరింపనివిగాని భూషణములు లేవనుచున్నది.

**శ్లో॥ విభూషణోద్భాసి పినద్ధభోగి వా**
**గజాజినాలంబి దుకూలధారి వా।**
**కపాలి వా స్యాదథవేన్దుశేఖరం**
**న విశ్వమూర్తేరవధార్యతే వపుః॥ 78**

**పదవిభాగము :-** విభూషణోద్భాసి, పినద్ధభోగి, వా, గజాజినాలంబి, దుకూలధారి, వా, కపాలి, వా, స్యాత్, అథవా, ఇన్దుశేఖరమ్, న, విశ్వమూర్తేః, అవధార్యతే, వపుః।

**అన్వయక్రమము :-** విశ్వమూర్తేః వపుః విభూషణోద్భాసి పినద్ధభోగి గజ - అజిన - ఆలమ్బి వా దుకూలధారి కపాలి వా ఇన్దుశేఖరం న అవధార్యతే॥

**ప్రతిపదార్థము :-** విశ్వమూర్తేః - లోకస్వరూపుడగు శివునియొక్క, వపుః - శరీరము, విభూషణోద్భాసి స్యాత్ - అలంకారములచే ప్రకాశించునది అగును, పినద్ధ భోగి వా స్యాత్ - కట్టబడిన పాములు గలదిగా నైనను అగును, గజ - అజిన -ఆలమ్బి స్యాత్ - ఏనుగుతోలు ధరించునది అగును, దుకూలధారి వా స్యాత్ - పట్టువస్త్రము ధరించునది యైనను అగును. ఇన్దుశేఖరమ్ స్యాత్ - బాలచంద్ర శిరోభూషణముగల దైననగును. న అవధార్యతే - (ఐనను) (ఇట్టిదని) నిశ్చయింపబడదు.



**తాత్పర్యము :-** లోక స్వరూపుడగు శివునియొక్క శరీరము ఇట్టిదని నిశ్చయింపబడదు. 1. అలంకారములచే ప్రకాశించునది అగును. 2. కట్టబడిన పాములగలదిగానైనా అగును. 3. ఏనుగుతోలు ధరించునదియైనను అగును. 4. పుట్టైను ధరించునదియైనను అగును. 5. బాలచంద్రశిరోభూషణముగలదైనను అగును.

**పాఠాన్తరాలు :-** 1. అథవేన్దుశేఖరమ్ - అథ చన్ద్రశేఖరమ్.

**విభక్తులు/క్రియలు :-** 1.విశ్వమూర్తేః - **విశ్వమూర్తేః**, విశ్వమూర్త్యోః, విశ్వమూర్తీనామ్; ఇకారాన్త పుంలింగ విశ్వమూర్తిశబ్దము. ష.ఏ 2. వపుః - **వపుః**, వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుశ్శబ్దము. ప్ర.ఏ 3. విభూషణోద్భాసి -...**ఉద్భాసి**, ...ఉద్భాసినీ, ...ఉద్భాసీని; ఇకారాన్త నపుంసకలింగ...ఉద్భాసిశబ్దము. ప్ర.ఏ 4. ఇన్దుశేఖరమ్ - **ఇన్దుశేఖరమ్,** ఇన్దుశేఖరే, ఇన్దుశేఖరాణి; అకారాన్త నపుంసకలింగ ఇన్దుశేఖరశబ్దము. ప్ర.ఏ 5. పినద్ధభోగి - **పినద్ధభోగి,** పినద్ధభోగినీ, పినద్ధ భోగీని; ఇకారాన్త నపుంసకలింగ పినద్ధభోగిశబ్దము. ప్ర.ఏ 6. దుకూలధారి - **దుకూలధారి,** దుకూలధారిణీ, దుకూలధారీణి; ఇకారాన్త నపుంసకలింగ దుకూలధారిశబ్దము. ప్ర.ఏ 7. కపాలి - **కపాలి**, కపాలినీ, కపాలీని; ఇకారాన్త నపుంసకలింగ కపాలిశబ్దము. ప్ర.ఏ 8. గజాజినాలమ్బి - **...ఆలమ్బి,** ...ఆలమ్బినీ, ...ఆలమ్బీని ఇకారాన్త నపుంసకలింగ గజాజినాలమ్బిశబ్దము. ప్ర.ఏ 9. స్యాత్ - క్రియ 10.న - అవ్యయము 11. అవధార్యతే - క్రియ, కర్మణి

**సమాసాలు :-**

1. విభూషణోద్భాసి - విభూషణైః ఉద్భాసతే (ఉపపదతత్పు.) తచ్ఛీలమ్।
2. విశ్వమూర్తేః - విశ్వం మూర్తిః యస్య (బహువ్రీహి) సః, తస్య।
3. పినద్ధభోగి - పినద్ధః భోగీ యస్మిన్ (బహువ్రీహి) తత్।
4. గజాజినాలమ్బి - గజస్య అజినమ్ (ష.త.) గజాజినమ్, గజాజినమ్ ఆలమ్బతే (ఉపపదతత్పు.) ఇతి, తత్।
5. దుకూలధారి - దుకూలం ధారయతి (ఉపపదతత్పు. ఇతి।
6. ఇన్దుశేఖరమ్ - ఇన్దుః శేఖరః యస్య (బహువ్రీహి) తత్।

**సంధులు :-**

1. స్యాత్ + అథవా - స్యాదథవా - జశ్త్వసన్ధిః।
2. అథవా + ఇన్దుశేఖరమ్ - అథవేన్దుశేఖరమ్ - గుణసన్ధిః।
3. విశ్వమూర్తేః + అవధార్యతే - విశ్వమూర్తేరవధార్యతే - విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

1. అథవా - అవ్యయకోషః (22)

**'అథవా పక్షాన్తరే'**

'అథవా కృతవాగ్ద్వారే' - ర.వం. 1-4

అవయపి నిపాతసముదాయ ఏవ। చాదిషు (1-4-57) పాఠాదస్యావ్యయత్వమ్। 'అథ' ఇత్యవ్యయస్య పక్షాన్తరమప్యర్థః। తస్యైవ వాకారేణ సముఞ్చిత్య నియమేన ప్రయోగే పక్షాన్తర ఏవ వృత్తిః। పూర్వోక్తదిశాస్య నిపాతసముదాయస్యాపి పక్షాన్తర ద్యోతకత్వమ్ - ఇత్యాదికం యథాయథమూహ్యమ్। **అథవాపి** ఇత్యపి నిపాత సముదాయః పక్షాన్తరార్థకశ్చాదిషు (1-4-57) ద్రష్టవ్యః।

**క్రియాదర్శము :- అవధార్యతే** - ధృఞ్ (ధృ) ధారణే (ధరించుట, పట్టుకొనుట) సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ, లట్ - ప్రథమపురుషైకవచనాంతః। కర్మణి। అవ - ఉపసర్గ.

**అవధార్యతే** - అవధార్యేతే - అవధార్యన్తే.

---

**అవతారికా :-** 'అయుక్తరూపం కిమతః పరం వద' ఇతి శ్లోకోక్తం ప్రత్యాహ। 'ఇంత కన్నను తగనిదేమి' యను శ్లోకమును గూర్చి చెప్పుచున్నది.

**శ్లో॥ తదఙ్గసంసర్గమవాప్య కల్పతే**
**ధ్రువం చితాభస్మరజో విశుద్ధయే।**
**తథాహి నృత్యాభినయక్రియాచ్యుతం**
**విలిప్యతే మౌళిభిరమ్బరౌకసామ్॥ 79**

**పదవిభాగము :-** తదఙ్గసంసర్గమ్, అవాప్య, కల్పతే, ధ్రువమ్, చితాభస్మరజః, విశుద్ధయే, తథాహి, నృత్య అభినయక్రియాచ్యుతమ్, విలిప్యతే, మౌళిభిః, అమ్బరౌకసామ్।

**అన్వయక్రమము :-** తదఙ్గసంసర్గమ్ అవాప్య చితా-భస్మ-రజః విశుద్ధయే కల్పతే ధ్రువమ్। తథాహి నృత్య - అభినయ - క్రియాచ్యుతమ్ అంబరౌకసాం మౌళిభిః విలిప్యతే।

**ప్రతిపదార్థము :-** తదఙ్గసంసర్గమ్ - ఆయన శరీరముతో కలియుటను, అవాప్య - పొందినదై, చితా-భస్మ-రజః - చితియందలి భస్మపుపొడి, విశుద్ధయే - పవిత్రీకరించుటకొఱకు, కల్పతే - ఏర్పడును, ధ్రువమ్ - నిశ్చయము. తథాహి -

103



అది అట్లే। నృత్య-అభినయ-క్రియా-చ్యుతమ్- తాండవమందు అర్థమును సూచించు చేష్టయను క్రియచేత జారిపడినట్టిది, అంబరౌకసామ్ - ఆకాశము నివాసముగాగల దేవతలయొక్క, మౌళిభిః - శిరస్సులచే, విలిప్యతే - ధరించబడు చున్నది.

**తాత్పర్యము :-** ఆయన శరీరముతో కలియుటను పొందినదై చితియందలి భస్మపుపొడి పవిత్రీకరించుటకొఱకు ఏర్పడును. నిశ్చయము. అది అట్లే. తాండవ మందు అర్థమును సూచించు చేష్టయను క్రియచేత జారిపడినట్టిది ఐన (ఆ భస్మము) ఆకాశము నివాసముగాగల దేవతలయొక్క శిరస్సులచే ధరింపబడు చున్నది.

**పాఠాన్తరాలు :-** 1. సంసర్గ - సంస్పర్శ 2. రజో విశుద్ధయే - రజోఽపి శుద్ధయే 3. నృత్య - నృత్త 4. విలిప్యతే - విలుప్యతే।

**విభక్తులు/క్రియలు :-** 1. తదఙ్గసంసర్గమ్ - **తదఙ్గసంసర్గమ్**, తదఙ్గసంసర్గౌ, తదఙ్గసంసర్గాన్; అకారాన్త పుంలింగ తదఙ్గసంసర్గశబ్దము. ద్వి.ఏ 2. అవాప్య - అవ్యయము (ల్యబన్తము). 3. చితాభస్మరజః - ...**రజః**, ...రజసీ, ...రజాంసి ;సకారాన్త నపుంసకలింగ...రజశ్శబ్దము. ప్ర.ఏ 4. విశుద్ధయే - **విశుద్ధయే,** విశుద్ధిభ్యామ్, విశుద్ధిభ్యః; ఇకారాన్త స్త్రీలింగ విశుద్ధిశబ్దము. చ.ఏ 5. కల్పతే - క్రియ -లట్ - ప్ర.ఏ 6. ధ్రువమ్ - **ధ్రువమ్**, ధ్రువే, ధ్రువాణి; అకారాన్త నపుంసకలింగ ధ్రువశబ్దము. ప్ర.ఏ 7. తథాహి - అవ్యయము 8. నృత్య...చ్యుతమ్ - **...చ్యుతమ్,** ...చ్యుతే, ...చ్యుతాని; అకారాన్త నపుంసకలింగచ్యుతశబ్దము. ప్ర.ఏ 9. అంబరౌకసామ్ - అంబరౌకసః, అంబరౌకసోః, **అంబరౌకసామ్;** సకారాన్త పుంలింగ అంబరౌకశ్శబ్దము. ష.బ 10. మౌళిభిః - మౌళినా, మౌళిభ్యామ్, **మౌళిభిః** ; ఇకారాన్త పుంలింగ మౌళిశబ్దము. తృ.బ 11. విలిప్యతే - క్రియ - కర్మణి

**సమాసాలు :-**

1. తదఙ్గసంసర్గమ్ - తస్య అఙ్గమ్ (ష.త.) తదఙ్గమ్, తదఙ్గస్య సంసర్గః (ష.త.) తమ్।
2. చితాభస్మరజః - చితాయా భస్మ (ష.త.) చితాభస్మ, చితాభస్మ ఏవ రజః (కర్మధా.) చితాభస్మరజః।
3. నృత్యాభినయక్రియాచ్యుతమ్ - నృత్యే అభినయః (స.త.) నృత్యాభినయః, నృత్యాభినయ ఏవ క్రియా (కర్మధా.) నృత్యాభినయక్రియయా చ్యుతమ్ (తృ.త)। నృత్యాభినయక్రియాచ్యుతమ్।
4. అంబరౌకసామ్ - అంబర ఏవ ఓకః యేషామ్ (బహువ్రీహి) తే, అంబ రౌకసః, తేషామ్।

**సంధులు :–**

1. చితాభస్మరజః + విశుద్ధయే – చితాభస్మరజో విశుద్ధయే – ఉత్వాదేశః।
2. మౌళిభిః + అమ్బరౌకసామ్ – మౌళిభిరమ్బరౌకసామ్। విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

1. ఎ) **ఓకమ్** – అకారాన్త నపుంసకలింగ ఓకశబ్దము. – ఇల్లు

బి) ఓకః – సకారాన్త నపుంసకలింగ ఓకశ్శబ్దము – ఇల్లు

సి) ఓకః – అకారాన్త పుంలింగ ఓకశబ్దము. – ఇల్లు

ఎ) ఓకమ్ :– ఉచేరిగుపధ లక్షణే కే గుణః కుత్వం చ 'ఓక ఉచః కే' ఇతి నిపాత్యతే।
బి) ఓకః(స్) :– ఉచ్యతే సమవైతి అస్మిన్। ఉచ్+అసున్, గుణః, న్యఙ్ క్వాదిత్వాత్ కుత్వమ్।
సి) 'సప్తర్షీణాం తు యత్స్థానం స్మృతం తద్వై వనౌకసామ్' – ఇతి విష్ణుపురాణే

**క్రియాదర్శము :–** 1. కల్పతే

ఎ) కృపూ(కృప్) సామర్థ్యే (సమర్థుడగుట) భ్వాది(1), అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**కల్పతే** – కల్పేతే – కల్పన్తే.

బి) శ్లో॥ పరిణామే పరిణమత్యాత్మనేఽ పి వివర్తతే।
సమ్పద్యతే కల్పతేఽ థ... – ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ 1-1-7

2. **విలిప్యతే** – వి – ఉపసర్గ, లిప (లిప్) ఉపదేహే (తగుల్కొనుట, పూయుట) సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ। (6) గణము, కర్మణి – ఆత్మనేపదీ, లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**లిప్యతే** – లిప్యేతే – లిప్యన్తే.

---

**అవతారికా :–** యదుక్తం 'దిగమ్బరత్వేన నివేదితం వసు' 'ఇయఇచ్ఛ తేఽ న్యా పురతో విడమ్బనా' ఇత్యాది చ తత్రోత్తరమాహ। 'దిగమ్బరత్వేన...' అను శ్లోకమును గూర్చి సమాధానము చెప్పుచున్నది.

**శ్లో॥ అసమ్పదస్తస్య వృషేణ గచ్ఛతః**
**ప్రభిన్నదిగ్వారణవాహనో వృషా।**

104



**కరోతి పాదావుపగమ్య మౌళినా**
**వినిద్రమన్దారరజోఽ రుణాఙ్గులీ॥ 80**

**పదవిభాగము :–** అసమ్పదః, తస్య, వృషేణ, గచ్ఛతః, ప్రభిన్నదిగ్వారణవాహనః, వృషా, కరోతి, పాదౌ, ఉపగమ్య, మౌళినా, వినిద్రమన్దారరజోరుణాఙ్గులీ।

**అన్వయక్రమము :–** ప్రభిన్న...వాహనః వృషా అసమ్పదః వృషేణ గచ్ఛతః తస్య పాదౌ మౌళినా ఉపగమ్య వినిద్ర...అంగులీ కరోతి।

**ప్రతిపదార్థము :–** ప్రభిన్న – దిగ్వారణ – వాహనః –మదము గార్చుచున్న ఐరావతమను దిగ్గజము వాహనముగా కలవాడగు, వృషా – దేవేంద్రుడు, అసమ్పదః – దరిద్రుడును, వృషేణ – ఎద్దుతో, గచ్ఛతః – పోవుచున్నవాడును, అగు, తస్య – ఆ శివునియొక్క, పాదౌ – పాదములను, మౌళినా – కిరీటముతో, ఉపగమ్య – పొంది, వినిద్ర – మందార – రజః – అరుణ – అంగులీ – విప్పారిన మందారములనెడు కల్పవృక్షపుష్పపరాగముచే నెఱ్ఱనగు వ్రేళ్లు కలవానినిగా, కరోతి – చేయుచున్నాడు.

**తాత్పర్యము :–** మదము గార్చుచున్న ఐరావతమను దిగ్గజము వాహనముగా కలవాడగు దేవేంద్రుడు, దరిద్రుడై ఎద్దుతో పోవుచున్న ఆ శివపాదములను కిరీటముతో పొంది విప్పారిన మందారములనెడు కల్పవృక్షపరాగముచే నెఱ్ఱనగు వ్రేళ్లు కలవానినిగా చేయుచున్నాడు.

**పాఠాన్తరాలు :–** 1. ఉపగమ్య – ఉపనమ్య।

**విభక్తులు/క్రియలు :–** 1. ప్రభిన్న...వాహనః – ...**వాహనః,** ...వాహనౌ.... వాహనాః, అకారాన్త పుంలింగ...వాహనశబ్దము. ప్ర.ఏ 2. వృషా – **వృషా,** వృషాణౌ, వృషాణః; నకారాన్త పుంలింగ వృషన్‌శబ్దము. ప్ర.ఏ 3. **అసమ్పదః** – అసమ్పదః, అసమ్పదోః, అసమ్పదామ్; దకారాన్త పుంలింగ అసమ్పద్‌శబ్దము ష.ఏ 4. వృషేణ – **వృషేణ**, వృషాభ్యామ్, వృషైః; అకారాన్త పుంలింగ వృషశబ్దము. తృ.ఏ 5. గచ్ఛతః – **గచ్ఛతః,** గచ్ఛతోః, గచ్ఛతామ్; తకారాన్త పుంలింగ గచ్ఛత్‌శబ్దము ష.ఏ 6. తస్య – **తస్య**, తయోః, తేషామ్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ష.ఏ 7. పాదౌ – పాదః, **పాదౌ**, పాదాన్; అకారాన్త పుంలింగ పాదశబ్దము. ద్వి.ద్వి 8. మౌళినా – **మౌళినా,** మౌళిభ్యామ్, మౌళిభిః; ఇకారాన్త పుంలింగ మౌళిశబ్దము. తృ.ఏ 9. ఉపగమ్య – ల్యబన్తము – అవ్యయము 10. వినిద్ర...అంగులీ – ...అంగులిమ్, ...**అంగులీ**, ...అంగులీన్; ఇకారాన్త పుంలింగ...అంగులిశబ్దము. ద్వి.ద్వి. 11. కరోతి – క్రియ

**సమాసాలు :-**

1. ప్రభిన్నదిగ్వారణవాహనః - ప్రకర్షేణ భిన్నః (ప్రాదితత్పు.) ప్రభిన్నః, దిశః వారణః (ష.త.) ద్విగారణః, ప్రభిన్నః దిగ్వారణః వాహనం యస్య (బహువ్రీహి) సః।
2. వినిద్రమన్దారరజోరుణాంగులీ - వినిద్రాణి చ తాని మందారాణి (కర్మధా.) వినిద్రమన్దారాణి, వినిద్రమన్దారాణాం రజాంసి (ష.త.) వినిద్రమన్దారరజాంసి, తైః అరుణాః అంగులయః యయోః (బహువ్రీహి) తౌ।
3. అసమ్పదః - నాస్తి సమ్పత్ యస్య సః (బహువ్రీహి), అసమ్పత్, తస్య।

**సంధులు :-**

1. అసమ్పదః + తస్య - అసమ్పదస్తస్య - విసర్గసన్ధిః (సకారాదేశః)।
2. ...వాహనః + వృషా - వాహనో వృషా - ఉత్వాదేశః।
3. పాదౌ + ఉపగమ్య - పాదావుపగమ్య; **ఏచోఽయవాయావః** (సూ 6-1-78)

ఏఓఐఔలకు అచ్చుపరముగా నున్నప్పుడు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి ఆదేశముగా వచ్చును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు -కావ్యప్రయోగాలు :-**

**1. వృషః** - (పుం.)

ఎ) వర్షతి సించతి రేత+ఇతి। వృష సేచనే క।
వర్షతి కామాన్ ఇతి వా। వృష్ + క। ధర్మః, ఋషభః, **వృషభః।**

బి) శ్లో॥ "ఉక్షానడ్వాన్బలీవర్దః కకుద్మాన్వృషభో వృషః।
ఋషభః సౌరభేయో గౌర్వాడవేయోఽథ శాక్వరః॥ 263
- అని హలాయుధకోశము '11' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ వృషో హి భగవాన్ ధర్మస్తస్య యః కురుతే హ్యలమ్
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్॥
- మనుస్మృతి 8 - 16

పూజ్యమైన ధర్మము కోర్కులను అన్నింటిని వర్షించుచున్నది. కావున **వృష** మనబడును. అట్టి వృషము నెవడు నిషేధించునో, వాడే వృషలుడు అనబడును. గాని జాతిచే వృషలుడు వృషలుడు గాడు. కనుక ధర్మమును మీఱరాదు.





డి) శ్లో॥ కైలసగౌరం **వృషమారురుక్షోః**
పాదార్పణానుగ్రహపూతపృష్ఠమ్।
అవేహి మాం కింకరమష్టమూర్తేః
కుమ్భోదరం నామ నికుమ్భతుల్యమ్॥ - ర.వం. 2-35

కైలాస పర్వతమువలె తెల్లనైన, **నందీశ్వరుని** పైకి ఎక్కగోరుచున్న శివుడు, తన పాదములను నా వీపుపై మోపుటవలన పవిత్రమైన వీపు నాది. నేను నికుంభునకు సాటి వచ్చువాడను. కుంభోదరుడను పేరు గల 'నేను, **శివుని**, సేవకుడను'. అని తెలిసికొనుము.

**క్రియాదర్శము :-** 1. **కరోతి**

ఎ) డుకృఞ్ (కృ) - కరణే (చేయుట.) సకర్మకమ్, తనాదిప్రకరణమ్(8), అనిట్, (ఉభయ) పరస్మైపదీ. లట్ - ప్ర.ఏ

**కరోతి** - కురుతః - కుర్వన్తి.

బి) కృతౌ కరోత్యావహతి విదధాత్యాదదాతి చ।
వితనోత్యాత్మనే పఞ్చ.... - ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ 2-1-2

---

**అవతారికా :-** యదుక్తమ్ 'అలక్ష్యజన్మతా' ఇతి తత్రోత్తరమాహ।
పుట్టువు తెలియదన్నందుకు సమాధానము చెప్పుచున్నది.

**శ్లో॥ వివక్షతా దోషమపి చ్యుతాత్మనా
త్వయైకమీశం ప్రతి సాధు భాషితమ్।
యమామనన్త్యాత్మభువోఽపి కారణం
కథం స లక్ష్యప్రభవో భవిష్యతి॥ 81**

**పదవిభాగము :-** వివక్షతా, దోషమ్, అపి, చ్యుతాత్మనా, త్వయా, ఏకమ్, ఈశమ్, ప్రతి, సాధు, భాషితమ్, యమ్, ఆమనన్తి, ఆత్మభువః, అపి, కారణమ్, కథమ్, సః, లక్ష్యప్రభవః, భవిష్యతి॥

**అన్వయక్రమము :-** చ్యుతాత్మనా దోషం వివక్షతా అపి త్వయా ఈశం ప్రతిఏకం సాధు భాషితమ్ యమ్ ఆత్మభువః అపి కారణమ్ ఆమనన్తి సః కథం లక్ష్యప్రభవః భవిష్యతి॥

**ప్రతిపదార్థము :–** చ్యుతాత్మనా – నష్టస్వభావముచే, దోషమ్ – నిందను, వివక్షతా + అపి – చెప్పదలచినను, త్వయా – నీ చేత, ఈశమ్ + ప్రతి – శివునిగూర్చి, ఏకమ్ – ఒక్కటి (పుట్టువు తెలియని వాడు అనునది), సాధు – చక్కగ, భాషితమ్ – చెప్పబడ్డది. యమ్ – ఏ శివుని, ఆత్మభువః + అపి – బ్రహ్మకును, కారణమ్ – కారణముగ, ఆమనన్తి – చెప్పుచున్నారో, సః = ఆ శివుడు, కథమ్ – ఎట్లు, లక్ష్యప్రభవః – తెలియబడెడు పుట్టువుకలవాడు, భవిష్యతి – కాగలడు.

**తాత్పర్యము :–** నష్ట స్వభావముచే నిందను చెప్పదలచినను నీచేత శివునిగూర్చి ఒక్కటి చక్కగ చెప్పబడ్డది. ఏ శివుని బ్రహ్మకును కారణముగ చెప్పుచున్నారో ఆ శివుడు ఎట్లు తెలియబడెడు పుట్టువుకలవాడు కాగలడు?

**పాఠాన్తరాలు :–** 1. వివక్షతా – వివృణ్వతా

**విభక్తులు/క్రియలు :–** 1. చ్యుతాత్మనా – **చ్యుతాత్మనా,** చ్యుతాత్మభ్యామ్, చ్యుతాత్మభిః; నకారాన్త పుంలింగ చ్యుతాత్మన్‌శబ్దము. తృ.ఏ 2. దోషమ్ – **దోషమ్**, దోషౌ, దోషాన్; అకారాన్త పుంలింగ దోషశబ్దము. ప్ర.ఏ 3. వివక్షతా – వివక్షతా, వివక్షద్భ్యామ్, వివక్షద్భిః ; తకారాన్త పుంలింగ వివక్షత్‌శబ్దము. తృ.ఏ 4. త్వయా – త్వయా, యువాభ్యామ్, యుష్మాభిః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. తృ.ఏ 5. ఈశమ్ – **ఈశమ్,** ఈశౌ, ఈశాన్; అకారాన్త పుంలింగ ఈశశబ్దము. ద్వి.ఏ 6. ప్రతి – అవ్యయము 7. ఏకమ్ – **ఏకమ్,** ఏకే, ఏకాని; అకారాన్త నపుంసకలింగ ఏకశబ్దము. ప్ర.ఏ 8. సాధు – అవ్యయము 9. భాషితమ్ – **భాషితమ్,** భాషితే, భాషితాని; అకారాన్త నపుంసకలింగ భాషితశబ్దము ప్ర.ఏ 10. యమ్ – **యమ్**, యౌ, యాన్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము ద్వి.ఏ 11. ఆత్మభువః – **ఆత్మభువః,** ఆత్మభువోః, ఆత్మభువామ్ ; ఊకారాన్త పుంలింగ ఆత్మభూశబ్దము. ష.ఏ 12. అపి – అవ్యయము – కథమ్ 13. కారణమ్ – **కారణమ్,** కారణే, కారణాని అకారాన్త నపుంసకలింగ కారణశబ్దము. ప్ర.ఏ 14. ఆమనన్తి – క్రియ 15. సః – **సః,** తే, తౌ; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 16. లక్ష్యప్రభవః – **...ప్రభవః,** ప్రభవౌ, ప్రభవాః ; అకారాన్త పుంలింగ లక్ష్యప్రభవశబ్దము. ప్ర.ఏ 17. భవిష్యతి – క్రియ.

**సమాసాలు :–**

1. చ్యుతాత్మనా – చ్యుతః ఆత్మా యస్య (బహువ్రీహి) సః, చ్యుతాత్మా, తేన।
2. లక్ష్యప్రభవః – లక్ష్యః ప్రభవః యస్య (బహువ్రీహి) సః, లక్ష్యప్రభవః।

**సంధులు :–**

1. త్వయా + ఏకమ్ – త్వయైకమ్ – వృద్ధిసన్ధిః।
2. ఆమనన్తి + ఆత్మభువః – ఆమనన్త్యాత్మభువః – యణాదేశసన్ధిః।
3. ఆత్మభువః + అపి – ఆత్మభువోఽపి – ఉత్వాదేశము, పూర్వరూపము।





4. సః + లక్ష్యప్రభవః – స లక్ష్యప్రభవః – సులోపః।
5. లక్ష్యప్రభవః + భవిష్యతి – లక్ష్యప్రభవో భవిష్యతి – ఉత్వాదేశః స్వాదిసన్ధిః

**పదవ్యుత్పత్తి –నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఆత్మభూః –** (పుం.)

ఎ) ఆత్మన్+భూ+క్విప్

బి) "శ్లో॥ **బ్రహ్మాత్మభూః** సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః।
హిరణ్యగర్భో లోకేశః స్వయంభూశ్చతురాననః॥ 16
శ్లో॥ ధాతాబ్జయోనిర్ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః।
స్రష్టా ప్రజాపతిర్వేధా విధాతా విశ్వసృడ్విధిః॥ 17
**శ్లో॥ శతానన్దశ్శతధృతిర్విరిఞ్చోఽజో విరిఞ్చనః।**
**శ్లో॥ నాభిజన్మాణ్డజః పూర్వోఽనిధనః కమలోద్భవః।**
**సదానన్దో రజోమూర్తిః సత్యకో హంసవాహనః॥**

**అధికపాఠములు** అని అమరకోశము '20' నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ సర్వజ్ఞస్త్వమవిజ్ఞాతః సర్వయోనిస్త్వ**మాత్మభూః।**
సర్వప్రభురనీశస్త్వ**మేకస్త్వం** సర్వరూపభాక్॥ – ర.వం. 10–20

ఓ భగవంతుడా!

1. నీవు (సర్వేశ్వరుడగుటవలన) అనంతవిశ్వమునందలి ప్రతి అణువును ఎఱింగినవాడవు.
2. (రూపరహితుడగుటవలన) ఏ అజ్ఞానిచేతను తెలియబడదగినవాడవు కావు.
3. (సృష్టికర్తవగుటవలన) సకల విశ్వముయొక్క పుట్టుకకు కారణభూతుడవు.
4. (అజుడగుటవలన) నీయంతట నీవే ఉద్భవించినవాడవు.
5. (సర్వేశ్వరుడగుటవలన) నీవే సర్వాధిపతివి.
6. (సర్వోత్కర్షా గుణమువలన) నీకెవ్వడును శాసించు ప్రభువు లేడు.
7. (విశ్వవ్యాపకుడగుటవలన) నీవు ఒక్కడవే అయిన వాడవగుచు సర్వచేతనాచేతన స్వరూపుడవు ఐ యున్నావు.

డి) శ్లో॥ ప్రాహుర్ద్వాదశధా స్థితస్య మునయో యత్తేజసః కారణం
భర్తారం భువనత్రయస్య సుషువే యద్యజ్ఞభాగేశ్వరమ్।

యస్మిన్నాత్మభువః పరోఽపి పురుషశ్చక్రే భవాయాస్పదం
ద్వంద్వం దక్షమరీచిసంభవమిదం తత్స్రష్టురేకాన్తరమ్॥

– ఇతి అభిజ్ఞానశాకున్తలే 7-27

**క్రియాదర్శము :– 1. ఆమనన్తి** – ఆఙ్ – ఉపసర్గ, 'మ్నా – అభ్యాసే' సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ – 'పాఘ్రాధ్మాస్థామ్నా' (సూ. 7-3-78) ఇతి మనాదేశః॥ లట్ – ప్రథమపురుషైకవచనాంతః॥ మనతి – మనతః – **మనన్తి**

---

**శ్లో॥ అలం వివాదేన యథా శ్రుతస్త్వయా**
**తథావిధస్తావదశేషమస్తు సః॥**
**మమాత్ర భావైకరసం మనః స్థిరం**
**న కామవృత్తిర్వచనీయమీక్షతే॥ 82**

**పదవిభాగము** – అలమ్, వివాదేన, యథా, శ్రుతః, త్వయా, తథావిధః, తావత్, అశేషమ్, అస్తు, సః, మమ, అత్ర, భావైకరసమ్, మనః, స్థిరమ్, న, కామవృత్తిః, వచనీయమ్, ఈక్షతే॥

**అన్వయక్రమము :–** వివాదేన అలం త్వయా తావత్ యథా సః శ్రుతః అశేషం తథావిధః అస్తు॥ మమ మనః అత్ర భావ–ఏక –రసం స్థిరం కామవృత్తిః వచనీయం న ఈక్షతే॥

**ప్రతిపదార్థము :–** వివాదేన – సంవాదముచేత, అలమ్ – చాలును, త్వయా తావత్ – నీచేత, యథా – ఎట్లు, సః – ఆ శివుడు, శ్రుతః – వినబడినాడో, అశేషమ్ – పూర్తిగ, తథావిధః – అట్టివాడే, అస్తు – అగుగాక॥ మమ మనః – నా మనస్సు, అత్ర – శివునివిషయములో, భావ–ఏక–రసమ్ – శృంగారమే అద్వితీయమగు భోగ్యముగా గలదై, స్థిరమ్ – అచంచలమైయున్నది, కామవృత్తిః – స్వేచ్ఛావిహారి, వచనీయమ్ – నిందను, న ఈక్షతే – పట్టించుకోడు కదా!

**తాత్పర్యము :–** సంవాదముచేత చాలును. నీచేత ఎట్లు ఆ శివుడు వినబడినాడో పూర్తిగ అట్టివాడే అగుగాక॥ నా మనస్సు శివునివిషయములో శృంగారమే అద్వితీయమగు భోగ్యముగా గలదై అచంచలమై యున్నది. స్వేచ్ఛావిహారి నిందను పట్టించుకోడు కదా!





**పాఠాన్తరాలు :–** 1. శ్రుతః – శ్రుతమ్ 2. తావత్ – తాదృక్ 3. రసం – వశం 4. స్థిరమ్ – స్థితమ్.

**విభక్తులు/క్రియలు :–** 1. వివాదేన – **వివాదేన,** వివాదాభ్యామ్, వివాదైః; అకారాన్త పుంలింగ వివాదశబ్దము. తృ.ఏ 2. అలమ్, యథా, తావత్, అత్ర, న – అవ్యయాలు 3. త్వయా – **త్వయా,** యువాభ్యామ్, యుష్మాభిః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. తృ.ఏ 4. సః – **సః,** తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 5. శ్రుతః – **శ్రుతః,** శ్రుతౌ, శ్రుతాః; అకారాన్త పుంలింగ శ్రుతశబ్దము. ప్ర.ఏ 6. అశేషమ్ – **అశేషమ్,** అశేషే, అశేషాణి; అకారాన్త నపుంసకలింగ అశేషశబ్దము. ప్ర.ఏ 7. అస్తు – క్రియ 8. మమ – **మమ,** ఆవయోః, అస్మాకమ్ ; దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.ఏ 9. మనః – మనః, మనసీ, మనాంసి ; సకారాన్త నపుంసకలింగ మనశ్శబ్దము. ప్ర.ఏ 10. భావైకరసమ్ – భావైకరసమ్, భావైకరసే, భావైకరసాని; అకారాన్త నపుంసకలింగ భావైకరసశబ్దము. ప్ర.ఏ 11. స్థిరమ్ – స్థిరమ్, స్థిరే, స్థిరాణి; అకారాన్త నపుంసకలింగ స్థిరశబ్దము. ప్ర.ఏ 12. కామవృత్తిః – **కామవృత్తిః,** కామవృత్తీ, కామవృత్తయః ఇకారాన్త పుంలింగ కామవృత్తిశబ్దము. ప్ర.ఏ 13. వచనీయమ్ – **వచనీయమ్,** వచనీయే, వచనీయాని ; అకారాన్త నపుంసకలింగ వచనీయశబ్దము. ద్వి.ఏ 14. ఈక్షతే – క్రియ – లట్ 15. తథావిధః – **తథావిధః,** తథావిధౌ, తథావిధాః; అకారాన్త పుంలింగ తథావిధశబ్దము. ప్ర.ఏ

**సమాసాలు :–**

1. తథావిధః – తథా విధా యస్య (బహువ్రీహి) సః॥
2. భావైకరసమ్ – భావః ఏకః రసః యస్య (బహువ్రీహి) తత్॥
3. కామవృత్తిః – ఎ) కామస్య వృత్తిః (ష.త.) కామవృత్తిః॥
   బి) కామా వృత్తిః యస్య సః (బహువ్రీహి) కామవృత్తిః॥

**సంధులు :–**

1. శ్రుతః + త్వయా – శ్రుతస్త్వయా – విసర్గసన్ధిః (సకారాదేశః)॥
2. తథావిధః + తావత్ – తథావిధస్తావత్ – విసర్గసన్ధిః (సకారాదేశః)॥
3. మమ + అత్ర – మమాత్ర – సవర్ణదీర్ఘసన్ధిః॥
4. కామవృత్తిః + వచనీయమ్ – కామవృత్తిర్వచనీయమ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)॥
5. తావత్ + అశేషమ్ – తావదశేషమ్ – జశ్త్వసన్ధిః॥

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. అలమ్** – అవ్యయకోషః (116)

'అలం భూషణపర్యాప్తిశక్తివారణనిషేధేషు'

1. భూషణే – 'అలంకారః॥ అలంకృత్య'
2. పర్యాప్తౌ – అలమస్త్యస్య ధనమ్॥ పర్యాప్తమస్తీత్యర్థః॥

'రాక్షస్యో రావణప్రీత్యై...చోచురలం ముహుః' - భట్టికావ్యే 8-97

3. శక్తౌ - అలం మల్లో మల్లాయ। మల్లోయం మల్లాన్తరేణ సాకం యోద్ధుం శక్త ఇత్యర్థః।

'అన్యథా ప్రాతరాశాయ కుర్యామ త్వామ్ **అలం** వయమ్' - (భట్టికావ్యే 8-98)

4. వారణే - 'అలం మహీపాల తవ శ్రమేణ-।' (రఘువంశే 2-34)

**అలంకారములు :-** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడినది.

**క్రియాదర్శము:- 1. అస్తు** - అస (అస్) భువి (ఉండుట) అదాది (2) , అకర్మకమ్,అనిట్, పరస్మైపదీ, లోట్ - ప్రథమపురుషైకవచనాంతః।

అస్తు - స్తామ్ - సన్తు।

**2. ఈక్షతే** -

ఎ) ఈక్ష(ఈక్ష్) దర్శనే (దర్శించుట) సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్ - ప్రథమపురుషైకవచనాంతః। భ్వాదయః।

**ఈక్షతే** - ఈక్షేతే - ఈక్షన్తే.

బి) శ్లో॥ దైవం పర్యాలోచయతీత్యర్థే రాధ్యతి **చేక్షతే** ॥ 43

- ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ (1-2-21)

2. ..... .....అథేక్షణే ॥ 51

శ్లో॥ నిర్వర్ణయతి నిధ్యాయత్యాలోకయతి పశ్యతి।
ఆలోకతే లక్షయతే నిభాలయత **ఈక్షతే** ॥ 52

శ్లో॥ నిరూపయత్యపి నిశామయతే చ విచాయతి
నిబన్ధత్యాత్మనేఽపి ద్వౌ లక్షయత్యపి లోచతే। 53

శ్లో॥ చేష్టే ఛన్దసి సమ్పశ్యత్యాత్మనే స్యాదకర్మకః। - ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్.

---

**శ్లో॥ నివార్యతామాలి! కిమప్యయం వటుః**
**పునర్వివక్షుః స్ఫురితోత్తరాధరః।**
**న కేవలం యో మహతోఽపభాషతే**
**శృణోతి తస్మాదపి యః స పాపభాక్॥ 83**



**పదవిభాగము :-** నివార్యతామ్, ఆలి! కిమ్, అపి, అయమ్, వటుః, పునః, వివక్షుః, స్ఫురితోత్తరాధరః, న, కేవలమ్, యః మహతః, అపభాషతే, శృణోతి, తస్మాత్, అపి, యః, సః, పాపభాక్।

**అన్వయక్రమము :-** ఆలి! స్ఫురితోత్తరాధరః అయం వటుః పునః కిమ్ అపి వివక్షుః నివార్యతాం యః మహతః అపభాషతే న కేవలం సః తస్మాత్ యః శృణోతి సః అపి, పాపభాక్।

**ప్రతిపదార్థము :-** హే ఆలి! - ఓ చెలీ!, స్ఫురిత ఉత్తరాధరః - అధికముగ కదులుచున్న పెదవి గలవాడై, అయమ్ వటుః - ఈ జటాధరుడు, పునః కిమ్ అపి - మరలనేమో, వివక్షుః - చెప్పబోవుచున్నాడు, నివార్యతామ్ - మాన్పింపుము, యః - ఎవడు, మహతః - పెద్దలను, అపభాషతే - నిందించునో, న కేవలం సః - వాడొక్కడే గాక, తస్మాత్ - అతనివలన, యః శృణోతి - ఎవడు వినునో, సః+ అపి - వాడును, పాపభాక్ - పాపము పొందువాడు (భవతి - అగును)

**తాత్పర్యము :-** ఓ చెలీ! అధికముగ కదులుచున్న పెదవిగలవాడై ఈ జటాధరుడు మరలనేమో చెప్పబోవుచున్నాడు. మాన్పింపుము. ఎవడు పెద్దలను నిందించునో వాడొక్కడే గాక అతనివలన ఎవడు వినునో వాడును పాపము పొందువాడు అగును.

**పాఠాన్తరాలు :-** 1. అయం - అసౌ 2. ఉత్తరాధరః - ఉన్నతాధరః 3. మహతః - మేహతాం, మేహతో 4. అపభాషతే - అవిభాషతే।

**విభక్తులు/క్రియలు :-** 1.ఆలి! - **హే ఆలి!**, హే ఆల్యౌ, హే ఆల్యః; ఈకారాన్త స్త్రీలింగ ఆలీశబ్దము. సం.ప్ర.ఏ 2. స్ఫురితోత్తరాధరః - **...అధరః,** ...అధరౌ, ...అధరాః; అకారాన్త పుంలింగ అధరశబ్దము. ప్ర.ఏ 3. అయమ్ - **అయమ్**, ఇమౌ, ఇమే; మకారాన్త పుంలింగ 'ఇదమ్'శబ్దము. ప్ర.ఏ 4. వటుః - **వటుః,** వటూ, వటవః; ఉకారాన్త పుంలింగ వటుశబ్దము. ప్ర.ఏ 5. పునః, కిమ్, అపి, న - అవ్యయాలు 6. వివక్షుః - **వివక్షుః,** వివక్షూ, వివక్షవః; ఉకారాన్త పుంలింగ వివక్షుశబ్దము. ప్ర.ఏ 7. నివార్యతామ్ - క్రియ - లోట్ 8. యః - **యః**, యౌ, యే; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ప్ర.ఏ 9. మహతః - మహాన్తమ్, మహాన్తౌ, **మహతః;** తకారాన్త పుంలింగ మహత్శబ్దము. ద్వి.బ 10. అవభాషతే - క్రియ - లట్ 11. సః - **సః,** తౌ, తే; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 12. కేవలమ్ - అవ్యయము 13. తస్మాత్ - **తస్మాత్,** తాభ్యామ్, తేభ్యః; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. పం.ఏ 14. శృణోతి - లట్ - క్రియ 15. పాపభాక్ - పాపభాక్, పాపభాజౌ, పాపభాజః; జకారాన్త పుంలింగ పాపభాజ్శబ్దము.

**సమాసాలు :-**

1. స్ఫురితోత్తరాధారః - ఉత్తరశ్చ అధరశ్చ - ఉత్తరాధరౌ (ద్వంద్వ) స్ఫురితౌ

ఉత్తరాధరౌ యస్య (బహుబ్రీహి) సః।
2. పాపభాక్ – పాపం భజతి (ఉపపదతత్పు.)।

**సంధులు :–**
1. అపి + అయమ్ – అప్యయమ్ – యణాదేశసన్ధిః।
2. పునః + వివక్షుః – పునర్వివక్షుః – విసర్గసన్ధిః (రుత్వాదేశః)।
3. యః + మహతః – యో మహతః – ఉత్వాదేశః।
4. మహతః + అపభాషతే – మహతోపభాషతే – ఉత్వాదేశః, పూర్వరూపసన్ధిః
5. తస్మాత్ + అపి – తస్మాదపి – జశ్త్వసన్ధిః।
6. సః + పాపభాక్ – స పాపభాక్ – సులోపః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. ఆలీ** – (స్త్రీ.)
ఎ) ఆలి + ఙీప్ । సఖీ
బి) శ్లో... వయస్**యాలీ** సఖీ స్మృతా ॥ 487
అని హలాయుధకోశము '3' నామములను పేర్కొన్నది.
సి) శ్లో॥ అనేన సమ్బన్ధముపేత్య దిష్ట్యా మనోరథప్రార్థితమీశ్వరేణ।
మూర్ధాన**మాలి!** క్షితిధారణోచ్చముచ్చైస్తరం వక్ష్యతి శైలరాజః॥
– ఇతి కుమారసమ్భవమహాకావ్యే 7–68.
డి) శ్లో॥ త్వమ్ముగ్ధాక్షి! వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీమ్
లక్ష్మీమిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికా సంస్పృశి।
శయ్యోపాంతనివిష్టసస్మితసఖీనేత్రోత్సవాననన్దితో
నిర్యాతః శనకైరలీకవచనోపన్యాస**మాలీ**జనః॥ – అమరుశతకమ్ –27

**ఈ శ్లోక విపులవ్యాఖ్యకై శ్రీ దోర్భల విశ్వనాథశర్మగారు – అమరుశతకమునకు గావించిన మనసిజ వ్యాఖ్యానమును చూడగలరు.**

**అలంకారములు :–** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. ఇట సామాన్యముచే విశేషము సమర్థింపబడినది.

శ్లో॥ **గురో**ర్యత్ర పరీవాదో నిందా వాపి ప్రవర్తతే।
కర్ణౌ తత్రాపి ధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః॥ – మనుస్మృతి 2–200

'గురునిపైన అపవాదము పెట్టుట, దూషించుట ఎచ్చట జరుగునో, అచట తాను

109



చెవులు మూసికొనవలయును, లేదా వేఱొక తావునకు లేచి పోవలయును" ఇట గురుశబ్దము పూజ్యులకు, పెద్దలకు ఉపలక్షణము.

**క్రియాదర్శము :–**

**1. నివార్యతామ్** – ని – ఉపసర్గ, 'వృ – ఆవరణే' – ణిజన్తాత్, కర్మణి, లోట్, ప్రథమపురుషైకవచనాంతః।
**నివార్యతామ్** – నివార్యేతామ్ – నివార్యన్తామ్।
**2. శృణోతి** – 'శ్రు – శ్రవణే – లట్ – ప్రథమపురుషైకవచనాంతః।
శృణోతి – శృణుతః – శృణ్వన్తి.
3. **అపభాషతే –**
ఎ) అప –ఉపసర్గ, 'భాష – వ్యక్తాయాం వాచి', లట్ – ప్రథమపురుషైక వచనాంతః । అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, భ్వాది(1)।
**అపభాషతే** – అపభాషేతే – అపభాషన్తే.
బి) శ్లో॥ అపశబ్దయతి మ్లేచ్ఛత్యపభ్రంశయతీత్యపి॥
శ్లో॥ మ్లేచ్ఛయత్యపశబ్దే స్యురప**భాషత** ఇత్యమీ।
– ఇతి ఆఖ్యాతచన్ద్రికాయామ్ 1–4–9

---

**అవతారికా :–** సంప్రతి గన్తవ్యపక్షమాశ్రయతే। ఇప్పుడు అచటినుండి పోవు పక్షము నాశ్రయించుచున్నది.

**శ్లో॥ ఇతో గమిష్యామ్యథవేతి వాదినీ**
**చచాల బాలా స్తనభిన్నవల్కలా।**
**స్వరూపమాస్థాయ చ తాం కృతస్మితః**
**సమాలలంబే వృషరాజకేతనః॥ 84**

**పదవిభాగము :–** ఇతః, గమిష్యామి, అథవా, ఇతి, వాదినీ, చచాల, బాలా, స్తనభిన్నవల్కలా, స్వరూపమ్, ఆస్థాయ, చ, తామ్, కృతస్మితః, సమాలలంబే, వృషరాజకేతనః।

**అన్వయక్రమము :–** అథవా ఇతః గమిష్యామి। ఇతి వాదినీ స్తన –భిన్న – వల్కలా బాలా చచాల। వృషరాజకేతనః స్వరూపమ్ ఆస్థాయ కృతస్మితః (సన్) తాం సమాలలంబే।

**ప్రతిపదార్థము :–** అథవా – అట్లు కాదేని, ఇతః – ఇటనుండి, **గమిష్యామి** – పోయెదను, ఇతి – అని, వాదినీ – పలుకుచున్నదై, స్తన–భిన్న–వల్కలా – కుచములపైనుండి జారిన నారచీరకలదై, బాలా – పార్వతీదేవి, **చచాల** – కదలెను. వృషరాజకేతనః – వృషభశ్రేష్ఠము ధ్వజముగ కల త్రిణేత్రుడు, స్వరూపమ్ – నిజరూపమును, ఆస్థాయ – పొంది, కృతస్మితః (సన్) – చిఱునగవు చిందించుచున్న వాడగుచు, తామ్ – ఆ పార్వతీదేవిని, **సమాలలంబే** – పట్టుకొనెను.

**తాత్పర్యము :–** అట్లు కాదేని 'ఇటనుండి పోయెదను' అని పలుకుచున్నదై కుచములపైనుండి జారిన నారచీరకలదై పార్వతీదేవి కదలెను. వృషభశ్రేష్ఠము ధ్వజముగ కల త్రినేత్రుడు నిజరూపమును పొంది చిఱునగవు చిందించు చున్నవాడగుచు ఆ పార్వతీదేవిని పట్టుకొనెను.

**పాఠాన్తరాలు :–** 1. ఆస్థాయ – ఆధాయ

**విభక్తులు/క్రియలు :–** 1. అథవా, ఇతః, ఇతి – అవ్యయాలు 2. గమిష్యామి – క్రియ – లృట్ 3. వాదినీ – **వాదినీ,** వాదిన్యౌ, వాదిన్యః; ఈకారాన్త స్త్రీలింగ వాదినీశబ్దము ప్ర.ఏ 4. స్తనభిన్నవల్కలా – **స్తనభిన్నవల్కలా,** స్తనభిన్నవల్కలే, స్తనభిన్నవల్కలాః; ఆకారాన్త స్త్రీలింగ స్తనభిన్నవల్కలాశబ్దము. ప్ర.ఏ 5. బాలా – **బాలా,** బాలే, బాలాః; ఆకారాన్త స్త్రీలింగ బాలాశబ్దము. ప్ర.ఏ 6. చచాల – క్రియ 7. వృషరాజకేతనః – **వృషరాజకేతనః,** వృషరాజకేతనౌ, వృషరాజకేతనాః; అకారాన్త పుంలింగ వృషరాజకేతనశబ్దము. ప్ర.ఏ 8. స్వరూపమ్ – **స్వరూపమ్,** స్వరూపే, స్వరూపాణి; అకారాన్త నపుంసకలింగ స్వరూపశబ్దము. ద్వి.ఏ 9. ఆస్థాయ – అవ్యయము 10. కృతస్మితః – **కృతస్మితః,** కృతస్మితౌ, కృతస్మితాః; అకారాన్త పుంలింగ కృతస్మితశబ్దము. ప్ర.ఏ 11. తామ్ – **తామ్,** తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 12. సమాలలంబే – క్రియ.

**సమాసాలు :–**

1. స్తనభిన్నవల్కలా – స్తనాభ్యాం భిన్నం స్తనభిన్నమ్ (పం.త.) స్తనభిన్నం వల్కలం యస్యాః సా, (బహువ్రీహి)।
2. వృషరాజకేతనః – వృషాణాం రాజా వృషరాజః (ష.త.) వృషరాజః కేతనే యస్య (బహువ్రీహి), సః।
3. స్వరూపమ్ – స్వస్య రూపమ్ (ష.త.)।
4. కృతస్మితః – కృతం స్మితం యేన (బహువ్రీహి) సః।

**సంధులు :–**

1. ఇతః + గమిష్యామి – ఇతో గమిష్యామి – ఉత్వాదేశః।
2. గమిష్యామి + అథవా – గమిష్యామ్యథవా – యణాదేశసన్ధిః।
3. అథవా + ఇతి – అథవేతి – గుణసన్ధిః।



**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. స్వరూపమ్** – (నపుం.)

ఎ) స్వస్య రూపమ్ । (స్వమేవ రూపమ్ యస్య। స్వేనైవ రూపం ప్రకాశో యస్య)

బి) 'స దృష్ట్వా విస్మితస్త స్థావాత్మానం వికృతం నలః।

స్వరూపధారిణం నాగం దదర్శ స మహీపతిః॥ – ఇతి మహాభారతే (3–66–13)

**క్రియాదర్శము :– సమాలలమ్బే** – సమ్, ఆఙ్ –ఉపసర్గలు, 'లబి – అవస్రంసనే' అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లిట్ – ప్రథమపురుషైకవచనాంతః। భ్వాది(1)। సమాలలమ్బే – సమాలలమ్బాతే – సమాలలమ్బిరే.

**2. చచాల** – 'చల – కమ్పనే' (కంపించుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లిట్, ప్రథమపురుషైకవచనాంతః। భ్వాది (1)।

**చచాల** – చేలతుః – చేలుః (అత ఏక హల్మధ్యే – ఇతి ఏత్వాభ్యాసలోపౌ।)

**3. గమిష్యామి** – 'గమ్ – గతౌ' లృట్ – ఉత్తమపురుషైకవచనాంతః।

**గమిష్యామి** – గమిష్యావః – గమిష్యామః

---

110

**శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టి–**
**ర్నిక్షేపణాయ పదముద్ధృతముద్వహన్తీ।**
**మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః**
**శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ॥ 85**

**పదవిభాగము :–** తమ్, వీక్ష్య, వేపథుమతీ, సరసాంగయష్టిః, నిక్షేపణాయ, పదమ్, ఉద్ధృతమ్, ఉద్వహన్తీ, మార్గాచలవ్యతికరాకులితా, ఇవ, సిన్ధుః, శైలాధిరాజతనయా, న, యయౌ, న, తస్థౌ।

**అన్వయక్రమము :–** తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః నిక్షేపణాయ ఉద్ధృతం పదమ్ ఉద్వహన్తీ శైలాధిరాజతనయా మార్గాచలవ్యతికరాకులితా సిన్ధుః ఇవ న యయౌ న తస్థౌ।

**ప్రతిపదార్థము :–** తమ్ – ఆ త్రినేత్రుని, వీక్ష్య – గాంచి, వేపథుమతీ – జలదరించుటకలదై, సరసాంగయష్టిః – చెమటపట్టిన శరీరము కలదై, నిక్షేపణాయ – క్రింద పెట్టుటకు, ఉద్ధృతమ్ – ఎత్తబడిన, పదమ్ – పాదమును, ఉద్వహన్తీ – ఎత్తియే ఉంచినదై, మార్గ – అచల – వ్యతికర – ఆకులితా – త్రోవలో కొండయొక్క అడ్డంకి చేత తొట్రిల్లు, సిన్ధుః ఇవ – నది వలె, శైలాధిరాజ – తనయా – పార్వతీదేవి, న యయౌ – కదలదాయెను , న తస్థౌ – నిలువదాయెను.

**తాత్పర్యము :–** ఆ త్రినేత్రుని గాంచి జలదరించుటకలదై, చెమటపట్టిన శరీరము కలదై (క్రింద పెట్టుటకు) ఎత్తబడిన పాదము ఎత్తియే ఉంచినదై త్రోవలో కొండయొక్క అడ్డంకిచేత తొట్రిల్లు నదివలె పార్వతీదేవి కదలదాయెను నిలువదాయెను.

**పాఠాన్తరాలు :–** 1. నిక్షేపణాయ – నిక్షేప ఏవ 2. ఉద్వహన్తీ – అర్పయన్తీ.

**విభక్తులు/క్రియలు :–** 1. తమ్ – **తమ్,** తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ 2. వీక్ష్య – అవ్యయము 3. వేపథుమతీ – **వేపథుమతీ**, వేపథుమత్యౌ, వేపథుమత్యః; ఈకారాన్త స్త్రీలింగ వేపథుమతీశబ్దము. ప్ర.ఏ 4. సరసాంగయష్టిః – **సరసాంగయష్టిః,** సరసాంగయష్టీ, సరసాంగయష్టయః; ఇకారాన్త స్త్రీలింగ సరసాంగయష్టిశబ్దము. ప్ర.ఏ 5. నిక్షేపణాయ – **నిక్షేపణాయ**, నిక్షేపణాభ్యామ్, నిక్షేపణేభ్యః; అకారాన్త నపుంసకలింగ నిక్షేపణశబ్దము. చ.ఏ 6. ఉద్ధృతమ్ – **ఉద్ధృతమ్**, ఉద్ధృతే, ఉద్ధృతాని; అకారాన్త నపుంసకలింగ ఉద్ధృతశబ్దము. ద్వి.ఏ 7. పదమ్ – **పదమ్**, పదే, పదాని; అకారాన్త నపుంసకలింగ పదశబ్దము. ద్వి.ఏ 8. ఉద్వహన్తీ – **ఉద్వహన్తీ,** ఉద్వహన్త్యౌ, ఉద్వహన్త్యః; ఈకారాన్త స్త్రీలింగ ఉద్వహన్తీశబ్దము. ప్ర.ఏ 9. మార్గాచలవ్యతికరాకులితా –**...ఆకులితా,** ...ఆకులితే, ...ఆకులితాః; ఆకారాన్త స్త్రీలింగ ...ఆకులితాశబ్దము. ప్ర.ఏ 10. సిన్ధుః – **సిన్ధుః**, సిన్ధూ, సిన్ధవః; ఉకారాన్త స్త్రీలింగ సిన్ధుశబ్దము. ప్ర.ఏ 11. ఇవ, న – అవ్యయాలు 12. యయౌ, తస్థౌ – క్రియలు

**సమాసాలు :–**

1. శైలాధిరాజతనయా – శైలానామ్ అధిరాజః (ష.త.) శైలాధిరాజః శైలాధిరాజస్య తనయా (ష.త.), శైలాధిరాజతనయా.
2. సరసాంగయష్టిః – రసేన సహ (బహువ్రీహి) సరసా, అంగమేవ యష్టిః (సుప్సుపా) అంగయష్టిః, సరసా అంగయష్టిః యస్యాః (బహువ్రీహి) సా।
3. మార్గాచలవ్యతికరాకులితా – మార్గే అచలః (స.త.) మార్గాచలవ్యతికరః, మార్గాచలః, మార్గాచలస్య వ్యతికరః (ష.త.) మార్గాచలవ్యతికరః ఆకులితా (తృ.త.)





**సంధులు :–**

1. సరసాంగయష్టిః + నిక్షేపణాయ – సరసాంగయష్టిర్నిక్షేపణాయ – విసర్గసన్ధిః (రుత్వమ్)।
2. ...ఆకులితా + ఇవ – ...ఆకులితేవ – గుణసన్ధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. వేపథుః** – (పుం.)

ఎ) వేపనమితి। వేప + 'ట్వితోఽథుచ్' ఇతి అథుచ్, (సూ 3–3–89) ।కమ్పః।

బి) శ్లో॥ ...వేపథుః కమ్ప ఉచ్యతే। – అని హలాయుధకోశము

సి) శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
**వేపథు**శ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ భగవద్గీతాయామ్ 1–29

"...శరీరమునందు **కంపము** గగుర్పాటు కూడా కలుగుచున్నది."

డి) శ్లో॥ చలాపాఙ్గాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదుకర్ణాన్తికచరః।
కరం వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాస్త్వం ఖలు కృతీ॥
– ఇతి అభిజ్ఞానశాకున్తలే 1–25

" ఓ తుమ్మెదా! వణుకుచున్నట్టియు, చంచలమైన క్రీగంటి చూపులుగల కంటిని తడవ తడవకు తాకుచున్నావు..."

ఇ) 'ట్వితోఽథుచ్'। అయమపి స్వభావాద్భావ ఏవ। టు వేప్మ। వేపథుః। టు ఓశ్వి। శ్వయథుః।
శ్లో॥ కేచి**ద్వేపథు**మాసేదురన్యే దవథుముత్తమమ్।
సరక్తం వమథుం కేచిత్ భ్రాజథుం న చ కేచన॥– ఇతి భట్టికావ్యే 4–43

**అలంకారములు :–** ఇందు 'ఉపమాలంకార'మున్నదని చెప్పదగును.

'ప్రవాహమార్గమునకు కొండయొక్క అడ్డంకిచే తొట్రిల్లునదివలె, పార్వతీదేవి కదలదాయెను నిలువదాయెను' అనుటచే 'ఉపమాలంకారము' ఈ శ్లోకమున కలదు.

ఉపమానము – నది, ఉపమేయము – పార్వతీదేవి
సమానధర్మము – కదలకుండుట, నిలువకుండుట
ఉపమావాచకము – (ఇవ) వలె.

'శివభగవానుడు పట్టుకొనుటచేత ఒడలు కంపించుట – బింబము. కొండయొక్క

అద్దంకిచే తొ్రిల్లుట – ప్రతిబింబము. సరసాంగయష్టిః చెమట పట్టిన శరీరము కలది – శ్లిష్టము. కనుక ఇట అనుగామిత్వ బింబ ప్రతిబింబ భావశ్లేషలకు మిశ్రణము గలదు.

**క్రియాదర్శము :–** 1. **యయౌ** – 'యా – ప్రాపణే' (పొందుట, వెళ్లుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాది (2)। లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**యయౌ** – యయతుః – యయుః
2. **తస్థౌ** – 'స్థా – గతినివృత్తౌ', లిట్ – ప్రథమపురుషైకవచనాంతః।
**తస్థౌ** – తస్థుః – తస్థుః
వృత్తమ్ – 'వసంతతిలకా' వృత్తమ్.

---

**శ్లో॥ అద్య ప్రభృత్యవనతాఙ్గి! తవాస్మి దాసః**
**క్రీతస్తపోభిరితి వాదిని చన్ద్రమౌళౌ।**
**అహ్నాయ సా నియమజం క్లమముత్ససర్జ**
**క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే॥ 86**

**పదవిభాగము :–** అద్యప్రభృతి, అవనతాఙ్గి! తవ, అస్మి, దాసః, క్రీతః, తపోభిః, ఇతి, వాదిని, చన్ద్రమౌళౌ, అహ్నాయ, సా, నియమజమ్, క్లమమ్, ఉత్ససర్జ, క్లేశః, ఫలేన, హి, పునః, నవతామ్, విధత్తే॥

**అన్వయక్రమము :–** అవనతాంగి! అద్యప్రభృతి తవ తపోభిః క్రీతః దాసః ఇతి చంద్రమౌళౌ వాదిని సా అహ్నాయ నియమజం క్లమమ్ ఉత్ససర్జ। హి క్లేశః ఫలేన పునః నవతాం విధత్తే॥

**ప్రతిపదార్థము :–** హే అవనతాంగి! – ఓ వంగిన దేహము కలదానా!, అద్య ప్రభృతి – నేటినుండి, తవ – నీయొక్క, తపోభిః – తపమ్ములచేత, క్రీతః – కొనబడిన, దాసః అస్మి – దాసుడనైతిని. ఇతి – అని, చంద్రమౌళౌ – చంద్రశేఖరుడు, వాదిని (సన్) పలికినవాడగుచుండగా, సా – ఆమె, ఆ పార్వతీదేవి, అహ్నాయ – తత్క్షణమే, నియమజమ్ – తపోజన్యమైన, క్లమమ్ – కష్టమును, ఉత్ససర్జ – విడచెను. హి – ఏలయన, క్లేశః – కష్టము, ఫలేన – ఫలముచేత, పునః – తిరిగి, నవతామ్ – క్రొత్తయగుటను, విధత్తే – ధరించును.



**తాత్పర్యము :–** ఓ వంగిన దేహము కలదానా! నేటినుండి నీయొక్క తపమ్ముచేత కొనబడిన దాసుడనైతిని! అని చంద్రశేఖరుడు పలికిన వాడగుచుండగా, ఆ పార్వతీదేవి తత్క్షణమే తపోజన్యమైన కష్టమును విడచెను. ఏలయన కష్టము ఫలముచేత తిరిగి క్రొత్తయగుటను ధరించును.

**పాఠాన్తరాలు :–** 1. అవనతాంగి – అనవమాంగి 2. విధత్తే – పిధత్తే।

**విభక్తులు/క్రియలు :–** 1. అవనతాంగి – **అవనతాంగి**, అవనతాం గ్యౌ, అవనతాంగ్యః, ఈకారాన్త స్త్రీ లింగ అవనతాంగీ శబ్దము సం.ప్ర. ఏ., 2. అద్య, ప్రభృతి, ఇతి, హి, పునః – అవ్యయాలు 3. తవ – **తవ,** యువయోః, యుష్మాకమ్; దకారాన్త స్త్రీలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ 4. తపోభిః – తపసా, తపోభ్యామ్, **తపోభిః**; సకారాన్త నపుంసకలింగ తపశ్శబ్దము. తృ.బ 5. క్రీతః – **క్రీతః**, క్రీతౌ, క్రీతాః; అకారాన్త పుంలింగ క్రీతశబ్దము. ప్ర.ఏ 6. దాసః – **దాసః**, దాసౌ, దాసాః; అకారాన్త పుంలింగ దాసశబ్దము. ప్ర.ఏ 7. అస్మి – క్రియ 8. వాదిని (సన్) – **వాదిని,** వాదినోః, వాదిషు; నకారాన్త పుంలింగ వాదిన్‌శబ్దము. స.ఏ 9. సా – **సా**, తే, తాః; దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము. ప్ర.ఏ 10. అహ్నాయ – క్రియావిశేషణము 11. నియమజమ్ – **నియమజమ్**, నియమజౌ, నియమజాన్; అకారాన్త పుంలింగ నియమజశబ్దము.ద్వి.ఏ 12. క్లమమ్ – **క్లమమ్,** క్లమౌ, క్లమాన్; అకారాన్త పుంలింగ క్లమశబ్దము. ద్వి.ఏ 13. ఉత్ససర్జ – క్రియ 14. క్లేశః – **క్లేశః,** క్లేశౌ, క్లేశాః ; అకారాన్త పుంలింగ క్లేశశబ్దము. ప్ర.ఏ 15. ఫలేన – **ఫలేన**, ఫలాభ్యామ్, ఫలైః ; అకారాన్త నపుంసకలింగ ఫలశబ్దము. తృ.ఏ 16. నవతామ్ – **నవతామ్**, నవతే, నవతాః; ఆకారాన్త స్త్రీలింగ నవతాశబ్దము. ద్వి.ఏ 17. విధత్తే – క్రియ 18. చన్ద్రమౌళౌ – **చన్ద్రమౌళౌ,** చన్ద్రమౌల్యోః, చన్ద్రమౌళిషు; ఇకారాన్త పుంలింగ చన్ద్రమౌళిశబ్దము. స.ఏ

**సమాసాలు :–**

1. అవనతాంగి – అవనతమ్ అఙ్గం యస్యాః (బహువ్రీహి) సా, తత్సమ్బుద్ధౌ।
2. చన్ద్రమౌళౌ – చంద్రః మౌళౌ యస్య (బహువ్రీహి) సః, తస్మిన్।
3. నియమజమ్ – నియమాత్ జాయతే (ఉపపదతత్పు.) ఇతి నియమజః, తమ్।

**సంధులు :–**

1. ప్రభృతి + అవనతాంగి – ప్రభత్యనవతాంగి – యణాదేశసన్ధిః।
2. తవ + అస్మి – తవాస్మి – సవర్ణదీర్ఘసన్ధిః।
3. క్రీతః + తపోభిః – క్రీతస్తపోభిః – విసర్గసన్ధిః (సకారాదేశః)।
4. తపోభిః + ఇతి – తపోభిరితి – విసర్గసన్ధిః (రుత్వమ్)।
5. పునః + నవతామ్ – పునర్నవతామ్ – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు :-**

**1. చన్ద్రమౌళౌ, వాదిని :-**

కొన్ని సందర్భాలలో తృతీయ, షష్ఠి, సప్తమీ విభక్తులకు ప్రథమావిభక్త్యర్థము చెప్పెదరు. దీనినే **'సతి సప్తమి'** అందురు.

చంద్రమౌళౌ - అకారాన్త పుంలింగ చన్ద్రమౌళిశబ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. వాదిని - నకారాన్త పుంలింగ **వాదిన్శ**బ్దము. సప్తమీవిభక్తి ఏకవచనము. ఇట ఈ రెండింటికి ప్రథమావిభక్త్యర్థము చెప్పబడినది.

ఎ) వాదిన్ - 1. వద్+ణిని-

2. వాదీ - ప్రథమావిభక్తి ఏకవచనము

3. శ్లో॥ వచసైవ తయోర్వాక్యమస్త్రమస్త్రేణ నిఘ్నతోః।
అన్యోన్యజయసంరమ్భో వవృధే **వాదినో**రివ॥ -ర.వం. 12-92

"ఒక శాస్త్రీయవిషయముపై వాదోపవాదములకు, బూనిన వాదప్రతివాదులు మాటకు మాటతో సమాధానము చెప్పునట్లు నాయక ప్రతినాయకులైన శ్రీరామ, రావణుల అస్త్రమును ప్రత్యస్త్రముతోనే త్రిప్పికొట్టుటను వారి మధ్య ఒకరినొకరు గెలువవలెనను ఉత్సాహము అభివృద్ధి చెందెను."

4. శ్లో॥ సాధ్యే నిశ్చితమన్వయేన ఘటితం భిభ్రత్సపక్షే స్థితం
వ్యావృత్తం చ విపక్షతో భవతి యత్తత్సాధనం సిద్ధయే।
యత్సాధ్యం స్వయమేవ తుల్య ముభయోః పక్షే విరుద్ధం చ య-
త్తస్యాఙ్గీకరణేన **వాదిన** ఇవ స్యాత్స్వామినో నిగ్రహః॥
- ఇతి ముద్రారాక్షసే 5-10

**అలంకారములు :-** ఇందు 'అర్థాన్తరన్యాసాలంకార'మున్నదని చెప్పదగును. 'శ్రమమునకు తగిన ఫలము లభించినపుడు అది శ్రమముగా తోప'దను సామాన్యముచేత 'శివభగవానుని స్పర్శచేతనే పార్వతీదేవి తత్క్షణమే తపోజన్యమైన క్లేశమును విడచె'నను విశేషము సమర్థింపబడుటచే 'అర్థాన్తరన్యాసాలంకార'మగును.

**ఛందస్సు :-** శక్వరీఛన్దస్సు - సమవృత్తము, వృత్తము - 'వసంత తిలకా'. దీనికి 'వసంతతిలక, ఉద్ధర్షిణీ, సింహోన్నతా' అనియును పేర్లు.
లక్షణమ్ - 'ఉక్తా వసంతతిలకా తభజా జగౌగః।'





**క్రియాదర్శము :- 1. అస్మి** - అస (అస్) భువి (ఉండుట) అదాది ప్రకరణమ్(2) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**అస్మి** - స్వః - స్మః

2. ఉత్ససర్జ - ఉత్ -ఉపసర్గ, 'సృజ -విసర్గే', తుదాదయః (6), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**ససర్జ** - ససర్జతుః - ససృజుః

3. **విధత్తే -**

ఎ) వి - ఉపసర్గ, 'డుధాఞ్ - ధారణపోషణయోః' జుహోత్యాది(3), సకర్మకమ్, అనిట్, (ఉభయ) ఆత్మనేపదీ । లట్ - ప్రథమపురుషైకవచనాంతః।

**విధత్తే -** విదధాతే - విదధతే

బి) శ్లో॥ కృతౌ కరోత్యావహతి విదధాత్యాదధాతి చ।
వితనోత్యాత్మనే పఞ్చ.... - అని 'ఆఖ్యా'తచన్ద్రిక.

మహాకవిశ్రీకాళిదాసవిరచిత 'కుమారసమ్భవమహాకావ్యము'న 'తపః ఫలోదయము' అను పంచమసర్గకు రామోరా విరచిత 'మృణాళినీ' వ్యాఖ్యానము ది 01-05-2011 రాత్రి 9గం. 18ని.లకు ప్రారంభింపబడి, ది 28-05-2011 ఉదయము 10గం. 15ని.లకు పూర్తి కావింపబడినది.

శ్రీః

## అనుబంధము-1

1. త్రిషు లింగేషు సమానః సర్వనామ 'యుష్మద్' శబ్దః।

ప్ర. – త్వమ్ – యువామ్ – యూయమ్ – కర్తా

ద్వి. – త్వామ్ (త్వా) – యువామ్ (వామ్) – యుష్మాన్ (వః) – కర్మ

తృ. – త్వయా – యువాభ్యామ్ – యుష్మాభిః – కరణ

చ. – తుభ్యమ్ (తే) – యువాభ్యామ్ (వామ్) – యుష్మభ్యమ్ – సమ్ప్ర.

పం. – త్వత్ – యువాభ్యామ్ – యుష్మత్ – అపా.

ష. – తవ (తే) – యువయోః (వామ్) – యుష్మాకమ్ (వః) – సమ్బ.

స. – త్వయి – యువయోః – యుష్మాసు – అధి.

---



## అనుబంధము-2

2. త్రిషు లింగేషు సమానః సర్వనామ 'అస్మద్' శబ్దః।

ప్ర. – అహమ్ – ఆవామ్ – వయమ్ – కర్తా.

ద్వి. – మామ్ (మా) – ఆవామ్ (నౌ) – అస్మాన్ (నః) – కర్మ.

తృ. – మయా – ఆవాభ్యామ్ – అస్మాభిః – కరణ.

చ. – మహ్యమ్ (మే) – ఆవాభ్యామ్(నౌ) – అస్మభ్యమ్ – సమ్ప్ర.

పం. – మత్ – ఆవాభ్యామ్ – అస్మత్ – అపా.

ష. – మమ (మే) – ఆవయోః (నౌ) – అస్మాకమ్ (నః) – సమ్బ.

స. – మయి – ఆవయోః – అస్మాసు – అధి.

